# తొలిపలుకు

మన తెనుఁగువారి యాదికవి, ఆంధ్ర భువనోపజీవ్యుఁడు, నన్నయ భట్టారకుఁడు "విశ్వ శ్రేయః కావ్యం" అని సకల ప్రపంచమునకును సర్వశ్రేయస్సు లను, విశిష్టమైన శ్వశ్రేయసమును గావ్యము సమకూర్చునని యుపదేశించినాఁడు. ఆ యుపదేశము నన్ని విధములను బరిపాలించినదీ "జాతక కథా గుచ్ఛ" కావ్యము.

జాతక కథల నింతకుమున్ను సంస్కృతము నుండియు, ఆంగ్లమునుండియు గద్యరూపమునఁ బెక్కండ్రనువదించి యుండిరి. పాళీ భాషనుండి నేనును గద్యరూపమునఁ గొన్నింటిని ననువదించితిని. కాని వానికి వేనికినిఁ బద్యరూప మున నున్న యీ యనువాద సౌందర్యము రాలేదు. కావుననే విశ్వ విద్యాలయముల వారు దీనినిఁ బాఠ్యముగా నిర్ణయించిరి. సహృదయు లాదరించిరి. "ప్రజానురాగ ప్రభవా హి సంపదః" అను నభియుక్తియుఁ "గావ్యం యశసేఽర్థకృతే" అను వచనమును నియ్యెడ సార్థకము లయినవి. సౌందర్యము లేకున్నఁ బ్రజాదరణము గలుగదు. ఆ సౌందర్యము సద్యః పరనిర్వృతి రూపమై చమత్కారము గూర్చుట చేతనే ప్రజల నాకర్షించినది. అదియే మన గ్రంథకర్త శ్రీ సన్నిధానము సూర్య నారాయణ శాస్త్రిగారికి యశస్సును సమకూర్చినది. ఈ కథల నితరులు గొందఱు వ్రాసినను వీరి గ్రంథమునకే ప్రశస్తి యేర్పడినదనుట 'యశసే' అను పదమును సహజముగా సమర్థించుటయేకదా!

'వ్యవహారవిదే' అను కావ్యప్రకాశ వచనానుసారముగా నా కాలమునందలి లోక వ్యవహార మీగ్రంథము వలనఁ జక్కగాఁ దెలియును. ఇందలి మేష జాతక మును బరికింపుఁడు. ఆనాఁడొకచో యజ్ఞమారంభింపఁబడినది. మేషమును వధించు టకు యాజ్ఞికుఁడు పూనుకొన్నాఁడు. వానికే విశసనమునందెక్కుడు శ్రద్ధ లేకుం డెను. నిర్బంధముపై నాతఁడు దాని నాచరించుచున్నట్లు తోఁచును. మేష వచ నము విని యాతఁడు వధింపకుండెను. దీని నాలోచించినపు డానాఁటి ప్రజలలో హింసాత్మకములగు యజ్ఞయాగాదులం దెట్టి భావము వ్యాపించియున్నదో తెలియ వచ్చును. ఆ భావమే దృఢమై క్రమముగాఁ బ్రాచీనాచారమును పీడఁజాలని వర్గము లలోఁ బిష్టపశు యాగముగాఁ బరిణమించినదని విమర్శకులందురు.

బౌద్ధ ధర్మములలో 'అహింస' ప్రధానము. వేదమునందుఁగూడ "మాహింస్యాత్సర్వా భూతాని" అని ప్రతిపాదింపబడినది, కానీ యీ యహింసను సమయోచితముగాఁ బ్రయోగింపవలయును. కనుకనే యహింసచే నత్యంతముగాఁ బ్రభావితుఁడై యర్జునుఁడు "విసృజ్య సశరంచాపం" అన్న విధమున యుద్ధమునకు వెనుకాడఁగా "క్లైబ్యం మాస్మగమః పార్థ।" అని శ్రీకృష్ణుఁడు "దీనిని విడువుము। ఇది క్లైబ్యము. దీనినిఁ బట్టుకొని వ్రేలాడినచో నీకు దేహయాత్రకూడ నడవదు." (శరీర యాత్రాపిచ తే నప్రసిద్ధ్యే దయుధ్యతః) అని దీని తత్త్వమును దెల్పినాఁడు. దీనిని గమనింపక యీ యహింసాభావమును నతిగా వ్యాపింపఁజేసి భారత ప్రజలను నిర్వీర్యుల నొనర్చి దేశమును విదేశీయుల దండయాత్రల కెరఁజేసి వారి పాద దళితులనుగా నొనర్చిన దీ బౌద్ధమతమని కొందఱి యభిప్రాయము. దాని నట్లుండనిండు.

జాతక కథలలోని క్షాంతి, అహింసాది ధర్మములు సాంఘిక జీవనములో నతిమాత్రముగాఁగాక పరిమితముగా దేశకాలపాత్రములను గుర్తించి ప్రయోగింపఁబడినచో సంఘము పరిశుద్ధమగును. దానిచే శివేతర క్షతియు సంపాదిత మగును. "అతి సర్వత్ర వర్జయే" త్తని కదా।

చక్కని ధర్మోపదేశమునిచ్చు నీకావ్య మెల్లరికి నవశ్య పాఠ్యము. ధర్మోపదేశము నీకావ్యము కాంతా సమ్మితమైన కవితామృత లహరితోఁ గూర్చినది. 1. అతి మృదులమైన భాష; 2. సరళమైన కూర్పు; 3. పాత్రోచితమైన వృత్తి; 4. తదనుగుణమైన రీతి; 5. జాతీయమైన పలుకుబడితో మేళవింపు – ఇవి 'కాంతా సమ్మితయోపదేశయుజే', 'సద్యః పరనిర్వృతయే' అను ప్రయోజనములను గల్గించి కావ్యత్వమును సమంజసముగా నొనరించుచున్నవి. క్రమముగా వాని నుదాహరింతును.

1. అతి మృదులమైన భాష : "వానికన్న ముందొ, వానితోడనొ పుట్టె" (క్షాంతివాది జాతకము 3 వ పద్యము).

2. సరళమైన కూర్పు : "పరిణత ప్రాయమునఁగాని పడయరాని" (క్షాంతివాది జాతకము 12 వ పద్యము).

3. పాత్రోచితమైన వృత్తి : (క్షాంతివాది జాతకము 58 వ పద్యము.)

4. వృత్తి కనుగుణమైన రీతి : (శిబిజాతకము 11 వ పద్యము.)

5. జాతీయమైన పలుకుబడి : ఇసుకరాలని విధమున ; ఆశ్వాసాంతము ; యుద్ధమునకుఁ గత్తి నూఱుచున్నాఁడు; తేనెపూసిన కత్తి; తంగేటిజున్ను; అజాగళస్తనములు మొదలగునవి వందలకొలఁది భాషకు జీవగఱ్ఱలయిన భాషీయములు, సంస్కృతాంధ్ర లోకోక్తులు సముచితముగా సమకూర్పఁబడి యున్నవి.

విశ్వశ్రేయమును సమకూర్చు నీ జాతక కథా గుచ్ఛమును సహృదయులెల్లరు నాదరింతురని నా విశ్వాసము. ఈనాడు పెల్లుగా వెడలుచున్న కావ్యములలో నెచ్చటనుగూడ నిట్టి కవితా సామగ్రి యరుదుగానైనఁ గన్పట్టదు. శ్రీ శాస్త్రిగారిదివఱ కిట్టి కవితతో నెన్నియో గ్రంథములను విరచించి యాంధ్రలోకము నలరించిరి. వీరి ద్వంద్వ యుద్ధము నన్నేడ్పించినది. నిజమునకు వీరి కవిత్వ మింతటి యుత్తమమని నేఁ జూపఁబూనుట నిరర్థకము. సూర్యుని దీపముతోఁ జూపెదరా ? అథవా పాఠకులు తినఁబోవుచు రుచుల నడుగుదురా ?

శాస్త్రిగారి యాంధ్రకావ్యముల వలెనే సంస్కృతకావ్యములును విద్వత్ప్రశంసాపాత్రములై యున్నవి. వీరి సంస్కృతకావ్యములను గుఱించి వ్రాయఁబడిన యభిప్రాయములఁ బరికింపుఁడు.

పూర్ణ పాత్రకావ్యప్రశంస (1-4-1959) : —సంస్కృత ప్రతిభ.

“తాదృశైః సుగమ సుందరైః ఖండకావ్యైః పూర్ణమిదం సాహిత్యపాత్రం.”

వివేకానంద కావ్యప్రశంస (1-4-61) : —సంస్కృత ప్రతిభ

“లలితమధురా కవేః శైలీ, అసమస్తపదా కావ్యరచనా; రసవతీచ వాగ్ధారా.”

రామదాస కావ్య ప్రశంస (1-4-60) : —సంస్కృత ప్రతిభ

“రమణీయార్థ ప్రతిపాదకైః శబ్దైః సందృబ్ధమిదం కావ్యం.”

“ప్రసాదగుణ సముజ్జ్వలాని సరసాని పద్యాని పాఠసమకాలమేవ హరంతి చేతః సహృదయస్య.”

—మంజూషా - *May*, 1961.

“The Style is smooth, graceful and poetic. He succeedes remarkably in sustaining the reader's attention; and in his hands, sanskrit has really become a living language.”

*—Prabudda Bharata - September*, 1961

“The author has an evident command over the Language, writes in a simple and pleasing style, with happy coinings for modern terms and lets in the various Alankaras, and other poetic displays of wit, wisdom and emotion in a most natural manner. An elevating subject presented in a delightful form.”

*—Vedanta Kesari - February*, 1961

"In the work (పూర్ణపాత్రం) under reference, he has collected together many a gem of thougt found in Telugu works of his own and rendered them into delectable sanskrit verses."

—*Bhavan's Journal* - 15*th November*, 1959.

"They (త్రికం) contain charming discriptions and are couched in easy and mellifluent Style."

*Bhavan's Journal* - 29*th November*, 1959.

"The learned author writes elegant sanskrit which will be read with interest and relish by all lovers of the language "

—*Chintaharan Chakravarthi* - *Modern Review* - *April*, 1960.

పెక్కండ్రకు వీరి సంస్కృత కావ్యములఁగూర్చి తెలియదని యెత్తి చూపితిని. ఈ యభిప్రాయములు వ్రాసినవారందఱును మహా విద్వాంసులు. ఈనాఁడాంధ్రదేశమున నీవిధముగా సంస్కృతాంధ్రముల రెంటను సమానముగా రసవత్తర కావ్యములను వ్రాయువా రెందఱు గలరు ?

కవులై కావ్యములనేకాక 'తత్సమ చంద్రిక' యను నొక గొప్ప వ్యాకరణ గ్రంథమును విరచించిరి. ఆంధ్రభాషకు వలసినంత సంస్కృత వ్యాకరణ విషయమంతయు నాంధ్రులకు గరతలామలకాయమానముగా నిందుఁ గలదు. మరియుఁ గావ్యాలంకారసంగ్రహ వివరణము' అను విపులమైన యలంకార గ్రంథమును విరచించిరి. ఇవి బండపనులు. ఈ విధముగా భాష కెంతో సేవఁజేసిరి; చేయుచున్నారు. ఇందులకు వీరి నభినందించుచున్నాను.

శ్రీ శాస్త్రిగారింకను జిరకాల మిట్టి కావ్యముల రచించుచు భాషాసేవ చేయుదురు గాక !

23-11-61
హైదరాబాద్

వేదాల తిరువేంగళాచార్యులు
తర్కాలంకార వేదాంతాధ్యాపకులు
సీతారాంబాగ్ సంస్కృత కళాశాల, ఆంధ్రప్రదేశ్.

# మలిపలుకు

జాతకకథలనఁగా నేఁటికి రమారమి రెండువేల నన్నూఱేండ్లకు ముందు మన హిందూదేశమున జనియించిన మత ప్రవక్తలలోఁ బ్రథమాచార్యుఁడగు గౌతమబుద్ధుని పూర్వావతారకథలు. శూన్యవాదము, నిరాత్మవాదము మొదలగు బౌద్ధ సిద్ధాంతములను ఖండించిన శ్రీ శంకరాచార్యులవారు సైతము యా సిద్ధాంతమునే జగన్మిథ్యాత్వరూపమునఁ బ్రతిపాదించుటఁజేసి కాఁబోలు బ్రచ్ఛన్న బౌద్ధుఁడని పరమతస్థులచే దూషింపబడిరి. ఆ కాలమందలి జను లాతనిని భగవంతునిఁగానే సంభావించిరన్న నతిశయోక్తి కాదు. దుష్టశిక్షణ శిష్టరక్షణార్థము శ్రీమన్నారాయణుఁడు దశావతారములు ధరించెనని విశ్వసించు హిందూ ధర్మావలంబకులవలెనే తన్మతావలంబకులగు తద్భక్తు లా మహాత్ముఁడును క్షాంతి, దాంతి, భూతదయా, దాన, వైరాగాద్యులగు ధర్మములను బోధించి యైహికసుఖపరతంత్రమగు మూఢ హృదయములను నిర్వాణపరతంత్రములనుగాఁ జేసి లోకము నుద్ధరింపఁదలఁచి యేదున్నూట నలువదేడవతారము లెత్తెనని విశ్వసించుచున్నారు. ప్రత్యవతారమునందును శ్రీమన్నారాయణునివలెనే లోకోపకారార్థము మహాత్యాగము గావించెననియు నమ్ముచున్నారు. హిందూమతస్థులు బుద్ధుఁడు నారాయణావతారమని విశ్వసించినను బౌద్ధులట్లు విశ్వసింపరు.

యథార్థము విచారింప హిందూ బౌద్ధ మతసిద్ధాంతములకు వైజాత్యముకన్న సాజాత్య మధికము. ఈ విషయమును నిట గ్రంథవిస్తరభీతిచే సంగ్రహింతును. బుద్ధుఁడు చార్వాకునివలె నాస్తికుఁడు గాఁడు. హిందూ గృహస్థులకువలె వేదోక్తములగు గార్హస్థ్య ధర్మములలో హింసాత్మకములగు శ్రౌతయజ్ఞ యాగములును చాతుర్వర్ణ్య భేదమును బుద్ధునకు సమ్మతములుగావు. "మరియు నచింత్యమైన యాత్మానాత్మవిచార మను శుష్క వాదములోఁ బడక వైరాగ్యముచే మనస్సును నిష్కామముగాఁ జేసికొమ్ము; ఆత్మ యున్నను లేకున్నను మనోనిగ్రహము ప్రథమకార్యము." అనియే బుద్ధుని సిద్ధాంతము. ఆకాలమున మతాచార్యులు తమ తమ మతసిద్ధాంతములఁ గూర్చి యభినివేశముతో వాద ప్రతివాదములు చేయుచుండుటచే బుద్ధుఁడీ వాదములలోఁ బ్రవేశింపక పైవిధమునఁ దెలిపెను. శంకరులవారు నుడివిన బ్రహ్మముగానీ యాత్మగానీ బొత్తుగా లేనేలేదని యాతని యుద్దేశముగాదు.

ఏలనఁ గొన్ని సుత్తలందు బుద్ధుఁడే బ్రహ్మసాయుజ్యస్థితి నుదాహరించెను. మరియు "నేను బ్రహ్మభూతుఁడనైయున్నాను" అని పెక్కుచోట్ల ముక్తకంఠముతోఁ బలికెను. ఆత్మనుగూర్చి చేయు పాతాళ ప్రశ్నలు మాని "అహింస, సత్యము, అస్తేయము, శౌచము, మనఃపూతత, సత్పాత్రదానము, ఆత్మౌపమ్యదృష్టి" మొదలగు నిర్వాణ ప్రాప్తిసాధనముల నవలంబింపుఁడని బోధించెను. రోగమును గుదుర్చుటకుముందు దాని మూలకారణమును గుర్తించి వైద్యుఁడు దానినిఁ దొలఁగించునట్లు సాంసారిక దుఃఖరూపమగు రోగము నుపశమింపఁజేయుటకుఁ దత్కారణ మారసి నిర్మూలింప వలయును. సంసారదుఃఖమునకుఁ గారణము తృష్ణ లేక వాసన. ఒక నామరూపాత్మకమగు దేహము నశించినపిమ్మట మిగిలియున్న యీ వాసనాత్మక బీజమునుండి మఱొక నామరూపాత్మకమైన దేహము వెలువడును. దానినుండి వేఱొకటి యుద యించును. కావున నీ పునర్జన్మరూపమగు సంసారదుఃఖమునుండి విముక్తుఁడగుటకు మానవుఁడు యత్నింపవలెను. దానికి సాధనములు వైరాగ్యము, ఇంద్రియ నిగ్రహము, అహింస, భూతదయ మొదలగునవి. వీనిమూలమునఁ దృష్ణ లేక వాసన నున్మూలింపవలయును. ఈ క్రమమునే బౌద్ధులు దుఃఖము, సముదయము, నిరోధము, మార్గము అని పేర్కొని వీనికి నార్యసత్యములని పేరిడిరి. ఇందలి నాల్గవ సత్యమైన మార్గము, అనఁగా వాసనాక్షయము లేక తృష్ణాక్షయము లేక నిర్వాణము (దీప మాఱిపోయినవిధమున వాసనలాఱుట) ను బొందుటకు మనుష్యుఁడు మనస్సును నిర్విషయముగాఁ జేసికొనుట. ఉపనిషత్కారులు చెప్పిన ఆత్మనిష్ఠ, బ్రహ్మసంస్థ, బ్రహ్మభూతత, బ్రహ్మనిర్వాణము అను నవస్థయుఁ బైని బుద్ధుని నాల్గవ సత్యమగు మార్గమును భిన్నములుగావనియే తోఁచును. రెండు ధర్మములయందును మనస్సు యొక్క నిర్విషయస్థితియే సాధ్యము.

బుద్ధుఁడాత్మాస్తిత్వము నిర్ధారింపకున్నను జిత్తమును బ్రశాంతము విరక్తము నిష్కామముగను జేయుటకు సోపానములగు వైరాగ్యాదులే నిర్వాణప్రాప్తిసాధనములని చెప్పుటవలన నుపనిషత్కారుల మోక్షసాధనములే పేర్కొనఁబడినవగుచున్నవి. కావున బౌద్ధులయొక్కయు హిందువులయొక్కయు వర్ణన లీషద్భేదముతో సరిపోవుచున్నవి. మరియుఁ బునర్జన్మ సిద్ధాంతములు, పాపపుణ్య ఫలకల్పనములు, కర్మవిపాకము మొదలగునవన్నియు నీ రెండు మతములందును దుల్యములే. కావున గృహస్థాచరణీయ యజ్ఞయాగాది కర్మలయందును, జాతుర్వర్ణ్య వ్యవస్థాదికములగు కొన్ని యల్ప విషయములందును దక్క నవశిష్టములగు మతధర్మములందు హిందూ బౌద్ధులకు భేదము లేదనవచ్చును. బౌద్ధమతము నూతన సిద్ధాంతములను దెలుపలేదు. లెస్సగా విచారింప బౌద్ధధర్మ మను పుత్రుఁడు వైదిక ధర్మమను తండ్రికడఁ బంచుకొని వేఱుపడ్డవాఁడే కాని భిన్నుఁడుగాఁడు. అనఁగా బౌద్ధ సిద్ధాంతము సనాతన హిందూధర్మమునుండి గ్రహింపఁబడినదే కాని క్రొత్తదికాదు.

ఆకాలమున వైదికమత మడుగంటి బౌద్ధమతమే విశేషముగా భరతఖండ మెల్ల నేల వ్యాపించెనన్న గృహస్థులకు యజ్ఞయాగాది కర్మకాండపీడయుఁ జాతుర్వర్ణ్య భేదపిశాచమును వదలిపోవుటచేతనే యయి యుండునని నా యూహ. మరియు నీ బౌద్ధమతము భరతఖండవు టెల్లఁ దాటి టిబేటు, చైనా, జావా, సుమిత్రా, సింహళములకును బరువెత్తి పోయినది.

వైదిక ధర్మములను బురాణములువోలె బౌద్ధధర్మములను జాతకకథలు వివరించుచున్నవి. జనసామాన్యము కథలమూలమున విజ్ఞానమును సాధించునట్లు శుష్క వేదాంత గ్రంథములవలన సాధింపదనుట నిర్వివాదాంశము. కావ్యము కాంతా సమ్మితమనుటలోఁగల రహస్య మిదియే. అట్లగుటఁ బ్రపంచములోని యెల్ల భాషల యందును గావ్య వాఙ్మయమునకుఁగల ప్రతిష్ఠ విశిష్టము.

ఈ జాతక కథలు మొట్టమొదటఁ బాళీభాషలో వ్రాయఁబడియున్నవి. వీని లోని ముప్పదిరెండు కథలను ఆర్యశూరుఁడను కవి సంస్కృతీకరించి 'జాతకమాల' యని పేరిడెను.

మొదట దానినుండి యయిదు కథలను మాత్రము గొని గ్రంథమును విరచించితిని. ఆంధ్ర, మద్రాసు, మైసూరు విశ్వవిద్యాలయములవారు దానినిఁ బాఠ్యముగాఁ జేసిరి. పెక్కు పత్రికలవారు దానిని నాదరించిరి. వీనిచేఁ బ్రోత్సాహితుఁడనై మరి పదికథలను రచించి రెండవ భాగముగాఁ బ్రకటించితిని. దీనినిఁ గూడఁ బత్రికలవారును, విశ్వవిద్యాలయములవారును, సహృదయులును నాదరించుటచే మరికొన్ని కథలను వ్రాసి మూఁడవ భాగముగాఁ జేసితిని. భిన్నభిన్న కాలములలో రచింపఁబడుటచే భాగ విభాగము చేయఁబడినది. అంతకన్న వేఱు కారణము లేదు. మూఁడవ భాగము రచింపఁబడి పెద్దకాలమైనది. మొదటి రెండు భాగముల ప్రతులును జెల్లిపోయియుఁ జిరకాలమైనది. మూఁడు భాగములను గలిపి ముద్రింపఁ దలఁచి యార్థిక సాహాయ్యములేక పది యేండ్లనుండి నిరీక్షించుచున్నాను. ఎండ మావులలోఁ బడి తుదికి విసిగి దినదినమునకు వార్ధక్యము పైఁబడుచుండుటచే మృత్యువువాతఁ బడకముందే వ్రాసిన దానిని ముద్రించి సహృదయులకు సమర్పింపఁదలఁచి వ్యయభారమునకుఁ బూనితిని. తండ్రి తన కన్నబిడ్డను దన జీవిత కాలమునందే యొక యింటిదానినిఁ జేయవలెనని యభిలషించునుగదా!

ఈ కథలు మొదట మతప్రచారార్థము బయలుదేరినవి. వీనిలోఁ గావ్య శిల్పము కొఱవడియున్నది. నాకుఁ దోఁచిన విధమున రసానుకూలముగాఁ గొలఁది మార్పులు వీనిలోఁ జేసితిని.

—గ్రంథకర్త.

# విషయసూచీ

ప్రథమభాగము



ద్వితీయభాగము



తృతీయభాగము





# జాతక కథా గుచ్ఛము

## ప్రథమ భాగము

---

## క్షాంతివాది జాతకము

క. ఒకతూరి బోధిసత్త్వం
దకలంకప్రకృతి బ్రాహ్మణాన్వయమందున్
సకలగుణార్ణవుఁ డగు పు
త్త్రకుఁడై శుభలగ్నమందుఁ బ్రభవం బయ్యెన్. ౧

ఉ. పున్నమచందమామ నగు ముద్దుమొగంబును, దమ్మిరేకులన్
బన్నపడంగఁజేయు నయనమ్ములుఁ, జక్కనియెత్తు నెన్నొసల్
పెన్నురమున్, దృఢాంగమును, బెంపగు మూఁపులు, దీర్ఘబాహువుల్
సొన్నపుమేనిచాయఁ దగి శోభిలు నాతఁడు చక్కనయ్య నాన్. ౨

ఆ. వె. వానికన్న ముందొ? వానితోడనొ పుట్టె
భూతదయ ప్రభూతముగ నెడంద
క్షాంతి దాంతి తొట్టి సద్గుణసముదాయ
ముగ్గుపాలతోడ నుప్పతిల్లె. ౩

క. కలవకయ సకలవిద్యలుఁ
గరామలక మయ్యె: నందుఁ గల ధర్మంబుల్
చరియించుచుండుఁ దూ చాఁ
బరిత్యజింపక యతండు బాల్యమునుండిన్. ౪

సీ. కుంటిగ్రుడ్డులఁ జేరి కూడుగుడ్డ లొసంగి
వలసిన యుపచారముల నొనర్చు;
నాఁకలిగొన్న నాగాంతకునకు నైనఁ
గొంచక మెయికండ గోసియిచ్చుఁ;

ప్రాణంబుల హరించు పాఁపపుర్వులనేనిఁ
గన్నబిడ్డలరీఁతి గాచి వదలు;
నలకంగఁ బడుచున్న తరుగుల్మములనేనిఁ
గని కంటఁ దడిపెట్టుకొనుచు నుండు;
ఆ. వె. ఎత్తువడ్డపసుల నెత్తి మూఁపున మోయుఁ;
బులుఁగుకాలు విఱుగఁ బూయు మందు:
నతఁడు ముల్లువిఱుగఁ బ్రాణిమాత్రమునకు
బిట్టుఁ బొగులుఁ దేలు కుట్టినట్లు.

క. చదువును జక్కఁదనమును
గుదురును దన మనసుఁ జూఱగొనవచ్చె యశ
స్సుదతీరత్నము తెలియని
మదనావేశమున నా కుమారుని కడకున్.

ఆ. వె. బలిసె రెట్ట; కండపట్టె శరీరంబు
గట్టిపాఱె; మీసకట్టువచ్చె;
జవ్వనంపుమిసిమి సర్వాంగములనిండఁ
గన్నులను విరక్తిచిన్నె లొదవె.

ఉ. చక్కని చుక్కలై, చదువుసంపదలన్ శుభలక్షణంబులన్
మిక్కిలివారలై, రమణినిన్ దలపించెడు చొక్కమందులై
చక్కెరవిల్తు కోల లయి చక్కెరబొమ్మలు నైనవారలన్
బెక్కురు విప్రు లాతనికి బిడ్డల నీయఁగ వచ్చి రత్తఱిన్.

క. తనయెత్తు ధనమువోయుదు
మని తమబిడ్డలను బెండ్లియాడు మటంచున్
వినిపింప వార లాతఁడు
వనిత యనినఁ గంపతొడుగు వలె నెంచె మదిన్.

ఉ. ఎందఱో సుందరుల్ పలవరింత్రు జపించుచు వాని నామముల్;
ఎందఱో వాని పొం దభిలషించుచు వేల్పుల మ్రొక్కుకొందు; రిం
కెందఱో మందు ప్రాఁకులు వహింతురు వాని వశంబు సేకొనన్;
అందని మ్రానిపండునకు నఱ్ఱులు సాఁచుటగా నెఱుంగమిన్. ౧౦

క. వంచిన తల యెత్తఁడు, నొ
ప్పించఁడు పల్లెత్తుమాటఁ బెఱవారల, వీ
క్షించఁడు వెలిచూపునను ప్ర
పంచము, లోచూపు వదలి వర్తిలఁ డెపుడున్. ౧౧

గీ. పరిణతప్రాయమునఁ గాని పడయరాని
దృఢవిరాగంబును, గురూపదేశమునను
గాని కొనరాని తత్త్వవిజ్ఞాన మతని
వలచి వచ్చెనొ? నిండు జవ్వనముఁ జూచి. ౧౨

సీ. నలఁకంగఁ బడుచున్న తరుగుల్మ వల్లీ క
దంబంబు క్షాంతి పాఠంబు నేర్పఁ
గంటకక్షతులచేఁ గదలంగఁబాఱని
పాషాణములు దృఢవ్రతతఁ గఱప
క్షణభంగురములైన జలబుద్బుదంబులు
దేహాస్థిరత్వంబుఁ దెలుపుచుండఁ
బొడుపుఁ గ్రుంకులు దినంబును బొందు వేవెల్గు
జన్మపారంపరిం జదువఁజేయ
గీ. వెలుఁగుఁ జీఁకట్లు సుఖదుఃఖముల యశాశ్వ
తత్వ మెఱిఁగింప నాత్మ నిత్యతను బాడ
శైలసంతతి యాచార్యుఁ డేలవలయు?
క్షితినిఁ దత్త్వోపదేశంబు సేయుపొంటె. ౧౩

గీ. అపర శుకమహర్షి యంచుఁ గొందఱు వల్కఁ
జెప్పఁ బెక్కుమంది సిద్ధుఁడనుచు
యౌవనమున దుర్జయంబైన యింద్రియ
గ్రామ మడఁచి లెస్సగ్రాలె నతఁడు.

క. మనమున జనియించెను బ్రా
క్తన సంస్కారమున మోక్షకాంక్ష యతనికిన్
గనువేఁదుఱు గల యా జ
వ్వనంబున నలౌకిక స్వభావుం డగుటన్.

క. నరులకుఁ గలిగెడు నానా
జరామరణ దుఃఖవితతి సహ్యముగామిన్
బొరలఁగఁ గన్గొ రతఁ డొం
టరిగాఁ గూర్చుండి యిట్లెడందఁ దలంచెన్.

గీ. "పాపభూయిష్ఠమగు నీ ప్రపంచకమునఁ
బుట్టుఁ; జచ్చును; గ్రమ్మఱఁ బుట్టుఁ జచ్చుఁ;
బుట్టు చావులు వెండియుం బొందుకొనుచుఁ
జక్రనేమి క్రమంబున జనుఁడు దిరుగు.

సీ. పలు విష క్రిమికీటములకుఁ దావలమయి
పాడ్వడ్డ చీఁకటిబావి యంచు
నలువలంకులఁ దీరములులేని యుల్లోల
కల్లోలమగు లోఁతుకడలి యంచు
బొబ్బరిల్లుచు సింగములు పులుల్ పొదరిండ్లఁ
గడుకొన్న దట్టంపు టడవి యంచుఁ
గ్రుళ్లి పుర్వులుపడి రోఁత సేయుచు గౌలు
గొలిపెడు పెను తొచ్చుగుంట యంచు

గీ. రోసి సంసారముం బాసి కోసివేసి
దారపుత్త్రధనాదిబంధముల నెల్ల
నారలు ధరించి పడసి మనఃప్రశాంతి
నడవిఁ బట్టిరి మన తొంటి యార్యజనులు. ౧౮

ఆ. వె. పూఁతపసిఁడివోలెఁ; బొదిగి చక్కెరతోడ
మాటినట్టి విసపుమాత్రపగిది
నైహికంపు సౌఖ్య మాపాతహృద్యంబు
తుదికిఁ దద్రహస్య మెదకుఁ దెలియు. ౧౯

క. గిరిఁ ద్రవ్వి యెలుకఁబట్టిన
కరణి వ్యయపఱచి యమూల్యకాలం బెల్లన్
నరుఁ డణుతర సుఖమునకై
పరిశ్రమించుచు వహించు బహుదుఃఖములన్. ౨౦

ఆ. వె. కుడితిబడ్డ యెలుక వడువునఁ, బెనురొంపిఁ
గూలఁబడ్డ యేన్గుగున్న భాతి,
ముండ్లకొమ్మఁబడ్డ పుట్టంబునై జనుం
డైహికములఁ జిక్కి యలఁత గాంచు. ౨౧

మ. మలభాండంబగు నీ శరీరమును సమ్మానించి కైసేసి భూ
షలఁ జీనాంబరరాశి రేబవ లిదే స్వర్గం బిదే మోక్షమం
చలరుంబోఁడులఁగూడి మానవుఁడు నాట్యంబాడుచుం బాడుచుం
గులుకుం బంగరు తూఁగుటుయ్యేలలఁ దూఁగుం దత్త్వసమ్మూఢుఁడై.

క. తన దారపుత్త్రధనములు
తను వెనుకొని వచ్చుననియొ? తా నీ లోకం
బున నుట్టిగట్టి యూఁగుదు
ననియో! యనుకొనుచు మర్త్యుఁ డరయఁడు పరమున్. ౨౩

శా. మేడల్ మిద్దెలు దొడ్లు తోఁటలును నిర్మింపన్ వలెన్, గ్రొత్తపెం
డ్లాడంగావలె యౌవతంబును, నమూల్యంబైన భూషాదులన్
వాడంగాఁ గొనఁగావలెన్ననుచుఁ జింతల్ సేయుఁగానీ నరుం
డేఁడున్ వార్ధకమందునేని విడఁ డీస్సీ! తృష్ణ యావంతయున్.

క. తన జీవితలక్ష్యంబే?
మని 'దానిని డాయుమార్గ మదియే' మనియున్
అనుకొనఁ డే కోశమునను
మనుజుం డొకపరియు మోహమగ్నత్వమునన్.

ఆ. వె. ఆత్మలక్ష్యరోధు లగుచున్న యాంతర
శత్రువుల జయింపఁజాల కిస్సి!
బాహ్యశత్రుగణము పయి కేల దండెత్త?
నింటగెలిచి రచ్చకెక్కఁజెల్లు.

క. మొలకెత్తి యెదఁదమూలను
మెలమెలఁగా సాఁగి, యాక్రమించి కెలంకుల్
బలముగ నల్లు విషయశా
ఖల నాశాలతిక; ద్రెంపఁగాదు నరునకున్.

క. ఒక విషయము సిద్ధింప మ
తొక విషయముపైకిఁ బ్రాఁకు; నొదవిన నది వే
తొకవిషయమునకు సాఁగును;
సకలం బీ వరుసఁ దృష్ణ జగ మల్లుకొనున్.

ఆ. వె. ఆశవలనఁ గ్రోధ; మద్దానఁ బాపంబు;
దాన నరక; మీ విధముగ సతము
ఆశ వేరు దన్ని యజ్ఞానముం బెంచి
భవపరంపరలకుఁ బనుచు జనుని.

క. సరిరాదం ద్రిహసుఖముం
బరలోకసుఖంబుఁ గోటిపాలున కేనిం
బురుషుని మనసున కాశను
బరిమార్చుటవలనఁ గలుగు పరసుఖమునకున్. ౩౦

గీ. అంటుకొన్నఁ దగిలి తంటసంబన లాగు
విషయసంగమంబు వీడిపోక;
అడుసుఁద్రొక్కనేల ? యడుగేల కడుగంగ ?
సన్న్యసించి తపము సలుపుకొందు." ౩౧

ఆ. వె. అనుచు దారసంగ్రహముఁరోసి తృణముగా
నెంచి బంధనములఁ ద్రెంచి యెల్ల
నొక్కనాఁటిరేయి యొంటిమై నతఁడేగి
యాశ్రయించె నొక్క యాశ్రమంబు. ౩౨

క. కాంతాకనకంబుల క
శ్రాంతము దాస్యంబుసేయు సంసారుల కొ
క్కింతయును బోధిసత్త్వుని
శాంతియు దాంతియు రుచింపఁ జాలునె ? యరయన్. ౩౩

సీ. చెక్కించి చక్కఁగా సిద్ధంబుగాఁ జేయఁ
గాఁ బడినట్లున్న కందరములు
ప్రతిదినంబును నీరుపట్టి లెస్సగఁ బెంపఁ
బడుచున్నగతిఁ బొల్చు పండ్లచెట్లు
ఇచ్ఛవచ్చినరీతి ఋషివరుల్ త్రిప్పి కొ
న్నట్లుగాఁ బ్రవహించునట్టి యేఱు
కల్పించి యొక్కనికై యేర్పఱచినట్లు
పొదలుచుండెడి పువ్వుఁబొదరుటిండ్లు

గీ. తరతమత్వంబు వెలిఁగ బెద్దగను బేర్పఁ
గాఁ బడినరీతిఁ గొమరారు గండశిలలుఁ
గలిగి చిత్తరుబొమ్మనాఁ గానఁబడుచు
నాత్మ కానంద మొసఁగు నా యాశ్రమంబు.

ఆ. వె. అచటి తపసు లతని కర్ఘ్యపాద్యము లిచ్చి
తలఁచుకొనుచుఁ దమ్ము ధన్యులుగను
దదుపదేశములకు నెద నిచ్ఛగించుచు
శిష్యులయిరి మెల్లఁ జెంతఁజేరి.

గీ. పెద్దకాలంబునుండి యా విపినవర్తి
వృక్షతతి నా వయోమాత్రవృద్ధు లయిన
తపసు లా జ్ఞానవృద్ధు ప్రాంతమున నిలువ
దివ్విటీ క్రింది దివ్వెల తెన్ను దోఁచె.

ఆ. వె. వానిశాంతమూర్తి వానివైరాగ్యంబు
వాని వదనబ్రహ్మవర్చసంబు
వాని సత్త్వవృత్తిఁ బరికించి భావించి
రా తపస్వి దేవమూత యనుచు.

సీ. శ్రుతిపర్వముగఁ గలశ్రుతు లొనర్చెడు శకుం
తములు గూర్మిని స్వాగతములు సదివె
నెడనీటి కెనయైన కడుఁ దియ్యనీటితోఁ
బఱచు వాఁగులు నీరువట్టు మాన్చె
నారఁబండియు నేల కంటుకొమ్మలు గల్గు
వసుధారుహంబులు పం డ్లొసంగె
నల్లిబిల్లిగఁ దీఁగలల్లి చల్లనినీడ
లిడుచున్న పొదరిండ్లు విడుదు లొసఁగె

గీ. కార్మేకంబులు వచ్చి సఖ్యం బొనర్చెఁ;
బాఁప మొత్తంబు పడగల వ్రాల్చి కొలిచె;
రాలురప్పలు ముండ్లు మార్దవముఁబూని
యడుగు లొత్తుచు సేవించె నా మునీంద్రు. ౩౮

ఆ. వె. చిగురు దొడిగె మ్రోడుచెట్లు దట్టంబుగా;
వంజమ్రాఁకు లెల్లఁ బండ్లుగాచె;
క్షారజలము మధురజలమయ్యెఁ బేయమై;
యా వనంబు నందు నతని రాక. ౩౯

క. నడివేసఁగి మిడియెండను,
గడితంబుగఁ గుంభవృష్టి గల తొలకరినిన్,
వడఁకించెడు చలితతి, నా
తఁడు బయలనె గోచివెట్టి తప మొనరించున్. ౪౦

గీ. అహరహము సాయములయందు నాశ్రమంబు
నారుబయలునఁ గూర్చుండి యట మునీంద్ర
బాలికాళికి ధర్మముల్ వక్కణించు
నా యమీంద్రుడు మధురవాక్యామృతమున. ౪౧

గీ. దురవగాహంబులై చిక్కువడుచున్న
తత్త్వ శాస్త్రార్థముల నద్భుతముగఁ దెలుపు
నరఁటిపం డొల్చిపెట్టిన కరణి నతఁడు
దీర్ఘకాలానుభవము సాధించినట్లు. ౪౨

క. పలుశాస్త్రంబులు సదివినఁ
గలుగంబో దనుభవం బొకని; కొక్కనికిన్
గలుగును జదువకయున్నను
బలితం బగు పూర్వజన్మ వాసన కతనన్. ౪౩

"గీ. తన్నుఁ బరులు కొట్టుచున్నఁ దిట్టుచు నున్నఁ
జంపుచున్న నరుఁడు క్షాంతివిడక
రాతిగుండెయైన ద్రవియించి యేఱులై
పఱచునట్లు సేయవలయుఁగాదె।

చ. ఒఱపిడినైన క్షాంతిఁ గొనియుంటనె రత్నము ప్రోజ్జ్వలించుఁ; దన్
నఱకిన వానికిం దరువు నైకముగా ఫలపుష్ప శాఖలన్
గరుణవహించి యిచ్చుఁ గొని క్షాంతియె; కొంచక తన్నుఁ ద్రొక్కినన్
ధరణి వహించు జంతుతతిఁ దాల్చియె క్షాంతి నిరంతరంబుగన్."

క. శాంతియు దాంతియు క్షాంతియు
గొంతైనను దొఱఁకనీయఁ గూడ దవియె య
శ్రాంతము విశ్రాంతిని మన
స్స్వాంతంబున కొసఁగి మోక్షసాధకము లగున్."

ఆ. వె. అనుచు క్షాంతిఁబూని యదె ధర్మసారమం
చన్యులకును గఱపు నాచరించు
క్షాంతివాది యంచు సార్థకనామంబుఁ
దాల్చియుండె నతఁడు దానఁ జేసి.

శా. ఆతం డచ్చటనున్న నాటఁగొలెఁ బుణ్యక్షేత్ర కల్పంబుగా
ఖ్యాతింగొన్న తదాశ్రమంబునకు నా యా యాత్రికుల్ పోవుచున్
ధాతం బోలిన యా మహామునిని సందర్శించి సద్భక్తిమై
పూతత్వంబు వహించు చుందు రనిశంబుం బ్రీతచిత్తంబునన్.

చ. జరపుచునుండఁ గాలము ప్రశాంతముగా మునిచంద్రుఁ డీ గతిం
దరులకు వన్నెదిద్దుచు, లతాతతికిన్ రమణీయ నాట్యముల్
కఱపుచు శ్రోత్రపేయముగ గానము నేర్పుచుఁ గోకిలాళికిన్
సరస కళాప్రపూర్ణుఁడు వసంతుఁడు చక్కఁగ దిగ్గె భూమికిన్.

క. తరువులు సృజింపఁ దొడఁగెను
స్మరునకుఁ గావలయు నిశితశరజాలం బ
త్తఱి నా వసంతు నాజ్ఞను
మరంద దుర్విషహ విష నిమగ్నంబులుగాన్. ౫౦

ఆ. వె. ముడిఁచి యొడలు చలికి మూఁడంకెగాఁ బండి
నిదురఁ గూరుచున్న మదనుఁ డపుడు
కనులు నులుముకొనుచుఁ గాల్సేతులను సాఁగఁ
దీసికొనుచుఁ బాన్పు దిగెను మెల్ల. ౫౧

క. తరుణీతరుణుల మనములఁ
బెరపెర ప్రారంభమయ్యెఁ బెద్దగ నా క్రొ
వ్విరి విల్తుఁ డమ్ము దొడుగఁగఁ
జెఱకునఁ జుఱుకెక్కి మెల్ల సీతువు దొలఁగన్. ౫౨

మ. వలపుల్ చిమ్ముచుఁ బువ్వుగుత్తుల మనః పర్వంబు గావించు దీ
వలు పేటెత్తిన లజ్జఁ దూఁగుచుఁ దరువ్రాతంబు పైవ్రాలుఁ; గౌఁ
గిలికిన్ లాగును లాఁతి తీవియలనున్ గ్రేకొట్టు మోహంబునన్;
గిలిగింతల్ పచరించు గండశిలలం గ్రేళ్లుబ్బు నెయ్యంబునన్. ౫౩

ఆ. వె. తపనతాప మదన తాపంబు లొండొండు
తీసిపోక రెచ్చ దినదినంబు
యువతి యువకజనము లుత్సాహమొందిరి
గృహసరోవరములఁ గ్రీడలాడ. ౫౪

క. అత్తఱి నా దేశపు రా
జోత్తముఁడు వధూశతంబు నొగి జలకేళీ
చిత్తుం డయి కొని యా ముని
సత్తము వన మంటియున్న సరసున కరిగెన్. ౫౫

క. విడియించి యా మనోహర
తడాగతట మందుఁ గల లతాగృహముల న
య్యెడయఁడు తన శుద్ధాంతపుఁ
బడఁతుల క్రీడలకుఁ జిక్కి వర్తిలుచుండెన్.

క. కుతిదీఱక యొకరూపున
శతావతారములు దాల్చి చరియించెడినో
రతి పువ్విల్తునిఁ గలియఁగ
క్షితి నన యువతీజనంబు గెరలుచు నుండెన్.

మ. లలనల్ మన్మథపూజ సేయుచు, సముల్లాసంబుగాఁ బాడుచున్
గలకంఠమ్ములఁ గమ్మఁదేనియలవాఁకల్ పాఱ, మంజీరమం
జుల నాదంబు లెసంగ లాస్యములు మెచ్చుల్పుట్టఁ గావించు చు
య్యేలలం దూఁగుచు సంచరించి రచటన్ హృద్యంబుగా షేనికిన్.

క. పువ్వులబంతులఁ బ్రియుపై
ఱువ్వుచు నెల జవ్వనంపుఁ గ్రొవ్వునఁ దమపై
ఱువ్వించుకొనఁగఁ దరుణులు
నవ్వుచుఁ గవ్వించి రతని నానాగతులన్.

క. కలకంఠుల గానముఁ గో
కిలనాదముఁ గలియఁబడగఁ గీరరుతంబుల్
పలుకులు సరిపడ నరపతి
తెలియక తబ్బిబ్బు గొనె మదిన్ నవ్వఁ జెలుల్.

చ. తడఁబడుచున్న మాటలు, నితాంతము బిత్తరిచూపు, మెల్లనై
చిడిముడిగొన్న నెన్నడలు, చెల్వము దోఁచుట మోముదామరన్
బడఁతులకున్ స్వభావ మెలప్రాయమునం దిఁక మద్యపాన మి
బ్బడిగ నొనర్చె నత్తఱి నృపాలుని డెందము చిందులాడఁగన్,

సీ. రమణీయకేశపాశము విప్పి విరియించి
నెమిలిరూపమునఁ గాన్పించె నొకతె
పలువర్ణభూషణాంబరములం గొని పంచ
వన్నె చిల్కగను గన్పట్టె నొకతె
తరళదృక్కులు పర్వఁ బఱతెంచు చట్టిట్టు
బాలకురంగినాఁ గ్రాలె నొకతె
మిసమిసలాడుమైపస నింపు నింపుచుఁ
బూవుదీవియవోలెఁ బొలిచె నొకతె
గీ. అయ్యయి పదార్థముల కడ నయ్యయిగతిఁ
గానిపించుచు నెకిమీని మానసంబు
నలరుఁబోండ్లు హరింపఁగా నహమహమికఁ
బూని నడయాడఁ దొడఁగి రా పువ్వుఁదోఁట. ౬౨

క. పొలయలుకఁ దీర్చు చొక చెలి,
కులికించునుఁ జిలిపి పనుల నొక యువతినిఁ, గో
యిలఁ బోలె నొకతె నెగచుచుఁ,
బలువిధముల రాజు రాణివాస మలర్చెన్. ౬౩

క. కరిణీయూథము తోడం
గరీంద్రుఁడుం బలె వధూటికాతతితోడన్
ధరణీపాలోత్తముఁడు వి
హరించుచు మునింగి తేలె నానందాబ్ధిన్. ౬౪

ఆ. వె. సలిపి సలిలకేళి స్మరకేళి సవరించి
యా నరేంద్రచంద్రుఁ డలఁతఁగాంచి
పొదరుటీరమందుఁ బూపాన్పుపైఁ బండి
నిదురవోయె హాయి గదుర మదికి. ౬౫

క. అలసట నడంచు; దుఃఖం
బుల నిర్మూలించు నూఁచముట్టుగ; సంప
న్నులను దరిద్రుల సరిగా
వలచిన చెలి నిద్ర దానివంటిది గలదే?

క. వనరామణీయకమునకుఁ
దనియక పతి నిద్రగొంట దరిసించి విలా
సిను లెల్ల రా ప్రదేశముఁ
గనువేడుక వెల్లివిరియఁగా నరిగి రొగిన్.

గీ. వయసురానట్టి పడుచుల వరుసఁ గొన్ని
వయసువచ్చిన యువతుల పగిదిఁ గొన్ని
వయసుదీరిన కాంతల పగిదిఁ గొన్ని
వృక్షములు తద్వనమునఁ గన్విందుసేయు.

చ. మును గననట్టి వృక్షములఁ బువ్వులఁ గాయలఁ బండ్లఁ గాంచుచున్
మును విననట్టి శ్రావ్యమగు పుల్గుల కూఁతల కొగ్గుచుం జెవుల్,
మును విహరింపనట్టి పొదమొత్తముఁ దూఱుచు విశ్రమించుచున్
మునుఁగుచు హర్షవార్ధిఁ బువుబోండ్లు విహార మొనర్చి రవ్వనిన్.

సీ. తన రమ్యకరపాదతలములం బగఁగొన్న
గతిఁబొల్చు చిగురాకు గములఁ జిదిమి
తనదు సుందరపయోధరముల కెనవచ్చు
తోరంపుఁ బువ్వుగుత్తులను గోసి
తనదు కోమలగాత్రమును ముట్టి యెదిరించు
మవ్వంపుఁ దీవెల మలయఁజేసి
తన మృదుకంఠగీతంబు విడంబింప
నరుదెంచు కోయిల నదలఁజేసి

గీ. తనదు నెమ్మేని కమ్మవాసనల సురభి
కుసుమములఁజేసి నిర్గంధకుసుమములను
వనరమకుఁ దద్దఁ దనచక్కఁదనపు ఠీవిఁ
జూపుచుఁ జరించె నట నొక సొబగులాఁడి. ౨౦

చ. రమణులు మోముదమ్మిపయి వ్రాలెడు తేంట్లను ద్రోలు చోష్ఠ బిం
బము పయి మూఁగు చిల్కలను బాఱఁగఁజేయుచు, నాత్మశాఖలన్
దమకముగొన్న చందమునఁ దమ్ముఁ గనుంగొని కంటకావనీ
జములు వెఱంగు లాగఁ బెఱచన్ వదలించుచుఁ బోయి రయ్యెడన్. ౨౧

క. తలవని తలఁపుగ వృక్షం
బులు పెక్కు వికాసమొందెఁ బూవుంబోఁడుల్
కలకల నవ్వఁగఁ దాఁకఁగఁ
బలుకఁగ నర్మోక్తు లాటపాట లొనర్పన్. ౨౨

ఉ. ఈ తలిరాకు లీ సుమము లీ ఫలముల్ సరిక్రొత్త లివ్వి భూ
నేత కుపాయనంబుగను నేన యొసంగుదు మెప్పుఁగొందుఁ ద
త్ప్రీతికిఁ బాత్రురాల నయి వెల్గుదు నంచుఁ దలంచి కోసి తన్
లాఁతులు చూడనట్టులు చలమ్మునఁ దాఁచె నొకొక్క చెల్వయున్. ౨౩

మ. చిఱునవ్వుల్ విరిమొత్తమై తరులతాశ్రేణిన్ వెలింగింపఁగా,
సరసోక్తుల్ మధుధారలై వనమునం జాల్వారఁగా, వీక్షణో
త్కరముల్ తోరణగట్టఁ జక్కఁగ దిశాకాండంబునన్ మెట్టతా
మరలన్ సృష్టినొనర్పఁ బాదములు కొమ్మల్ పోయి రా తోఁటలోన్. ౨౪

ఆ. వె. ముద్దుముచ్చటాడు పులుఁగుల జంటల
మరులు రేఁగి యాలుఁ దఱియు తేటిఁ
జక్కఁగౌగిలించు జక్కవకవఁ గాంచి
నవ్వుకొనుచుఁ జనిరి పువ్వుఁబోండ్లు. ౨౫

గీ. మరులుఁదీఁగెను ద్రొక్కిన మాద్రి వారు
మఱచి పతిమాట విడిదికి మఱలుబాట
ముగ్ధలై యా వనంబు నపూర్వశోభ
గమ్య మెఱుఁగక యేగిరి కడిఁదిదవ్వు. ౭౬

గీ. అరిగియరిగి వార లా మౌనిచంద్రుని
యాశ్రమంబు డాయ నాదరించి
స్వాగతం బొసంగె ఛాత్రబృందమువోలె
శుకపికాదిసకలశకునికులము. ౭౭

ఉ. డాసిరి వారు మెల్లఁగ నెడందఁ గుతూహల మొప్ప బద్ధవీ
రాసనుఁడై ప్రశాంతవిషయస్పృహుఁడై వినిమీలితాక్షుఁడై
భాసుర బ్రహ్మతేజుఁడయి భస్మమయాంగకుఁడై మనోజ్ఞధ
ర్మాసనవర్తియై పొలుచు నా యమిసత్తము బోధిసత్త్వునిన్. ౭౮

చ. చిలుకను ద్రోలి యా చెఱకుసింగిణి వ్రయ్యలు సేసి, త్రుంచి పూ
ములుకులు మూలముట్టు రతిమోహముఁ గోసియు సన్న్యసించి నా
రలు ధరియించి, ద్వంద్వముల రాయిడి సైఁచి తపం బొనర్చు పు
వ్విలుతుఁడనంగ నొప్పె మునిముఖ్యుఁ డటన్ నవకోమలాంగతన్. ౭౯

క. కని యతని శాంతరూపం
బను మంత్రము చేతఁ బోలెఁ బావుంబోఁడుల్
తనువిభ్రమములు తక్కఁగఁ
బ్రణత లయిరి శిరసు వ్రాల్చి పాదద్వయికిన్. ౮౦

గీ. భక్తిరస మొలుకుచున్న హృత్పంకజంబు
హస్తపాదాబ్జములును నేత్రాంబుజములు
గలిపి దండగ గ్రుచ్చి యా చెలులు సేసి
రా మునీంద్రుని దివ్య పాదార్చనంబు. ౮౧

క. చెలువుని కొసంగ నెయ్యం
బొలుకంగాఁ దారు కోసియును దాఁచిన యా
ఫలపత్త్రిపుష్పతతి ని
ర్మలభక్తిని నాతనికి సమర్పించి రొగిన్.

క. పతగతతి మొదలు నేసిన
యతిథిస్వాగతసపర్య యాయతి మృదుభా
షితములతోడన సంపూ
ర్ణతఁ బడయుట సతులమనము ప్రమదం బొందెన్.

ఉ. వారల యప్పనంబులఁ దపస్వివరుం డెద నాదరించి వి
స్ఫారవిలోచనంబులఁ గృపారసపూరము జాలువాఱఁగా
వారల రత్నభూషలను వారి యమూల్యదుకూలవేషముల్
వారలతమ్మలంబు తెలుపంగఁ దదైహిక తత్పరత్వమున్.

క. బలిత మగు సేవగొనియున్
గలఁగక దాంతాత్ముఁడగుటఁ గనికరమున వా
రల నుద్ధరింపఁగా నీ
పొలుపున ధర్మోపదేశముల నొనరించెన్.

గీ. "తఱచుగా జీవి జీవయాత్రా ప్రవంతి
నింద్రియావర్త బృందంబునందుఁ జిక్కి
వాని త్రిప్పులఁ దిరుగుచు వశము దప్పి
మజ్జనోన్మజ్జనంబుల గ్రుందుచుండు.

క. పురుగయి పులుఁగయి పశువై
పరస్సహస్రంబు లయిన బాములు గొని యి
ద్ధరఁ దుదికి జీవి వడయును
నరయోనిం బుణ్యలవమునన్ జననంబున్.

క. సుకృతోత్సేకముకతనన
సకలేంద్రియవత్త్వ గాత్రచారుత్వ ధని
త్వకులీనత్వ మహత్త్వా
దికసంపద మానవునకుఁ దేజిలుచుండుణ్. ౮౮

మ. నరజన్మంబు వహించినాఁడనని యానందంబునణ్ వీఁగుచుం
బురుషుం డక్కట; యుత్తరోత్తర శుభంబుల్ పొందు నాలోచనం
బు రహిం జేయక చేతఁజిక్కిన ధనంబుణ్ గ్రుడ్డివాటంపు దూ
బఱ గావించి యధోగతింగొను నవిద్వాంసుం డగుం బో! తుదిణ్. ౮౯

ఉ. "ఉత్తరకాలమం దిటులె యుత్తమజన్మముఁ బొందఁ జేయ నే
సత్తప మెట్టి హీనమగు జన్మము కల్గునొ? యింక నాకు" నం
చుత్తలపాటుతో హృదయ మాఱటఁ గాంచక మానవుండు వె
ఱ్ఱిత్తిరిరీతి నేడ్చుఁ గడ కెక్కుడుగా ననుతాప మొందుచుణ్. ౯౦

గీ. తలఁచు నొక్కండు కదలి కేతాము నెత్త;
నెంచు నింగికి నిచ్చెన నెత్త నొకఁడు;
పృథివిఁ దలక్రిందు సేయ భావించు నొకఁడు;
తనదు వాసన లార్పంగఁ దలఁపఁ డెవఁడు. ౯౧

క. ధనకనకవస్తువాహన
తనయకళత్రములు దుఃఖదంబులు; తనతోఁ
జను దేరవు; సద్ధర్మమె
మనుజుని వెనుకొనుచు సుఖినిమగ్ను నొనర్చుణ్. ౯౨

గీ. బుద్బుదప్రాయమగు ప్రాయమును, దటిత్స
మాన మగు సంపదను నమ్మి మానవుండు
కట్ట! శ్వాపుచ్ఛముం గొని గంగ నీఁదు
వానిగతిఁ జెందుఁ గోరి నిర్వాణపథము. ౯౩

క. సుకృతోత్సేకముకతనన
సకలేంద్రియవత్త్వ గాత్రచారుత్వ ధని
త్వకులీనత్వ మహత్త్వా
దికసంపద మానవునకుఁ దేజిలుచుండున్. ౮౮

మ. నరజన్మంబు వహించినాఁడనని యానందంబునన్ వీఁగుచుం
బురుషుం డక్కట ; యుత్తరోత్తర శుభంబుల్ పొందు నాలోచనం
బు రహిం జేయక చేతఁజిక్కిన ధనంబున్ గ్రుడ్డివాటంపు దూ
బఱ గావించి యధోగతింగొను నవిద్వాంసుం డగుం బో! తుదిన్. ౮౯

ఉ. "ఉత్తరకాలమం దిటులె యుత్తమజన్మముఁ బొందఁ జేయ నే
సత్తప మెట్టి హీనమగు జన్మము కల్గునొ ? యింక నాకు" నం
చుత్తలపాటుతో హృదయ మాఱటఁ గాంచక మానవుండు వె
ఱ్ఱెత్తినరీతి నేడ్చుఁ గడ కెక్కుడుగా ననుతాప మొందుచున్. ౯౦

గీ. తలఁచు నొక్కండు కదలి కేతాము నెత్త;
నెంచు నింగికి నిచ్చెన నెత్త నొకఁడు;
పృథివిఁ దలక్రిందు సేయ భావించు నొకఁడు;
తనదు వాసన లార్పంగఁ దలఁపఁ డెవఁడు. ౯౧

క. ధనకనకవస్తువాహన
తనయకళత్రములు దుఃఖదంబులు; తనతోఁ
జను దేరవు; సద్ధర్మమె
మనుజుని వెనుకొనుచు సుఖనిమగ్ను నొనర్చున్. ౯౨

గీ. బుద్బుదప్రాయమగు ప్రాయమును, దటిత్స
మాన మగు సంపదను నమ్మి మానవుండు
కట్టి! శ్వపుచ్ఛముం గొని గంగ నీఁదు
వానిగతిఁ జెందుఁ గోరి నిర్వాణపథము. ౯౩

శా. "కేళాకూళుల నాడుచుండిరొ జలక్రీడల్, తగం, దూఁగుటు
య్యాలల్ దూఁగుచునుండిరో ? పొదల లాస్యం బాడుచున్నారలో ?
లీలాద్యూతము లాడుచుండిరొ ? సుమాళిం గోయుచున్నారలో ?
కాలం బెంత గతించెనో ? తెలియ కిక్కాంతామణుల్ తోఁటలోన్. ౧౦౦

క. సరసగల పొదరుటిండ్లను
దరుణులు నిదురించుచుండ్రు దప్ప"దటంచున్
బిరబిర చని పరికించుచు
నరపతి భగ్నాశ మగు మనంబున నులికెన్. ౧౦౧

సీ. "ఏ యైంద్రజాలికుండేని నీ కొమ్మల
జిగురుఁగొమ్మలుగాఁగఁ జేసెనొక్కొ ?
ఏ మాంత్రికుం డేని నీ లతాతన్వుల
నలరుఁదీవియలుగాఁ జలిపె నొక్కొ ?
ఏ మునిశాపమే నీ కురంగాక్షుల
లేడిమందలుగఁ గల్పించె నొక్కొ ?
ఏ వనదేవతయేని నీ చిలుకల
కొలుకులఁ జిలుకలఁ జలిపె నొక్కొ ?
గీ. ప్రాఁతగిలు పూవుటమ్ములఁ బాఱవైచి
యా యనంగుండె తూణీరమందు నిడెనొ ?
నాదు రతనంపు బొమ్మల నాదుమోహ
దేవతలఁ గేళికాకామధేనువులను." ౧౦౨

క. అని తర్కించుచు నవ్వని
మును గాంచిన యా ప్రదేశముల బమ్మఱఁ గాం
చును ; బతి తోఁపక కాల్గా
లిన పిల్లియనంగఁ గళవళించు నెడందన్. ౧౦౩

శా. "కేళాకూళుల నాడుచుండిరొ జలక్రీడల్, తగం, దూఁగుటు
య్యాలల్ దూఁగుచునుండిరో ? పొదల లాస్యం బాడుచున్నారలో ?
లీలాద్యూతము లాడుచుండిరొ ? సుమాళిం గోయుచున్నారలో ?
కాలం బెంత గతించెనో ? తెలియ కిక్కాంతామణుల్ తోఁటలోఁ. ౧౦౦

క. సరసగల పొదరుటిండ్లను
దరుణులు నిదురించుచుండ్రు దప్ప"దటంచుఁ
బిరబిర చని పరికించుచు
నరపతి భగ్నాశ మగు మనంబున నులికెఁ. ౧౦౧

సీ. "ఏ యైంద్రజాలికుండేని నీ కొమ్మల
జిగురుఁగొమ్మలుగాఁగఁ జేసెనొక్కొ ?
ఏ మాంత్రికుం డేని నీ లతాతన్వుల
నలరుఁదీవియలుగాఁ జలిపె నొక్కొ ?
ఏ మునిశాపమే నీ కురంగాక్షుల
లేడిమందలుగఁ గల్పించె నొక్కొ ?
ఏ వనదేవతయేని నీ చిలుకల
కొలుకులఁ జిలుకలఁ జలిపె నొక్కొ ?
గీ. ప్రాఁతగిలు పూవుటమ్ములఁ బాఱవైచి
యా యనంగుండె తూణీరమందు నిడెనొ ?
నాదు రతనంపు బొమ్మల నాదుమోహ
దేవతలఁ గేళికాకామధేనువులను." ౧౦౨

క. అని తర్కించుచు నవ్వని
మును గాంచిన యా ప్రదేశముల బల్మఱుఁ గాం
చును ; బతి తోఁపక కాల్గా
లిన పిల్లియనంగఁ గళవళించు నెడందఁ. ౧౦౩

క. కాంతుని కన్యునితోఁ దన
కాంతామణి యేకతమునఁ గానంబడినన్
స్వాంతము రగులదె ? కన్నుల
సంతమసము గ్రమ్మకొనదె ? శాంతి దొలఁగదే ? ౧౧౦

గీ. మూటగట్టి నిజేంద్రియంబులను భక్తి
నతని కప్పన సేయుట నతివ లటకు
వచ్చి నిలుచున్న తమ భర్తవంకఁ గనరు
వినరు నాతని దగు పదధ్వనినినేని. ౧౧౧

క. తనయానతి లేకయ యి
చ్చను విహరింపంగ వెడలు చంద్రాస్యలపైఁ
గొనియున్న బిట్టుకినుకను
మునిపైఁ దీర్పంగఁ బోయె భూపతి మొఱకై. ౧౧౨

క. మొదలనె మోహగ్రస్తుఁడు ;
తదుపరి సుమహాప్రభుత్వ దర్పోద్ధతుఁ ; డా
పిదప నవివేకి ప్రకృతిని ;
మది ధర్మాధర్మములను స్మరియించు నెటుల్ ? ౧౧౩

క. "ఈ మిండతపసి యెవ్వం ?
డీ మునిముచ్చెవ్వ ? డిట్టు లీ గతి నాకాం
తామణుల వశము సేకొని
కామోద్రేకమునఁ గన్నుఁగానక యుండెన్. ౧౧౪

మ. తరుణీబృందము విశ్వసింపఁగ బకధ్యానంబుఁ గావించుచున్
దటియన్ రాఁగను మంత్రతంత్రవిధులన్ వశ్యౌషధ ప్రక్రియన్
మఱవం జేయుచుఁ గ్రీతదాసులనుగా మారించి స్వేచ్ఛాగతిం
జరియింత్రీదృశతాపసబ్రువులు నానా మన్మథ క్రీడలన్. ౧౧౫

క. కాంతుని కన్యనితోఁ దన
కాంతామణి యేకతమునఁ గానంబడినన్
స్వాంతము రగులదె ? కన్నుల
సంతమసము గ్రమ్ముకొనదె ? శాంతి దొలఁగదే ? ౧౧౦

గీ. మూటగట్టి నిజేంద్రియంబులను భక్తి
నతని కప్పన సేయుట నతివ లటకు
వచ్చి నిలుచున్న తమ భర్తవంకఁ గనరు
వినరు నాతని దగు పదధ్వనినినేని. ౧౧౧

క. తనయానతి లేకయ యి
చ్చను విహరింపంగ వెడలు చంద్రాస్యలపైఁ
గొనియున్న బిట్టుకినుకను
మునిపైఁ దీర్పంగఁ బోయె భూపతి మొఱకై. ౧౧౨

క. మొదలనె మోహగ్రస్తుఁడు ;
తదుపరి సుమహాప్రభుత్వ దర్పోద్ధతుఁ ; డా
పిదప నవివేకి ప్రకృతిని ;
మది ధర్మాధర్మములను స్మరియించు నెటుల్ ? ౧౧౩

క. "ఈ మిండతపసి యెవ్వం ?
డీ మునిముచ్చెవ్వ ? డిట్టు లీ గతి నాకాం
తామణుల వశము సేకొని
కామోద్రేకమునఁ గన్నుఁగానక యుండెన్. ౧౧౪

మ. తరుణీబృందము విశ్వసింపఁగ బకధ్యానంబుఁ గావించుచున్
దఱియన్ రాఁగను మంత్రతంత్రవిధులన్ వశ్యౌషధ ప్రక్రియన్
మఱవం జేయుచుఁ గ్రీతదాసులనుగా మారించి స్వేచ్ఛాగతిం
జరియిం త్రీదృశతాపసబ్రువులు నానా మన్మథ క్రీడలన్. ౧౧౫

క. పరపరన పండ్లు గొఱుకుచు
నోరనుండియు నురియఁ బెఱికి యుఱుముచును గడున్
మెఱుఁగుం దాల్చిన మేఘము
తెఱఁగున వాచంయమేంద్రు దెసకుం బఱచెన్. ౧౨౨

శా. సింగంబో? పులియో? యెలుంగొ? పఱతెంచెన్ మీఁదికంచున్ మదిం
గంగారుంగొని పెల్లు చెల్లచెదరై నానాదిశల్ పర్వ సా
రంగుల్ వోలెఁ బడంతు లయ్యతిథిఁ గ్రూరస్వాంతు నా మౌని న
ర్చం గావింపఁగ నర్ఘ్యపాద్యముల సంరంభించె శాంతాకృతిన్. ౧౨౩

ఉ. స్వాగత మాదరింపక నృపాలుఁడు ద్రోసి తదర్ఘ్య పాద్యముల్
నాగమువోలెఁ జుట్టి యమినాథు వధింపఁగఁ గత్తి నెత్తఁగా,
డాఁగి భయంబునం గుఱగటం గల రాణులు కాంచి కాంతునిన్
మ్రోఁగఁగఁ గంకణంబులును నూపురముల్ మణిమేఖలల్ వడిన్. ౧౨౪

క. అరుదెంచి నిరపరాధినిఁ
బరతత్త్వజ్ఞుని మహాత్ము వ్యర్థముగఁ గటా!
పరిపూతగోవునుం బలెఁ
బరిమార్పఁ దలంచు నాత్మ పతి వారింపన్. ౧౨౫

క. వినతోత్తమాంగలయి యా
వనితారత్నములు డాసి పాణిద్వంద్వం
బును గీలించి శిరస్సుల
నని రమృతంబొలుక నిట్టు లతిభక్తిమెయిన్. ౧౨౬

క. "అబ్రహ్మణ్యము నాథా!
ఈ బ్రహ్మిష్ఠావతంసు నేల వధింపన్?
గోబ్రాహ్మణ హితుఁడవు క
ట్టా! బ్రహ్మవధం బొనర్చు టర్హం బగునే? ౧౨౭

క. పరపరన పండ్లు గొఱుకుచు
నోరనుండియు నురియఁ బెఱికి యుఱుముచును గడున్
మెఱుఁగుం దాల్చిన మేఘము
తెఱఁగున వాచంయమేంద్రు దెసకుం బఱచెన్. ౧౨౨

శా. సింగంబో? పులియో? యెలుంగొ? పఱతెంచెన్ మీఁదికంచున్ మదిం
గంగారుంగొని పెల్లు చెల్లచెదరై నానాదిశల్ పర్వ సా
రంగుల్ వోలెఁ బడంతు లయ్యతిథిఁ గ్రూరస్వాంతు నా మౌని న
ర్చం గావింపఁగ నర్ఘ్యపాద్యముల సంరంభించె శాంతాకృతిన్. ౧౨౩

ఉ. స్వాగత మాదరింపక నృపాలుఁడు త్రోసి తదర్ఘ్య పాద్యముల్
నాగమువోలెఁ జుట్టి యమినాథు వధింపఁగఁ గత్తి నెత్తఁగా,
డాఁగి భయంబునం గుఱగటం గల రాణులు గాంచి కాంతునిన్
మ్రోఁగఁగఁ గంకణంబులును నూపురముల్ మణిమేఖలల్ వడిన్. ౧౨౪

క. అరుదెంచి నిరపరాధినిఁ
బరతత్త్వజ్ఞుని మహాత్ము వ్యర్థముగఁ గటా!
పరిపూతగోవునుం బలెఁ
బరిమార్పఁ దలంచు నాత్మ పతి వారింపన్. ౧౨౫

క. వినతోత్తమాంగలయి యా
వనితారత్నములు డాసి పాణిద్వంద్వం
బును గీలించి శిరస్సుల
నని రమృతంబొలుక నిట్టు లతిభక్తిమెయిన్. ౧౨౬

క. "అబ్రహ్మణ్యము నాథా!
ఈ బ్రహ్మిష్ఠావతంసు నేల వధింపన్?
గోబ్రాహ్మణ హితుఁడవు క
ట్టా! బ్రహ్మవధం బొనర్చు టర్హం బగునే? ౧౨౭

సీ. సప్తజిహ్వాలు సాఁచి జగమేర్చు కార్చిచ్చు
కడనున్న పెనుమంచుగడ్డ యనఁగ
మిట్ట వేసఁగి నెండబెట్ట విశ్వము మాడ్చు
రవియొద్దనున్న చంద్రముఁ డనంగ
బడగల విసముఁ గ్రక్కెడు కాలసర్పంబు
కడనున్న పీయూషఘట మనంగ
నల్ల కల్లోలమై యాభీల మగు నబ్ధి
దరిఁ గ్రాలెడు ప్రశాంతసరసనంగఁ
గీ. ఆకృతిం గొన్న రౌద్రమై యడలు గొలుపు
ఱేనికడ నిల్చియుండె నిర్భీకుఁడగుచు
రూపముంగొన్న శాంతినాఁ దాపసుండు
కదలఁ బాఱని యంతరంగంబుతోడ. ౧౩౪

ఆ. వె. కాంచి యవ్విధంబు క్షాంతివాది మునీంద్రుఁ
డాత్మశాంతి వదల కాదరించి
భూపు నర్ఘ్య పాద్యములను గ్రమ్మఱఁ బూజ
సలుపనెత్తి యిట్లు పలికె మెల్ల. ౧౩౫

చ. "క్షితి జనియించినట్టి ప్రతిజీవియుఁ బాయును నేఁడొ! రేపొ! జీ
వితముల, దీనికై పరితపింపసుమీ! లవలేశమేని నో
క్షితిప! మదాశ్రమంబు దయనేసిన నీ విట నా యొనర్చు స్వా
గతము గ్రహింపవైతి వని కాల్చు విచారపు టగ్గి నా మదిన్. ౧౩౬

ఉ. కంచెయె చేని మేసిన ప్రకారమునన్ భువి దుష్టకోటి శి
క్షించఁగ శిష్టకోటిఁ బరికింపఁగఁ బ్రాపయి యున్న త్వాదృశా
ఢ్యంచిత పుణ్యమూర్తులె తపస్విజనంబు వధింపఁబూనఁ బ్రా
పంచిక ధర్మముల్ నిలుపు వా రెవరయ్య! తలంచి చూడుమా! ౧౩౭

సీ. సప్తజిహ్వాలు సాఁచి జగమేర్చు కార్చిచ్చు
కడనున్న పెనుమంచుగడ్డ యనఁగ
మిట్ట వేసఁగి నెండబెట్ట విశ్వము మాడ్చు
రవియొద్దనున్న చంద్రముఁ డనంగ
బడగల విసముఁ గ్రక్కెడు కాలసర్పంబు
కడనున్న పీయూషఘట మనంగ
నల్లకల్లోలమై యాభీల మగు నబ్ధి
దరిఁగ్రాలెడు ప్రశాంతసరసనంగఁ
గీ. ఆకృతిం గొన్న రౌద్రమై యడలు గొలుపు
ఱేనికడ నిల్చియుండె నిర్భీకుఁడగుచు
రూపముం గొన్న శాంతినాఁ దాపసుండు
కదలఁ బాఱని యంతరంగంబుతోడ. ౧౩౪

ఆ. వె. కాంచి యవ్విధంబు క్షాంతివాది మునీంద్రుఁ
డాత్మశాంతి వదల కాదరించి
భూపు నర్ఘ్య పాద్యములను గ్రమ్మఱఁ బూజ
సలుపనెత్తి యిట్లు పలికె మెల్ల. ౧౩౫

చ. "క్షితి జనియించినట్టి ప్రతిజీవియుఁ బాయును నేఁడొ ! రేపొ ! జీ
వితముల, దీనికై పరితపింపసుమీ ! లవలేశమేని నో
క్షితిప! మదాశ్రమంబు దయనేసిన నీ విట నా యొనర్చు స్వా
గతము గ్రహింపవైతి వని కాల్చు విచారపు టగ్గి నా మదిన్. ౧౩౬

ఉ. కంచెయె చేని మేసిన ప్రకారమునన్ భువి దుష్టకోటి శి
క్షించఁగ శిష్టకోటిఁ బరికింపఁగఁ బ్రాపయి యున్న త్వాదృశా
ద్యంచిత పుణ్యమూర్తులె తపస్విజనంబు వధింపఁబూనఁ బ్రా
పంచిక ధర్మముల్ నిలుపు వా రెవరయ్య ! తలంచి చూడుమా ! ౧౩౭

గీ. శత్రునిగ్రహణక్రియాశక్తి కన్న
క్షాంతినిర్వహణక్రియాశక్తి మేలు;
దాన రాజర్షిపదము సార్థకము చేసి;
కన్యమున నాతని నృశంసుఁ డంద్రు ప్రజలు. ౧౪౪

మ. పలుశాస్త్రంబులు వేదముల్ సదివినన్ వాతాశనాధారుఁడై
తలక్రిందై తప మాచరించినఁ గడున్ ధర్మోత్తరుండైన భూ
తల మవ్వాని ననార్యుగాఁ దలఁచు "శాంతం భూషణ" మ్మన్న పె
ద్దల వాక్యంబు నెవండు శాసనముగా ధ్యానించి పాలింపఁడో ?" ౧౪౫

చ. అనెడి హితోక్తి కా నరవరాధముఁ డల్కను బేర్చి బిట్టు, పా
లను విస మెక్కు పామువలె "లావువిరాగము నాటుకొన్న నీ
మనసున నేల? నన్ను బతిమాలుదు వీ గతిఁ బ్రాణరక్షణం
బునకయి దీనదీనముగ మూఢునిరీతి" నటంచుఁ బల్కెనన్. ౧౪౬

మ. యతిచంద్రుండు వచించె నిప్పగిది నిన్ యాచింపఁగా లేద క్ష్మా
పతిచూడామణి! నశ్వరంబయిన నా ప్రాణంబుపైఁ దీఁపి చే
క్షితి నిర్దోషిని బీదసాదుని వధించెన్ భూవరుం డన్న శా
శ్వత దుష్కీర్తివహింతు వీ వనుచు నా స్వాంతంబు పొక్కుం గడున్. ౧౪౭

క. నా యట్టి యభాగ్యం డొకఁ
డీ యిలఁ జన్మించుకతన నీదృగ్గతి నీ
కీ యపకీర్తి ఘటిల్లును
గా! యని నా యెద సహస్రఖండంబు లగున్. ౧౪౮

క. కయిజాతినఁ గాల్జాతినఁ
బయినిం జేయంగఁ దగ్గ పని యున్నదె? తె
స్సయుఁ దొల్త విచారింపని
క్రియ కుట్టుచునుండు మదిని వృశ్చిక మనఁగన్. ౧౪౯

గీ. శత్రునిగ్రహణక్రియాశక్తి కన్న
క్షాంతినిర్వహణక్రియాశక్తి మేలు;
దాన రాజర్షిపదము సార్థకము తేని;
కన్యమున నాతని నృశంసుఁ డంద్రు ప్రజలు. ౧౪౪

మ. పలుశాస్త్రంబులు వేదముల్ సదివినన్ వాతాశనాధారుఁడై
తలక్రిందై తప మాచరించినఁ గడున్ ధర్మోత్తరుండైన భూ
తల మవ్వాని ననార్యుగాఁ దలఁచు "శాంతం భూషణ" మ్మన్న పె
ద్దల వాక్యంబు నెవండు శాసనముగా ధ్యానించి పాలింపఁడో?" ౧౪౫

చ. అనెడి హితోక్తి కా నరవరాధముఁ డల్కను బేర్చి బిట్టు, పా
లను విస మెక్కు పామువలె "లావువిరాగము నాటుకొన్న నీ
మనసున నేల? నన్ను బతిమాలుదు వీ గతిఁ బ్రాణరక్షణం
బునకయి దీనదీనముగ మూఢునిరీతి" నటంచుఁ బల్కినన్. ౧౪౬

మ. యతిచంద్రుండు వచించె నిప్పగిది నిన్ యాచింపఁగా లేద క్ష్మా
పతిచూడామణి! నశ్వరంబయిన నా ప్రాణంబుపైఁ దీఁపిచే
క్షితి నిర్దోషిని బీదసాదుని వధించెన్ భూవరుం డన్న శా
శ్వత దుష్కీర్తివహింతు వీ వనుచు నా స్వాంతంబు పొక్కుం గడున్. ౧౪౭

క. నా యట్టి యభాగ్యం డొకఁ
డీ యిలఁ జన్మించుకతన నీదృగ్గతి నీ
కీ యపకీర్తి ఘటిల్లును
గా! యని నా యెద సహస్రఖండంబు లగున్. ౧౪౮

క. కయిజాతినఁ గాల్జాతినఁ
బయినిం జేయంగఁ దగ్గ పని యున్నదె? లె
స్సయుఁ దొల్త విచారింపని
క్రియ కుట్టుచునుండు మదిని వృశ్చిక మనఁగన్. ౧౪౯

క. "ఓ కపటయోగి! చూడుము
నీ కథ సాంతంబొనర్తు నిమిషార్ధములో;
నా కత్తి యాఁకటిని నీ
మైకండలఁ దీర్ప సంభ్రమంపడుచుండెన్. ౧౫౬

మ. ఇదె! నీ దంభము వెల్లడింతు"నని భూమీశాధముం డున్నత
ప్రదరాఘాతముచేత మౌనిజనరాడ్బాహాలతం ద్రుంచె బె
ట్టిదపుం రక్తఝరుల్ సిరావితతి నుండిన్ మీఁదికిం జిందఁగా;
హృదయంబుం బగిలించుఁ జూపఱకు నా దృశ్యంబు దుష్ప్రేక్ష్యమై. ౧౫౭

మ. చలియింపండు మనంబునందు; వదనచ్ఛాయంబుఁ గోల్పోఁడు; గ
న్నుల రానీఁడు విషాద బాష్పలవముల్; దూషింపఁడా దుష్ప్రభున్;
దలఁపం డెట్టి ప్రతిక్రియం గడిఁది బాధం బొందుచున్; గాని యు
త్తలమొందున్ ముని ఱేని దుర్యశముకై తస్వాంతరంగంబునన్. ౧౫౮

క. గఱుల న్నఱకఁగ రాఁగాఁ
బురందరుం డేఁడు సంద్రముల డాఁగిన య
గ్గిరులెల్ల నీ మునీంద్రుని
చరితకుఁ దల వాంచుకొనవె? సత్యముగ వినన్. ౧౫౯

క. మిను విఱిగిపడ్డఁ, బిడుగులు
దనపైఁ బదివేలు పడ్డఁ దపియింపం డా
త్మను వీరుఁడు తనకొఱకయి;
వనటం గొనుఁ గాంచి పరులపాటున కెడఁదన్. ౧౬౦

ఉ. "కిమ్మనఁ డీతఁ డిప్పగిదిఁ గేల్దెగి రక్తము పాఱుచున్న నా
శమ్ముల; మాఱకుండె ముఖలక్షణ మల్పముఁ; గానరాదు కో
పమ్మును నా పయిన్" సని నృపాలకుఁ డక్కజమొంది క్రూరకా
ర్య మ్మొనరించినాఁడనొ? మహాత్ముఁడొ యీతఁడు! పాపినైతినో! ౧౬౧

క. "ఓ కపటయోగి! చూడుము
నీ కథ సాంతంబొనర్తు నిమిషార్థములో;
నా కత్తి యూఁకటిని నీ
మైకండలఁ దీర్ప సంభ్రమంపడుచుండెన్. ౧౫౬

మ. ఇదె! నీ దంభము వెల్లడింతు"నని భూమీశాధముం డున్నత
ప్రదరాఘాతముచేత మౌనిజనరాడ్బాహాలతం ద్రుంచె బె
ట్టిదపున్ రక్తఝరుల్ సిరావితతి నుండిన్ మీఁదికిం జిందఁగా;
హృదయంబుం బగిలించుఁ జూపఱకు నా దృశ్యంబు దుష్ప్రేక్ష్యమై. ౧౫౭

మ. చలియింపండు మనంబునందు; వదనచ్ఛాయంబుఁ గోల్పోఁడు; గ
న్నుల రానీఁడు విషాద బాష్పలవముల్; దూషింపఁడా దుష్ప్రభున్;
దలఁపం డెట్టి ప్రతిక్రియం గడిఁది బాధం బొందుచున్; గాని యు
త్తలమొందున్ ముని జేని దుర్యశముకై తస్వాంతరంగంబునన్. ౧౫౮

క. గఱుల న్నఱకఁగ రాఁగాఁ
బురందరుం డేఁడు సంద్రముల డాఁగిన య
గ్గిరులెల్ల నీ మునీంద్రుని
చరితకుఁ దల వాంచుకొనవె? సత్యముగ వినన్. ౧౫౯

క. మిను విఱిగిపడ్డఁ, బిడుగులు
దనపైఁ బదివేలు పడ్డఁ దపియింపం డా
త్మను వీరుఁడు తనకొఱకయి;
వనటం గొనుఁ గాంచి పరులపాటున కెడఁదన్. ౧౬౦

ఉ. "కిమ్మనఁ డీతఁ డిప్పగిదిఁ గేల్దెగి రక్తము పాఱుచున్న నా
శమ్ముల; మాఱకుండె ముఖలక్షణ మల్పముఁ; గానరాదు కో
పమ్మును నా పయిన్" నని నృపాలకుఁ డక్కజమొంది క్రూరకా
ర్య మ్మొనరించినాఁడనొ? మహాత్ముఁడొ యీతఁడు! పాపినైతినో! ౧౬౧

ఉ. ఆ నరపాలు నంగముల న త్తఱి వృశ్చికకోటి కుట్టు చం
దానను, గాల్చి కఱ్ఱులను దద్దయు వాతలు పెట్టు రీతినిన్
బూనిక గ్రుచ్చునట్లు కొఱవుల్ గొని, రంధ్రములం దొలంచు న
ట్లూనఁగ రానిబాధ యొకఁ డుద్భవమయ్యె క్షణక్షణోగ్రమై. ౧౬౯

చ. నిలువఁగఁ జాల కాతఁడవనింబడి పొర్లును, గాలు సేతులన్
విలవిలఁ దన్నుకొంచుఁ బలవించును; బారలు సాఁచి నాల్గు ది
క్కుల శరణార్థియై పఱచు; ఘోరవుభూతముఁ గాంచుచున్న య
ట్టులు నెలుఁగెత్తి యేడ్చును గడుంగడుఁ; పాపఫలంబుగా నిసీ!

మ. విసముం గ్రక్కుచుఁ బెద్దవిప్పి పడగల్ విచ్చేయుఁ బెన్నాగముల్;
గ్రసియింగంపను నోరువిచ్చి పయికిన్ లంఘించు శార్దూలముల్;
ముసలాద్యాయుధ పాణియై పొడువ నాలోకించు సైన్యంబు; న
ల్దెసలం బాపము చుట్టుకొన్నగతి ధాత్రీనాథునిం గన్పడెన్. ౧౭౦

క. బొమముడి బిగించి యుఱుముచు
ధుమధుమలాడుచును నెదుటఁ దోఁచి రనేకుల్
యమదూతలు; పిల్చిరి తమ
సమీపమున కరుగుదేర క్ష్మాపతిఁ బితరుల్. ౧౭౧

క. గిరగిరఁ దిరుగుచుఁ బెనుసుర
కరువలి వలె వశముదప్పి గాత్రంబువడెన్
బఱియలువాఱిన భూగ
హ్వరమునఁ దలక్రిందుగా లతాంగుల యెదుటన్. ౧౭౨

క. తన కండకావరంబున
ధనాంధకారమున సద్ధితంబులు వెగటై
మునులకుఁ జెనంటి గూర్చెడి
జనునకుఁ గా కిట్టి గతులు సద్గతు లున్నే? ౧౭౩

ఉ. ఆ నరపాలు నంగముల నత్తఱి వృశ్చికకోటి కుట్టు చం
దానను, గాల్చి కఱ్ఱులను దద్దయు వాతలు పెట్టు రీతినిఁ
బూనిక గ్రుచ్చునట్లు కొఱవుల్‌గొని, రంధ్రములం దొలంచు న
ట్లూనఁగ రానిబాధ యొకఁ డుద్భవమయ్యె క్షణక్షణోగ్రమై. ౧౬౮

చ. నిలువఁగఁ జాల కాతఁడవనింబడి పొర్లును, గాలునేతులన్
విలవిలఁ దన్నుకొంచుఁ బలవించును; బారలు సాఁచి నాల్గు ది
క్కుల శరణార్థియై పఱచు; ఘోరవుభూతముఁ గాంచుచున్న య
ట్టులు నెలుఁగెత్తి యేడ్చును గడుంగడుఁ; పాపఫలంబుగా నిసీ!

మ. విసముం గ్రక్కుచుఁ బెద్దవిప్పి పడగల్ విచ్చేయుఁ బెన్నాగముల్;
గ్రసియింగంపను నోరువిచ్చి పయికిన్ లంఘించు శార్దూలముల్;
ముసలాద్యాయుధ పాణియై పొడువ నాలోకించు సైన్యంబు; న
ల్దెసలం బాపము చుట్టుకొన్నగతి ధాత్రీనాథునిం గన్పడెన్. ౧౭౦

క. బొమముడి బిగించి యుఱుముచు
ధుమధుమలాడుచును నెదుటఁ దోఁచి రనేకుల్
యమదూతలు; పిల్చిరి తమ
సమీపమున కరుగుదేర క్ష్మాపతిఁ బితరుల్. ౧౭౧

క. గిరగిరఁ దిరుగుచుఁ బెనుసుర
కరువలి వలె వశముదప్పి గాత్రంబువడెన్
బఱియలువాఱిన భూగ
హ్వరమునఁ దలక్రిందుగా లతాంగుల యెదుటన్. ౧౭౨

క. తన కండకావరంబున
ఘనాంధకారమున సద్ధితంబులు వెగళై
మునులకుఁ జెనంటి గూర్చెడి
జనునకుఁ గా కిట్టి గతులు సద్గతు లున్నే? ౧౭౩

క. బ్రతికింపుము మా ప్రభువును
బ్రతికింపు కృపార్ద్రమతిని రాణుల మమ్ముః
బ్రతికింపు మరాజకమున
యతినాథ ! క్షమించి తొంటి యపచారంబుల్." ౧౮౦

మ. అని ప్రార్థింపఁగ క్షాంతివాది యను "నేలా మీరు భీతిల్ల ? నె
వ్వని పాపం బతనిం దినుః; భయమెదః వర్జింపుఁడీ ! చచ్చిపో
యిన వారెవ్వరు లేచివచ్చి రిపుడె ట్లేతెంత్రు మీవారు ? వ
చ్చిన మీకన్నను నేన హెచ్చుగను హర్షింతుః మనస్ఫూర్తిగః. ౧౮౧

క. తరువుశాఖను బలెఁ గేలు దరుగుచున్న
వానిపయి లేని యలుక మీ పైని నేల ?
మరచిపోతిని గోపమ న్మాట యెపుడొ ?
ఇత్తఱిం గ్రొత్తగ క్షమింప నేమిగలదు ? ౧౮౨

చ. అవని యరాజకం బగు నటంచు భయంపడకుండు ; మీదు భూ
ధవుని సమీపబంధుసముదాయమునన్ శుభలక్షణాఢ్యుఁడై
ప్రవిమల వృత్తుఁడై పరగు బాలకు నొఁదలఁ గట్టి పట్టమున్
భువి కభిషిక్తుఁజేసి కొలువుం డతనిం దలవాంచి భక్తిమై. ౧౮౩

క. ఈ చోటియందుఁ గల ధ
ర్మాచరణ పరాయణాత్ముఁ డయి చతురుండౌ
వాచంయమేంద్రుఁడు గురుం
డై చదువఁగఁ జేయు నతని నామ్నాయంబుల్. ౧౮౪

క. వరవడి దిద్దింపుం డా
చిఱుతుకచే క్షాంతిముఖవిశిష్టగుణంబుల్
స్థిరముగ నదుకుఁ 'డహింసా
పరమోధర్మ' యను సూక్తి వాని యెదందన్." ౧౮౫

క. అని యాదేశసమానము
ముని యుపదేశం బొనర్చి మూసెను గన్నుల్
కననియు విననియు తేజము
జను లబ్బురపడఁగ వెడలె శమిగాత్రంబున్.

క. కన్నుల ప్రేఁగయ్యుఁ దుదిం
గన్నులకుం బండు వగుచుఁ గానంబడె న
భ్యున్నత మగు మునిదృశ్యము
మన్నింపఁగఁ బదియు నాల్గు మండలము లొగిన్.

ఉ. ఆ మహనీయు నాశ్రమమునందు వసించు పిపీలికాది నా
నా మృగపక్షి బృందము ఘనంబగు భక్తినిఁ జేరవచ్చి యా
శ్రీమృతకాయముం గని భజించిరి తద్దయు జాలువాఱగా
మోములబాష్పపూరము 'నమోనమ' యంచును వ్రాల్చి యొాఁదలల్.

ఉ. ఆ నృపమంత్రు లాత్మహృదయంబులు గండిపడంగ నశ్రుసం
తానము కాల్వగట్టుచు వనస్థల మంతయుఁ జెమ్మగిల్లఁగా
మౌనిని జందనాగరు సమంచితకాష్ఠచితి న్నమర్చి యెం
తేనియునూర్పులన్ విసరు చెట్లొ ? దహింపఁగఁ జేసి రయ్యెడన్.

క. ప్రోవిడి యస్థి చయం బా
తావునఁ గల్పించి శిల్పితండంబులచేఁ
గోవెలఁ జెక్కించిరి ముని
దేవుని యీ కథను దేటతెల్లముగాఁగన్.

ఉ. ఆతని కూరుచున్న తరు, వాతని నిత్యము స్నానమాడు రే,
వాతని పూలుగోయు లత, లాతని పండెడు రాతి సెజ్జయున్
జ్మౌతటిఁ బుణ్యతీర్థములుగా గణియించుచుఁ బోవు యాత్రిక
వ్రాతము నిచ్చ లుత్సవపరంపర లచ్చట నొప్పు నేఁటికిన్.

చ. పరమపవిత్రమైన మునివర్యు చితాభసితంబు నొక్కరో
క్కరె గ్రహియించి దోసిటను గండ్లకు నద్దుచుఁ బోదు రిండ్లకున్
జ్వరితులకుం బిశాచగణ బాధితకోటికి నౌషధంబుగా
ధరణిని వాడుకొంద్రు సతతం బటకుం జనుచున్న యాత్రికుల్. ౧౯౩



# జాతక కథా గుచ్ఛము

## ప్రథమ భాగము

---

### వ్యాఘ్ర జాతకము

చ. ఒకపరి బోధిసత్త్వుఁడు మహోన్నత ధర్మపథావలంబియై
అకలుషితస్వభావుఁ డయి యార్యచరిత్రకుఁడై బుధావతం
సక మయి వంశరత్న మయి సర్వజనస్పృహణీయభాగ్యుఁడై
ప్రటకతఁ గొన్న భూమిసురవర్యునకుం బ్రభవించెఁ బుత్త్రిఁడై

ఆ. వె. కామధేనువునకు గలిగెను నందిని;
వ్యాసమునికి శుకుఁడు ప్రభవ మొందె;
నరణి యందు నగ్ని యావిర్భవించెఁబో!
యనుచు నెల్ల రనిరి యతనిఁగాంచి.

క. పువు పుట్టంగనె పుట్టును
భువిఁ బరిమళ మన్న చందమున సద్విద్యా
నివహంబు వానితో ను
ద్భవమై తద్రసన యందుఁ దాండవ మాడెన్.

ఆ. వె. సర్వవేదములను సర్వశాస్త్రంబులఁ
బెక్కుకళల నతఁడు పుక్కిలించె
నబ్ధిసప్తకంబు నాపోశనముఁ బట్టు
నా యగస్త్యమౌని యవ్విధమున.

క. అనుకంప కిచ్చె హృదయముఁ;
దను వొసఁగె సురూపమునకు; దానంబునకుం
దన చేయిడె; నీతఁడు లే
దన కడుగుచె తడవుగా సమస్తం బొసఁగెన్.

క. ధర నతఁడు మించ ధర్మా
చరణంబున శమదమాదిసంపదఁ దన తం
డిరి నటఁ "బుత్త్రి దిచ్ఛే
త్పరాజయ"మ్మనెడు సూక్తి తథ్యంబయ్యెన్.

సీ. పండ్లతోఁటల వ్రాలు పక్షిబృందంబుపై
నొడిసెల గుఱినేయ నోర్వఁ డతఁడు
పంటచేలకుఁ బాఱు పసులమొత్తము నాఁచు
పలుముండ్ల కంచె నోపం డతండు
తన పళ్ళెరంబునఁ దిను బిడాలంబును
దొలకైనను నెట్టఁజాలఁ డతడు
తన్ను భక్షింపంగఁ దఱియు బెబ్బులి నైనఁ
గత్తికి నెరనేయఁ గడఁగఁ డతడు.
గీ. 'ఆత్మవ త్సర్వభూతాని' యన్న శ్రుతికి
'ఆత్మవ న్మన్యతే జగ' త్తనెడి నుడికిఁ
దన చరిత్రము వ్యాఖ్యానమునుగఁ జేసి
మూర్త మగు భూతదయ నాఁగఁ బొలుచు నతఁడు.

సీ. పట్టి పుర్వులపిండు భక్షించు తొండలన్
బల్లులం గని మోము పుల్లసిల్లు
విషము గ్రక్కెడు పాముఁ గసిమసంగుచు నున్న
ముంగిసం గనుఁగొన్న మూతిఁ ద్రిప్పుఁ
బడి కాలిక్రిందట మడిసెడు క్రిమికీట
సంతతిఁ గాంచి బాష్పములు రాల్చు
మృగయామిషంబున మృగబృందము వధించు
బోయలం గని కన్ను పొడుచుకొనును

గీ. తనదు ప్రాణంబు లైనను వినిమయించి
ప్రాణముం బోసి బ్రదికింప వాని నెల్ల
పాట్లు వడుచుండుఁ బాప మా బాలయోగి
తన యశ క్తతఁ గని డెందమునఁ గలంగు.

క. బాలుఁ డగు నతని సద్గుణ
జాలము మేల్బంతి గాఁగ శ్రద్ధాళుత వృ
ద్ధాళులు వరవడి వ్రాసినఁ
జాలరు పడయంగ వాని సాదృశ్యంబుల్.

గీ. పయసు మీఱిన పాండితీవైభవమున
విషయనైస్పృహ్యమున సద్వివేకమునను
ధర్మకార్యైకదీక్ష నాతండు బొలిచెఁ
చిన్న యయ్యును బెద్దయై పెద్దలందు.

సీ. చికిలినేసిన కాము చిగురుఁగోలలఁబోని
చెలువల ముండ్లకొమ్మలుగ రోయు
వెలగట్టఁగా రాని పెనురత్నరాసులఁ
గొఱగాని గాజుపెంకులుగఁ ద్రోయు
జిలుగు బంగారు దువ్వలువమొత్తంబు దు
ర్లలితకంటకపత్త్రిములుగఁ దెగడు
పసిఁడియందలములఁ బఱుపుపాన్పులపిండు
బలితంపు టంపశయ్యలుగ నెట్టు

గీ. కావిపుట్టంబుఁ దాల్పంగఁ గానలందుఁ
గోనలందును వసియింపఁ బూన జడలు
తత్త్వము గ్రహింపఁ బ్రజకు బోధం బొనర్ప
యౌవనారంభమున నతం డభిలషించె.

ఉ. ఆతని వంకఁ గాంచు జలజాక్షి కటాక్షము మొక్కవోవుఁ బెన్
రాతినిఁ దాఁకు నారస మనంగఁ; దదీయతనూవిలాసముల్
బ్రాఁతిగ నొడ్డుఁదాఁకియు నివర్తిలు చున్న నదీతరంగ సం
ఘాతము తోడఁబుట్టువులుగాఁ దలఁపించును జూచువారికిన్. ౧౨

గీ. వాయువుం బోలె జలమునువలెను దుర్వ
శేంద్రియంబుల బంధించి తృష్ణ గెలిచి
శాంతిసాగరమున మానసంబు నెపుడు
నోలలాడించు చుండు నయ్యోగివరుఁడు. ౧౩

క. కని కొందఱు, విని కొందఱు,
ఘనభక్తిశ్రద్ధ లుఱలఁగా జనుదురు త
న్మని దర్శింప నిసుక రా
లనివిధమున, నేల యీనులాగున సతమున్. ౧౪

క. తన కడకు నేఁగుదెంచెడి
జనసంచయమున కహర్నిశముఁ గావించున్
ఘనతర ధర్మప్రవచన
మును బీయూషరసవర్షమును బోలె నిటుల్. ౧౫

గీ. "ఆవగింజంతయైన సౌఖ్యంబు కొఱకుఁ
బర్వతం బంత దుఃఖంబు వడుచు నుంద్రు
రాలు మోయుదు రొక కొన్ని పాలకొఱకు
సార మెఱుఁగక జనులు సంసారమందు. ౧౬

ఉ. కాంచినదెల్లఁ గావలయుఁ గావలె నంచు నిరంతరంబు వే
ధించుచునుండఁ జిత్తము పడింబదిగా నరుఁ డెల్లవాని సా
ధించఁగ లేదవల్ తినఁగఁ దీఱక కంటికిఁ గూర్కు రాక దుః
ఖించుచునుండ నాతని సుఖిత్వ మదెంద సుఖిత్వ మిస్సిరో. ౧౭

చ. పెను గుదిబండ కుత్తికకుఁ బెండ్లము; బిడ్డలు కాలిబందముల్;
ధనతతి కేలిసంకెలలు; తన్నివి యెల్లయు ముంచుచుండ జీ
వననదిఁ; బోవుచుండఁగను బ్రాణము లుక్కిరి బిక్కి రౌచు నే
జనుఁడు ప్రశాంత చిత్తుఁడయి సత్య సుఖంబు వహించుఁ జెప్పఁడీ. ౧౮

క. తన దొడ్డి వేల్పుగిడ్డియు,
తన ముంగిట వేల్పుఁజెట్టుఁ, దనగృహమునఁ గాం
చనశైలముఁ జింతామణి
యును వెలిసిన నరుని కామ ముడుగదు లవమున్. ౧౯

క. కామోపభోగతతిచేఁ
గామము శాంతిల్ల దండ్రు కణమైన హవి
స్తోమమున నగ్నియుం బలె
నేమమునఁ ద్యజింప నదియు నిక్కం బడఁగున్. ౨౦

శా. ఈ సంసారము పెద్ద కారడివియం, చీదేహ మిల్లంచుఁ, బెన్
బ్రాసంబుం గొని కాలచోరుఁ డట దూఱం జూచు నం చంత నా
శ్వాసాంతం బగు నంచు ఘోషిలును శాస్త్రవ్రాతముల్; కాన ద
త్త్వాసిం బూని శమాది సైనికుల సాహాయ్యంబుతో నుండుఁడీ. ౨౧

ఉ. ఈహలు సాగరోర్ము లన నెత్తఱి లేవ సమూల మెట్టు లీ
యైహిక దుఃఖ నాశ మగు? నైంద్రియవృత్తుల నిగ్రహించి, స్త్రీ
మోహము దాఁటి, శాంతమతిఁ బూని విరాగము, వాసనాక్షతిన్
దేహవిముక్తిఁ బొందుటకు దేహి ప్రయత్న మొనర్పఁగావలెన్. ౨౨

క. అని యిహదుఃఖముఁ దత్కా
రణముఁ దదుత్పాటనాచరణమార్గంబున్
ఘనుఁ డతఁ డుపన్యసించును
వినువారికి వింతమార్పు వెలయఁగ నెదలన్. ౨౩

సీ. నిండుజవ్వనము జన్నియవట్టి తపియించు
చున్న లేజవ్వని నుజ్జగించి
కనువేఁదుఱునఁ దన్నుఁ గౌఁగిలింపఁగఁ బాఱు
తెంచు రాలచ్చి విదిల్చి కొట్టి
తన్ను భవాంభోధి దాటించు తెప్పగా
భావించు నధికారపదవిఁ బాసి
స్మరకామధేనువై సరవిఁ గోర్కులఁ బిండు
భోగినీమణి పేర బొమ్మఁగట్టి
గీ. మంత్రతంత్రంబులకుఁ బోలె మదులు దిరుగ
నతని ధర్మోపదేశ వాక్యముల కలరి
కాంక్ష సేయుచు శిష్యతికంబు మెల్ల
యువకు లొక్కొక్కరుగ వచ్చుచుండ్రు గొలువ. ౨౪

గీ. ఉదుకుఁ గావుల నొక్కరుం; డూడ్చి కనవుఁ
జల్లుఁ గలయంపి నొక్కఁ డాశ్రమము ముందు;
కందమూలఫలాదు లొక్కండు తెచ్చు;
మెత్తపఱచును వానికి బత్తి నొకఁడు. ౨౫

ఉ. తల్లిని మూఁగు పిల్లల విధంబునఁ గూరిమి మక్షికావళుల్
బెల్లము నొద్ద వ్రాలు సరవిన్, విరిదమ్మినిఁ జుట్టు తేంట్లునా
నుల్లము లుల్లసిల్లఁగ సమూహములై జను లేగుదెంచి యా
బల్లిదు తత్త్వవాక్సుధ లవారిగఁ గ్రోలుచు నుండ్రు భక్తిమై. ౨౬

క. తనదేహ మాదిఁ బెను బం
ధన మనుచుఁ దృణీకరింపఁ దలఁచెడి శమికిన్
దను దర్శింపఁగ వచ్చిన
మనుజావళి యొసఁగు పసిఁడి మాడ లవేలా? ౨౭

క. ఆతని ద్వేషించెడి వాఁ
డాతనిపై మరులుగొన్న యతివయు శిష్య
వ్రాతమున గలిసి పోవుదు
రాతని కనుచూడ్కి పడిన యా నిముసమునన్.

సీ. అలరువిల్తుని మోహనాస్త్ర సందోహంబు
తళతళల్ కోల్పోయి చిలుముపట్టె ;
తరుణదంపతుల నర్తనశాలలై వెల్గు
శృంగారవనులు నిద్రించు చుండె ;
పానగోష్ఠి ప్రసంగానుకూలములైన
వెన్నెలరాతిరుల్ చిన్నవోయె ;
మృదువైన తాఁకుల మెయి హాయిఁ గదిరించు
జిలుఁగు దువ్వల్వలఁ జెదలు మేసె ;
గీ. ప్రమద మిడు కేళకూళులు వట్టిపోయెఁ ;
జెలువు వెలియయ్యె నిసుకతిన్నెల బయళ్ళ
బోధిసత్త్వుని ధార్మిక బోధఁ బ్రజలు
జ్ఞాన వైరాగ్య సంపన్ను లైన కతన.

క. అహరహము జ్ఞాన బోధల
బహుకాలము గడపి యదియు బంధముకాఁగా
గృహముం ద్యజించి శిష్యులు
సహాయులై రాఁగ నతఁడు చనె వనమునకున్.

మ. తరుషండంబు వసంతు నాగమము చేతం బోలె నా మౌనిశే
ఖరు రాకం జిగురించి పల్లవతతిం గన్విందుఁ గల్పించె ; ని
ర్ఝర పూరంబు లగస్తిరాకను బలెన్ స్వచ్ఛంబులై పాఱె ; నే
ర్తైఱఁ గప్రంబునఁ బోలె సౌరభము నిండెం దత్ప్రదేశంబునన్.

క. తనయతిథి వగుట నీ కీ
వనదేవత యొసఁగఁగా నుపాయనమును ని
వ్వనితామణి సృజియించెనొ ?
యని తలఁతును; గాక కాన నతివ కలుగునే ? ౪౭

క. త్రైలోక్య మెన్నితడవలు
గాలించిన దానిఁ బోని కామిని గనరా
దేలా ? తినఁబోవుచు భూ
పాలక ! రుచి యడుగవలయుఁ బద ! చూపింతున్." ౪౮

క. అని విన్నవింప నతని వ
దనంబు చేటంతగాఁగఁ దన కరవలయం
బును బారితోషికం బిడి
చనియెను వెన్నంటి యువతి సందర్శింపన్. ౪౯

శా. వ్యాకీర్ణంబగు కేశపాశము నితంబాభోగముం గప్ప, న
స్తోకశ్రీ వెదఁజల్లఁగా వదనచంద్రుం, డంగలావణ్య మా
హా కల్గింపఁగ దాగురింతలకు లోనై కావిపుట్టంబునం,
దా కాంతామణి కోయుచుండె నటఁ బూజార్థంబు పుష్పంబులన్. ౫౦

క. ఆ నెలఁత విని పదధ్వని
స్థానప్రత్యయముఁజేసి తలఁగక నిలువన్
భూనాథుఁడు దగ్గఱి తన
చే నవలాచిగురుఁగేలు నేకొనఁబోయెన్. ౫౧

గీ. వాని ఘనసారవీటికాపరిమళంబు
వాని గళపుష్పమాలల వాసనలును
వాని మైపూఁతగందంపు వలపుపిండుఁ
గ్రమ్మ వెఱఁగంది మొగమెత్తి కొమ్మ గాంచె. ౫౨

క. కని యులికి స్వచిత్తాందో
ళనమున కీ బెడఁదయే ఫలంబొకొ? యనుచుం
జనియెఁ బరాఙ్ముఖి యయి పొద
వెనుకకుఁ బులిఁ గన్న లేడిపిల్లవలె వెసన్.

ఆ. వె. తారసించి యంతఁ దారుపుఁగత్తెయు
నాపె యడుగుఁ దమ్ములందు వ్రాలి
"పడఁతి! వీని చెట్టవట్టుము రాణివై
నేల నాల్గుసెఱఁగు లేలఁగలవు.

క. అడవిం గాచిన వెన్నెల
వడువున నీ చక్కఁదనము వమ్మవఱుప కీ
యొడయని నగ రలరింపుము!
చెడిపోవక సార్థకంబు సేయుము బ్రదుకున్.

క. గనిలోఁ బుట్టిన రత్నము
జననాథునిశిరసు నెక్కి సరణినిఁ దరుణీ!
వనచరివి నీవు మా రా
త్తనయుని శిర సెక్కి వాని దాస్యముఁ గొనుమీ!

గీ. చిటికెవేసినమాత్ర నీ చెలువుకడకు
వేల్పుజవరాం డ్రహంపూర్వవృత్తి వత్తు;
వీథిఁ జనువేళఁ గిటికీల వీనిఁ గాంచు
యువతులకుఁ బోఁకము ఖ్యాదుచుండుసుమ్ము."

క. నావుడు "చీ చీ! పోపో!
నీవెవతెవు? వీఁ డెవండు? నిప్పులతోడం
గావింపక చర్లాటముఁ
బోవుఁ" డని విదిల్చి త్రిప్పి మొగ మావలకున్.

క. బ్రతుకాస యున్న నీ పొల
మతివేగము విడిచి దౌల కరుగుఁడు; కడు ని
ద్రితభుజగము మేల్కొలుపక
వ్యతిక్రమముచేత శాస్తియగు నిక్కముగన్." ౫౯

క. అని కన్ను లెఱ్ఱవడ మన
మునఁ దనదగు నందచందములపై నేవం
గొని ధాతఁ బ్రువ్వఁదిట్టుచు
వనితామణి యుటజమునకుఁ బయనింపంగన్. ౬౦

ఆ. వె. ఒడుపుదప్పి వెడఁదపడగెత్తి బుసకొట్టి
పఱచు నురగి వెంటఁబడిన పగిది
మానభంగపడియు మానవేంద్రసుతుండు
వెలఁదిమానికంబు వెంటఁ దగిలె. ౬౧

క. శాపోపహతుని సలుపక
యా పావని దయ దలంప నాయమఁ దగిలెన్
బాపాచారుఁడు, మోహో
త్తాపావిష్టుఁడు గృతజ్ఞతాబద్ధులొకో! ౬౨

గీ. తనదు మంత్రంబు పాఱమిఁ దార్పుకత్తె
యెఱిఁగి యే పుట్టి మునుఁగునో? యిచటనున్న
ననుచుఁ బాఱుత కంటికెంపునకు నళికి
యింద్రజాలాంగనయనా నదృశ్యయయ్యె. ౬౩

క. శ్యేనంబు కపోతినివలె,
శ్వానంబు కురంగిఁబోలె, సర్పిని శిఖిచం
దానను, దద్యువతీమణిఁ
బూనిక వెంటాడె నా ప్రభుబ్రువుఁ డచటన్. ౬౪

క. పులినోరికంద వడువున
వెలఁదుక యా బారినుండి విడివడి తమ యా
కులగుడిసె దూఱి పతికడ
నిలిచెను దలఁ దడుముకొనుచు నిట్టూర్పెగయన్. ౬౫

ఆ. వె. అడుగులోన వచ్చి యొదయందు రోఁజుచుఁ
దడక విఱుఁగఁదన్ని గుడిసెఁ జొఱఁగ
నట సమాధి వదలి యార్చుచుఁ గనుఱెప్ప
లాసనము సడల్చి నతఁడు దోఁచె. ౬౬

చ. తనకడ కేగుదెంచు జనతాహృదయస్థతమం బడంపఁగాఁ
గనుఁగవనుండి వెల్వడెడు కాంతులమొత్తము, బ్రహ్మతేజ మా
ననమునఁ దాండవింపఁగ వినమ్రులఁ జేయుచు నుద్ధతాళి, నా
జనవరు ముంగలం బరమశాంతుఁడు బ్రహ్మవరుండు గన్పడెన్. ౬౭

క. నరపతి రథసాగమనముఁ,
దరుణీతనూకంప ముఖవిధంబులఁ గని భూ
సురవరుఁడు తద్రహస్యము
స్ఫురింపఁ గినియకయు సౌమ్యముగ తేనిఁ గనెన్. ౬౮

క. పరిమాఱిచి యా విప్రునిఁ
దరుణీరత్నము హరింపఁదలఁచి ధరిత్రీ
శ్వరసుతుఁడు లాగి యెత్తియుఁ
గరాచురిని దుముకఁబోయెఁ గరిపై హరినాన్. ౬౯

క. అడుగు రవంతయుఁ గదలద;
కడింది మిఱుమిట్లు గొనెను గనుదోయియుఁ; దుం
దుడుకొందఁగ డెందం బొడ
యఁడు చిత్తరుబొమ్మవోలె నచటనె నిలిచెన్. ౭౦

క. కళ దప్పుచుండె మొగమునఁ;
గళవళ మెడ నతిశయించెఁ; గంపమొదవెఁ గా
ళుల; వాగ్బంధన మయ్యెను;
బులినింగనుగొన్న మేఁకపోతునకు వలెన్. ౭౧

క. అలుగఁడు, కలఁగఁడు, పలుకం,
డల పాఱుఁడు; రాకుమారుఁ డనలంబుకడన్
గల తృణకణంబుగతి మదిఁ
దలడిల్లును మృత్యుముఖముఁ దరిసితి ననుచున్. ౭౨

క. పులుఁగులరాయనిఁ గాంచిన
చిలువకువలె వ్రాలె నృపతిశీర్షము నేలన్
మెలమెల్ల; శ్లథాంగుండయి
తెలియక యసి జాఱ మ్రొగ్గతిల్లె నతనికిన్. ౭౩

గీ. పదియునాలుఁగు లోకముల్ భస్మరాశి
సలుపు కౌశికు దివ్యాస్త్రసంచయంబు
పెంపడఁగి మోకఱిల్లె నిర్వీర్యమగుచు
బ్రాహ్మ్యతేజంబు నెవ్వాఁడు ప్రతిఘటించు ? ౭౪

క. మృదువు సుతీక్ష్ణం బనుటకు
నుదాహరణ మిదియె; మౌని యురుశీతలదృ
ష్టి దహింపఁజేయఁ దొడఁగెను
గదా ! ప్రతాపతపనుఁ డగు క్ష్మావరతనయున్. ౭౫

క. మరలను మొగమెత్తంగనె
తరుణీమణి గోచరించెఁ దల్లి విధముగన్
నరపతిసూనుని డెందము
పరివర్తనమొందె భక్తిపరిపూర్ణంబై. ౭౬

క. స్వాహావైశ్వానరులా ?
ఆహైమవతీమహేశులా ? గీర్విధులా ?
శ్రీహరిరమలా ? యని సం
దేహించెను విప్రదంపతిని భూపుఁడొగిన్. ౭౭

గీ. కాదు మంత్రంబు; మాయయుఁగాదు; మందు
మ్రాఁకులుంగావు; హేతు వీ మార్పుదలకు
ముగురుమూర్తులు నెఱుఁగరు ముని నిగూఢ
మగు మహాతేజపుబలంబు నన్యు లెంత ? ౭౮

క. భోగిని దిద్దంజాలును
యోగిగఁ; దామసుని సాత్త్వికోత్తంసునిఁగా;
రాగిని విరాగిగా నిల
నోగును బాగుగఁ దపస్వి యుత్తమదృష్టుల్. ౭౯

క. మౌనమునఁ గఱపుఁ దత్త్వ
జ్ఞానముఁ; బ్రేమమున గెలుచు శాత్రవతతిఁ; గ
ల్యాణ మొనర్చును భువి దుః
ఖానుభవంబున; మహాత్ముఁ డతిలోకుఁడకా ! ౮౦

క. "అపచారమొనర్చిన నను
శపింప కలుగకయు దృక్ప్రసారముకతనన్
ఉపదేశించెను జ్ఞానముఁ
గృప" నని కడు లజ్జనొందె నృపవరుఁ డెడఁదన్. ౮౧

క. ఆతనికథ యిట్లుండగ
నా తారుపుకత్తెవల్ల నలరుంబోండ్లు
ర్వీతలపతివృత్తము విని
భీతమతిన్ వచ్చిరటకె వెదకుచుఁ ద్రోవన్. ౮౨

క. సురతటినీతీరములనఁ
బరమపవిత్రులయి పుణ్యవంతులయిన భూ
సురదంపతులను, బజ్జను
బరికించిరి ప్రతిశయానుఁ బతిని వెలందుల్. ౮౩

క. అతికాముకు నత్యుద్ధతు
నతియౌవనరూపబలమదాయత్తుని నీ
గతి నిస్తేజు నొనర్చిన
క్షితిసురు మహిమకు వణంకి చేసిరి వినతుల్. ౮౪

క. మరియును విపదాశంకను
గరంబులను మొగిచి "తప్పుఁ గాఁచి యొసఁగుఁడీ
కరుణఁ బతిభిక్ష మా" కని
చెఱఁగులు సాఁచిరి మొగంబు జిగి మాయంగన్. ౮౫

క. చల్లనిచూపుల వారల
యల్లంబులు పల్లవింప నొగి నమృతంబుం
జల్లుచు, మాటలఁదేనెల
జల్లులఁ గురియించు చిట్లు సల్లాపించెన్. ౮౬

క. "పురుషార్థంబుల మోక్షము
చరమము; ధర్మార్థకామ సామంజస్యా
చరణంబున లభ్యంబగుఁ
బరమం బగు లక్ష్య మదియె ప్రాణులకెల్లన్. ౮౭

గీ. బహుముఖంబుల ధర్మంబు పరిఢవిల్లు
సత్యదానతపశ్శౌచశాంతిదాంతు
లనఁగ ఋజువృత్తితోడ వీనిని నడపుట
భవ్యమోక్షంపుఁ బ్రథమసోపానమండ్రు. ౮౮

క. తను నాశము సేసినవా
నిని నాశము సేయుఁ; దను మనిచినయతని మ
న్చు నటంచు శ్రుతిస్మృతు లె
ల్లను ఘోషిలు వేయినోళులఁ ధర్మంబున్. ౭౯

క. సతతంబు జనుఁడు ధర్మ్యపుఁ
గృతిచే ద్రవ్యముగడించి క్షితి నది ధర్మో
న్నతికయి వినియోగించుట
ద్వితీయసోపానమంద్రు దీనినిఁ బెద్దల్. ౮౦

క. ధనదాసుండయి పురుషుఁడు
పొనరించును ధర్మదూరముగఁ జేఁతలు; దా
నను లక్ష్యమైన మోక్షము
గనిపింపద చాయయేనిఁ గనుచూపులకున్. ౮౧

క. ప్రతిరుద్ధేంద్రియవేగత
సతినిన్ ధర్మార్జనంపుసాధనమును గా
మతిఁ దలఁచి కాఁపురించుట
తృతీయసోపానమంద్రు దీనిని విబుధుల్. ౮౨

క. తటియం జాలఁడు మోక్షముఁ
దరుణీదాసుఁడగు నరుఁడు ధర్మార్థంబుల్
నిరసించి ప్రవర్తించుట
దురితావహకార్య మందుఁ దూర్చి మనంబున్. ౮౩

మ. మలభాండంబగు నీ శరీరమును సమ్మానించి కై సేసి భూ
షలఁ జీనాంబరరాశి రేబవ లిదే స్వర్గం బిదేమోక్ష మం
చలరుంబోఁడులఁ గూడి మానవుఁడు లాస్యంబాడుచుం బాడుచుం
గులుకుం బంగరుతూఁగుటుయ్యేలల దూఁగుం దత్త్వసమ్మూఢుఁడై. ౮౪

మ. నరజన్మంబు వహించినాఁడ నని యానందంబున౯ వీఁగుచుం
బురుషుం డక్కట! ఉత్తరోత్తరశుభంబుల్ పొందు నాలోచనం
బు రహింజేయక యౌవనంబుఁ జరితంబు౯ వ్రేల్చి కామాగ్నిలో
ధరణిం బొందు నధోగతిం; దుదికి నుత్తామ్యన్మనస్కుండగున్. ౯౫

క. కడవంత కాయయును లోఁ
బడుఁ గత్తికి; శౌర్యధైర్యబలసాహసవం
తుఁడు తేఁ డెంత? త్రిమూర్తులు
పడిపోవఁగలారు కాలు వదనము నందు౯." ౯౬

క. అని యుపదేశింపఁగ నా
మునీశ్వరుఁ, డపాస్తచిత్తమోహులయి వధూ
జనములు రాకొమరుండును
మనుష్యతను గొంటి మనుచు మతి నలరి రొగిన్. ౯౭

గీ. అమరగంగాంబువుల స్నానమాడినట్లు
కడిఁది శాపావసానంబు వడసినట్లు
మించు సిద్ధాంజనంబు లభించినట్లు
పొలఁతులును తేఁడుఁ దలఁచిరి మోహ మెడల. ౯౮

క. జనపతి పునఃపునర్వం
దనముల నొనరించి క్షమాపణముఁ గోరియుఁ దాఁ
గనుఁగొన్న దృశ్యము సతీ
జనమునకు వచించుకొనుచుఁ జనె నెలవునకు౯. ౯౯

క. ఆదర్శప్రాయంబుగ
భూదారసుతుండు రాజ్యమున ధర్మము న
ల్పాదంబుల విహరింపఁగ
జేఁదుగ విషయముల రోసి క్షితిఁ బాలించె౯. ౧౦౦

# జాతక కథా గుచ్ఛము

## ద్వితీయ భాగము

---

## బ్రాహ్మణ జాతకము

క. తొలి బోధిసత్త్వుం డొకపరి
నిలయంబై పుణ్యమున, కనింద్యగుణుండై,
తిలకంబై సజ్జనులకుఁ,
గలిగెను బ్రహ్మాన్వయంబు కడు ధన్యముగాన్. ౧

క. తోఁబుట్టువు ధర్మము; వి
ద్యాబుద్ధులె పెద్దబలఁగ; మార్యచరిత్రం
బే బహు సంపద; విప్రుం
డా బాలకుఁడు శకపురుషుఁ డంటకుఁ దగుఁబో! ౨

క. ఏతఁడు జననం బందుట
జాతి సమున్నతి వహింపఁ జాలును భువియం,
దాతని జన్మమె సఫలము;
లాఁతులుగారే యజాగళస్తన సదృశుల్? ౩

క. సుకృతావతారమగు తం
డ్రికిఁ బుట్టిన సుతుఁడు భిన్నరీతిగఁ దగునే?
ఒకవిత్తు నాఁటఁగా వే
రొకమొలక జనించునొక్కొ యుర్విని నెందున్? ౪

గీ. బీజమున డాఁగిన మహోచ్చవృక్షమువలె
బాలకుండైన యాతని వర్తనమున
నిర్వచింపగరాక మనీషిమాత్ర
దృశ్యమానంబు మాహాత్మ్య దీప్తి డాఁగె. ౫

క. తన వినయ విధేయతలఁ,
వినీతుల విధేయులుగను బెదపెద్దలఁ జే
యును దనకు; వెలయును విల
క్షణ మగు నతిశయ మొకొక్కఁ జనునందు నిలన్. ౬

ఆ. వె. బాలుఁడైన నతఁడు వందనీయుండయ్యె
బాలచంద్రుఁడట్లు ప్రజలకెల్ల;
దినదినాభివృద్ధిఁ గొనుచున్న యతఁడెంత
కనులవిందు సేయఁగాఁగలాఁడొ ? ౭

క. అందంబునఁ జందంబున,
నందక వాఙ్మనసముల కుదాహరణంబై
మందికి, నాతఁడు శైశవ
మందును సడిసన్నయశము నంది వెలింగెఁ. ౮

క. క్షితి గురువులకు గురుండనఁ,
బ్రతిభాయుక్తుం డతండు పరగుచు విద్యా
తతిఁ గఱచె గురుగురుత్వముఁ,
బ్రతిష్ఠఁ గావింప శిష్యభావాశ్రితుఁడై. ౯

ఆ. జీవరత్నమేని శ్రీ సముజ్జ్వలమౌనె
సానఁ దీఱకున్న జగమునందు ?
ఉజ్జ్వలించునే గురూపదేశము లేని
చదువు సద్వివేకశాలికైన ? ౧౦

గీ. ఆ కుశాగ్రీయబుద్ధి విద్యాచయంబు
నేకసంథాప్రతిగ్రాహి యగుచు నేర్చి
ప్రాగ్రసరుఁడై సమస్తకలార్థితతికి
గురుని మించిన శిష్యుఁడై వరలె నోలి, ౧౧

క. నేలయును విత్తనంబులు
మేలివియగు నేనిఁ బంట మేల్మేలగు; నా
వాలునఁ దెలివియుఁ గఱపులు
మేలివిగలవాఁడు గొనఁడె మేలగు విద్దెల్ ? ౧౨

గీ. తెలివితేటలు, వినయవిధేయతలును,
ధర్మమార్గానువృత్తి, యుదారవృత్తి
కలుగు నాతండు శిష్యుండుగా లభింపఁ
బూజ్యుఁడగుఁగాదె ముల్లోకముల గురుండు. ౧౩

క. ఒకపరి శిష్యుల కధ్యా
పకుండు బోధించి వలయు పాఠంబుల, వా
రికిఁ గల ధర్మారూఢినిఁ
బ్రకటింపఁ దలంచి యిట్లు పలికెను గూర్మిన్. ౧౪

క. "ఉప్పుండినఁ బప్పుండక
పప్పుండిన నుప్పులేక పడుచుంటిఁగదా !
తిప్పలు మీర లెఱుంగరె ?
చెప్పంగా నేల యింటిస్థితి యెల్లదియున్. ౧౫

చ. నలుగురిలోని కేగుటకు నాన యగుంగద ! యట్టి చింకి పాఁ
తలు ధరియించి; యుండ నుచితంబగు నిల్లును బండ మంచముం
దెలియదె నాకు లేనికత ? తెల్లము మీకును నాదు వంటపా
త్రలు మరిఁగుండబొచ్చెలుగదా ! వచియింపఁగ నేల నా సిరిన్. ౧౬

క. నగనాణ్యంబుల కోసము
మగువయు బిడ్డలు నొనర్తురి మారామును రేఁ
బగళులను శిష్యులారా !
మగనాండ్రకుఁ గలదె జాలి మగవాండ్రపయిన్ ? ౧౭

గీ. సరిగఁ బ్రతిపూట కెన్ని విస్తళ్ళు లేచు ?
నెన్ని యుడుకును బియ్యం ? బిదెల్ల మీకుఁ
జదివి వినుచుట చర్వితచర్వణంబు
కలదొకో మీ రెఱుంగని కత యొకండు ? ౧౮

క. తరమే ? విస్తరివంపును
మరి సంసారంపువంపు మానవతతికిన్
సరిదిద్దఁగ ? నైనను బ్రతి
నరుఁడు యథాశక్తి ప్రయతనము సేయవలెన్. ౧౯

క. తలక్రిందఁ గొండయుండఁగ
నిల రాలకు వెదకు విధిని; నీరుండఁగ శి
ష్యులరై ధనార్థముగ వా
రల వీరల దేబిరించు క్రమ ముచితంబే ? ౨౦

ఆ. ఇంటికొక్క పోఁగు నిచ్చిన నిల్లాలి
కగును జీరటందు రవ్విధమున
సాయపడఁగ మీరు నా యిల్లు నిండదే ?
యగును మీకు దాన నభ్యుదయము. ౨౧

క. గురుదక్షిణ నర్పింపగఁ
బరధనముల నపహరింపవచ్చును; దానన్
దురితంబు రాదు; కావున
నరుగుఁడు ! కొనితేరుఁ ! దోపినట్లు ధనంబుల్. ౨౨

గీ. చూచిరమ్మన్నఁ గాల్చివచ్చుదురు మీర
లొక్కరొక్కరు, నేమి సేయుటకుఁ దగరు ?
పెద్ద తడవులనుండి యీ విషయ మెల్లఁ
గడఁగియుం దెల్ప సంశయపడుచునుంటి. ౨3

ఆ. మీరు సుతులవంటివారలు కావుట
వేళ్ళఁబోసికొంటి వెతల నిట్లు
తండ్రి కష్టములకుఁ దనయులుగా కెవ్వ
రాదుకొందు రన్య ? లయ్యలార !" ౨౪

క. అని తన దారిద్ర్యవ్యథ
వినిపింపఁగ దేశికుండు, విద్యార్థులకున్
మనమున శూలాఘాతము
లన నొక్కొకనుడియు వ్రణములం గల్పించెన్. ౨౫

చ. గురువులు వారి పేదఱిమిఁ గూర్చి గడుంగడు సంతపించుచున్
ద్వరితగతిన్ దిశాతతికిఁ బైన మొనర్పఁగ శిష్యులెల్ల ని
ల్చిరి కొనితెచ్చి ముచ్చిలియుఁ జేలములన్ ధనధాన్యరాశ్యలం
కరణగణం బహంప్రథమికన్ గురుభక్తిని వెల్లడింపఁగన్. ౨౬

క. దురితం బుపదేశించిన
గురువులతో గ్రుద్దులాడఁ గూడునుగానీ
దురితక్రియ కురరీకృతి
గురుభక్తి యనంగఁ దగునొకో ప్రాజ్ఞునకున్ ? ౨౭

క. పలుమఱులు "పరద్రవ్యా
ణి లోష్టవ" త్తనుచుఁ గఱపి నీతులు పెక్కుల్
తలక్రిందుగ నేఁ డీతఁడు
వలుకఁగ నేలంచు వారు భావింప రిసీ ! ౨౮

క. స్తేయంబుఁ గఱపిన యుపా
ధ్యాయుని పలు కాలకించి తన డెందమునన్
రోయుచుఁ గడు గురుదూషణ
హేయం బని బోధిసత్త్వుఁ డేడ్చుచు నిలిచెన్. ౨౯

క. వంచినతల యెత్తఁడు "వీ
క్షించం డాచార్య" నన్యశిష్యుల ననువ
ర్తించఁదలంపఁడు; విద్యా
చంచువు మదివెఱచి కిల్బిషం బొనరింపన్. ౩౦

క. "రావేటి ?" కనుచు మిత్రులుఁ
"బోవేటి ?" కటంచు గురువుఁ బోర్వెట్టిన నా
ధీవరుఁడు బోధిసత్త్వుఁడు
వావిడిచి వచింపఁ డయ్యెఁ బ్రత్యుత్తరమున్. ౩౧

ఉ. ఇంగితవేదియైన గురు వీతని పాపవిదూరచిత్త వృ
త్తిం గనిపెట్టి శిష్యులకుఁ దెల్లముగా గుణపాఠ మొందు నే
ర్పంగను బోధిసత్త్వుఁ గని పల్కెని"టోగురుభక్తిశూన్య ! ని
న్నుం గఠినుండవంచుఁ గృపణుండ వటంచు నెఱుంగ నింతకున్. ౩౨

ఆ. చీమకుట్టినంత చేయకున్నది నీకు
నింత వినుచుకొన్న నింటిగోడు ;
ఒకని కడుపుమంట నొకఁ డేమెఱుంగు ? శు
ష్కప్రియంబు లాడు జాణవీవు." ౩౩

మ. అని పల్కన్ గురుభక్తిశూన్యుఁ డను పల్కాలించి యాతండు గ్ర
న్ననఁ "బాపంబుశమించుఁ గాత" మనుచున్ గర్ణంబులన్ మూసికొం
చును "నా యీ యపచారమున్ సయిపుఁ"డంచుం బాదపద్మంబులం
బ్రణమించున్ రుదియించు నశ్రువుల జాల్వాఱంగ నేత్రంబులన్. ౩౪

క. "అనరాదుగాని మీరలు
పనిచిన కార్యంబు ధర్మబద్ధము గాదం
చును బోధించుచు నున్నది
యనయము నా యంతరాత్మ యత్యంతంబున్. ౩౫

గీ. అంతరాత్మ విరుద్ధకార్యానువృత్తి
కొప్పుకున్నది; వెనుదీయుచుంటిదాన;
నాకు నిక్కంపు గురుభక్తి లేకకాదు;
నాకు మిత్రులపైఁ గూర్మి లేక కాదు. ౩౬

క. ప్రవచించి ధర్మమార్గము
స్వవచోవ్యాఘాతముగను 'చౌర్యము ధర్మ్యం'
బవునని మీరలు గఱపిన
నవుగా దనఁగ మొకమోట మందుచునుంటిన్. ౩౭

గీ. అకట ! 'దండ్యుండు గురువు శిష్యాపరాధ
మున'నటందురుగద ! మిమ్ముబోటిబుధులు
నాకతన మీకు నెట్టి దండంబు వచ్చు
నో ? యటంచును బరితాప మొందుచుంటి. ౩౮

క. చౌర్యము ధర్మ్యంబని యా
చార్యుం డెవ్వండు వలుకు ? నది సేయునొకో
ఆర్యమనస్కుండు ? భవ
చ్చర్య మముఁ బరీక్షణంబు సలుపుటకేమో ? ౩౯

క. ఆఁకలి యసహ్య మగునెడ
నాకలముల మేసి బ్రదుకు టర్హముగానీ
యీ కరణి దుష్కృతంబున
కూకొట్టుట సముచితంబొకో మనుజులకున్ ?" ౪౦

క. అని ధర్మబద్ధముగ నిటు
జనవంద్యుండైన బోధిసత్త్వుఁడు వలుకన్
విని హర్ష బాష్పముల నా
తనిఁ గౌఁగిలిఁగొని గురుండు దగ నిట్లనియెన్. ౪౧

క. "అక్షేత్రంబున బీజము
ప్రక్షిప్తంబై నశించు; ఫలియించుఁగదా!
సుక్షేత్రంబున నయ్యది;
దక్షుండవు ధర్మముల ముదంబును గొంటిన్. ౪౨

క. ఉపధాశుద్ధుండవు! నా
యుపదేశము నాటె నీకు యుక్తముగ; మహిన్
సుపురుషులు భవాదృశు లుం
ద్రపురూపుగ; నాదుగురుత సార్థతఁ గాంచెన్." ౪౩

క. అని మెచ్చి బోధిసత్త్వునిఁ,
గనుంగొనుచు నన్యశిష్యగణముం బలికెన్
"సునయజ్ఞుండగు నీతని
ననువర్తింపుండు ధర్మ మారాధింపన్." ౪౪

క. అని యుపదేశం బొనరిచి
యనేకముల నాశిషముల నర్పించియు నం
పినఁ, బోయి బోధిసత్త్వుఁడు
తనయింటికిఁ, గడపె జీవితము ధర్మరతిన్. ౪౫



# జాతక కథా గుచ్ఛము

## ద్వితీయ భాగము

## బిసజాతకము

క. పావనముఁ బుణ్యతమమును
సౌవర్గఝురంబు పగిది, జ్ఞానమునకుఁ బా
రావారము, సత్త్వమునకుఁ
దావును నగు బ్రహ్మకులము దగు నొకటి భువిన్.

క. జనవంద్యం బగు తత్కుల
మున నేడ్వురుసోదరులును బొరి నొక చెలియల్
జనియింప బోధిసత్త్వుఁడు
దనరెన్ జ్యేష్ఠత్వ మొంది తద్వర్గమునన్.

క. శ్రేష్ఠులు విద్యల, గుణభూ
యిష్ఠులు, నిత్యముఁ బవిత్రు లివ్వసుమతిపై
గోష్ఠంబులకరణి, వయో
జ్యేష్ఠకనిష్ఠతలె వారియెడ నంతరముల్.

గీ. మావిచెట్టున జనియించు మావిపండ్లు;
రతనముల సంభవించును రతనపుగనిఁ;
బాలసంద్రంబున జనించుఁ బాలయలల;
తత్కులోద్భవు లెల్లరుఁ దత్త్వవిదుల.

క. గురుశుశ్రూషాదిక మ
క్కుఱగొన కుదుబ్బద్ధ మయ్యె జ్ఞానం బా సో
దరసమితి; కిప్పపువ్వులు
పరిమళమున కెవరినేనిఁ బ్రార్థించెడినే?

క. కలదు కుడియెడమలకువలె
నలంతిభేదంబు పెద్దయన్నకుఁ, దక్కం
గల యెల్లసోదరులకును
బలువురి కది కానఁబడద వారికిఁ దక్కన్. ౬

సీ. అహరహంబును బ్రాహ్మమందు మేల్కొని పోయి
పాదాభివందనవ్రత మొనర్తు
పరమభాగ్యంబగా భావించి యనుదినం
బొగిఁ గావిసీరల నుదుకుచుంద్రు;
సాయాహ్నములయందు సరవి నొక్కెడఁ జేరి
తత్త్వగోష్ఠీ భాషితముల విండ్రు;
కనుదమ్ములకు నద్దుకొని రాతిరులఁ బాద
సంవాహనాదులు సలుపుచుంద్రు;
గీ. అడుగులకు నెల్లవేళల మడుగు లొత్తు
చాదిదంపతులంబోలె నవిరతంబుఁ
గొలఁదిమీఱిన బత్తిమైఁ గొలుచుచుంద్రు
తల్లిదండ్రులఁ బుణ్యసోదరగణంబు. ౭

క. పితృమాతృదేవతలు నా
క్షితినిం బ్రత్యక్షమైన జేజేలు సుఁడీ!
ఇతరసురుల్ కా రిట్టిరు;
పితృసేవాపరులు బహుపవిత్రులుఁ బుణ్యుల్. ౮

క. కాలక్రమంబునం ద్రిద
శాలయము నలంకరింప నా పితరులు శ్ర
ద్ధాళుతఁ బితృమేధము నా
బాలురు నేసిరి పితౄణభారము దొలఁగన్. ౯

క. పరిణతమతు లయ్యును బితృ
మరణజ నవశోకవివశమానసు లగుటన్
జిఱుతలు వార లొనర్తురు
కరుణాక్రందనము; క్రింగఁగల రెవరు వెతన్. ౧౦

క. ఒకనాఁ డాతఁడు తమ్ముల
నికటమునకుఁ బిల్చి దాంతినిష్ఠతఁ జూపిం
పక బాష్ప స్తంభనమును
మొకమున, వారికి వచించె బుజ్జవములతోన్. ౧౧

క. 'మరణంబె ప్రకృతి జీవుల;
కరయఁగ జీవితమె వికృతి' యను విబుధోక్తిన్
స్మరియించుచు మీమది సో
దరులారా! పితృమరణజతాపము విడుఁడీ! ౧౨

క. ఋణవశమున సంయోగము,
ఋణక్షయంబున వియోగ మెనయుచును దరం
గిణిఁబడ్డ కాష్ఠములనం
బ్రణయంబును ద్రుంచి ప్రాణివర్గము పఱచున్. ౧౩

క. చెఱనుండి ముక్తిఁగాంచిన
నరుగతి నీ దేహబంధనము వీడి మహ
త్తరగతిఁ బొందెడి జీవుల
కొఱకై చింతింప బద్ధకోటికిఁ దగునే? ౧౪

క. "జనియించుసర్వజంతువు
ననిత్యతయె వోలె నంకంబునఁ జే
ర్చును మొదట; దాదివలెఁ ద
జ్జననియుఁ బిమ్మట"నటన్న సత్యము వినరే! ౧౫

క. ఎవఁ డేకరసముగా మది
నవలోకము సేయు సంపదాపద లతఁడే
సువివేకి; విషామృతముల
చవి సమముగఁగొన్న హరుని చందమున ధరన్. ౧౬

క. పొలియ ఫలోన్ముఖవృక్షం
బిలఁ జెల్లును జింతిలంగ; నెండిన ముది మ్రాఁ
కులకై వగతురె ? ధరఁ బె
ద్దలమరణము పెండ్లిసాటిఁ దలఁతురు విబుధుల్. ౧౭

క. అని యూఱడించి జననీ
జనకులు లేనట్టి వెలితి స్వాంతమున నతం
డణుమాత్రఁ దోఁపనట్టులు
తనతమ్ములఁ జూచుచుండెఁ దత్పరమతియై. ౧౮

క. ఎఱకలను గప్పి పిల్లలఁ
బరిరక్షించెడి పులుంగువలె నతఁడు స్వసో
దరులను గడుపున నిడుకొని
కరశతములఁగప్పి ప్రేమఁగాచుచు నుండెన్. ౧౯

క. మతినిన్ "జ్యేష్ఠోభ్రాతా
పితృసమ" యను సూక్తిఁదలఁచి పెద్దన్నను బూ
జితుఁజేయఁ దమ్మ, లాతఁడు
సుతులనువలె స్వాంగకముల చొప్పునఁ జూచెన్. ౨౦

క. ఆతఁడె తల్లియుఁ దండ్రియు;
నాతఁడె దేశికుఁడు, చుట్టు మాతఁడె; మిత్రుం
డాతఁడె తమ్ముల కందఱి;
కాతఁడె త్రైలోక్యనాథుఁ డది యిది యేలా ? ౨౧

ఆ. వె. వాని సద్గుణాళి, వాని చారిత్రంబుఁ
గడిఁది మేలుబంతిగాఁ దలంచి
వ్రాయు నొరవడులను భ్రాతృవర్గము, కొల్చుఁ
దత్పదముల దేవతలను బోలె. ౨౨

క. ఆతనిగృహంబు పుణ్య
క్షేత్రం బని, వాని నొక్క సిద్ధుం డనియున్,
జేతమునఁ దలఁచి తమ్ముం
బాతమ్మన్యులుగఁ దలఁచిపోవుదు రతిథుల్. ౨౩

క. తమ్ముల నందఱి నొకదివ
సమ్మున జ్యేష్ఠుండు పిలిచి సన్నిధికి, స్వచి
త్తమ్మున వేర్గొన్న రహ
స్యమ్మగు భావమ్ముఁ దెలుప సంకల్పించెన్. ౨౪

క. "పునరుక్తియుఁ జర్వితచ
ర్వణంబు నగుఁగాదె ! యెల్లప్రాణుల వ్యథలన్
గనుచుఁ గరామలకంబుగ
మనస్వు లయియున్న మీకు మరలన్ నొడువన్. ౨౫

క. జననము; మరణముఁ; గ్రమ్మఱ
జననము; మరణంబు; మరల జననమరణముల్;
గొనుచున్ భ్రమించు జీవుం
డనేకశం బాత్మకర్మలనుభోగింపన్. ౨౬

క. సతముఁ దరంగాఘాత
ప్రతిఘాతంబులకుఁ జిక్కువడి యురువాతా
హతిఁ దలక్రిందగు నోడకుఁ
బ్రతి గాఁదే గేస్తు సంసరణదుఃఖహతిన్ ? ౨౭

క. మీసాలతేనె నాఁ దగు
నీ సంసృతి సుఖముకొఱకు గృహమేధము గో
చీ సంరక్షింపఁగ స
న్న్యాసి పటాటోప మట్టు లర్థింత్రు జనుల్. ౨౮

క. కూపస్థమండుకమువలెఁ
బాపము ! గృహమేధి యీ ప్రపంచముకన్నన్
బ్రాపింపఁదగిన దేదియుఁ
బైపై లేదనుచు నటనె భ్రమియించుఁ గడున్. ౨౯

క. వాసనల నుద్భవిల్లును
నీసాంసారికవిమోహ; మిది పురుషుం డ
భ్యాసమున జితేంద్రియుఁ డయి
దాసుఁడయి విరాగమునకుఁ దగ నార్పవలెన్. ౩౦

క. బహుమానలేశమును నా
కిహజీవితమందు లేమి నేను దపమునన్
అహములు ద్రోచుచు శమినై
మహీయ మగు మోక్షమొంద మదినిఁ దలంతున్. ౩౧

క. చదివితిరి సర్వవిద్యలఁ;
బొదలితిరి వివేకభూతిఁ; బూర్ణప్రాయం
బొదవినది మీకు; నియ్యది
యదను గృహస్థాశ్రమంబునం దడుగిడఁగన్. ౩౨

క. కులవతు లగు యువతులఁ బెం
డిలియాడుఁడు; పూన్కి ధర్మనిష్ఠ మెలఁగుడీ !
చెలియలికిఁ బెండ్లి సేయుఁడు;
నిలుపుఁడు కులగౌరవం బనింద్యచరిత్రన్. ౩౩

చ. అతిథిసపర్య సేయుఁడు; దయామతి వర్ణవివక్ష మాని; యు
చ్ఛతయును నీచభావమును జాతిగతంబులుగావు వర్తనా
గతములు; హింసకంబులగు కర్మలు వేదహితంబులైన దు
ష్కృతముల సుండు! గైకొనుఁడు శ్రేష్ఠసనాతనధర్మముల్ తగన్. ౩౪

ఆ. వె. కాకదంతగణనకై కడంగుటగాదె
బ్రహ్మమును గుఱించి ప్రశ్న సేఁత ?
ఉన్ననతఁడు లేకయున్నను శమదమా
దులను సేకరింపఁ దొడఁగవలయు." ౩౫

క. అని యుపదేశింపఁగ నా
యనుజయు ననుజన్ములెల్ల రానతముఖులై
యని రేకగ్రీవంబుగ
మును దీర్మానించుకొన్న పొలుపున నిట్టుల్. ౩౬

క. "ఎది నీకు హేయ మయ్యెనొ ?
యది సముపాదేయ మెట్టులన్నా ! మాకున్ ?
ఇదియేటి ప్రతీపత ? య
స్మదీయ మపరాధ మేమి ? మము విడిచెదవే ? ౩౭

క. అడుగిడుచు నీదునడుగులఁ
బడి నీతోపాటు మోక్షపదముం దఱియన్
ఎడఁదం దలంచు మమ్ముం
గడువెనుకకు నెట్టి పఱవగా నెంచితివే ? ౩౮

ఆ. వె. 'విందు మాకు మీకు మం' దన్న చందాన
నాశ్రయించి శ్రేయమైనపదము
హేయమైనపదము నిట్లు తెల్పితి మాకు
నేల ప్రాతికూల్య మిట్లు గొంటి ? ౩౯

క. తన్నాశ్రయించు తరువులఁ
దన్నుంబోనివిగ గంధతరు వొనరించున్
నిన్నాశ్రయించు తమ్ముల
నన్నా ! యిటుమైలద్రోచు" టర్హమె ? నీకున్. ౪౦

క. అని పలికి తమ్ము వెంటం
గొనిపొమ్మని మరలమరలఁ గోరు చడుగులం
దున వ్రాలి లేవకుండిన
యనుజులఁ గొని యాతఁ డడవి కరిగెఁ దపముకై. ౪౧

ఆ. వె. వీరియింట బ్రదికి పెద్దకాలమునుండి
పిల్లలయిన వీరినెల్లఁ బెంచి
పెద్దలుగ నొనర్చు వృద్ధదాసి యొకర్తు
వెడలె నీడవోలె వెంబడించి. ౪౨

క. పరిశుద్ధమధురజలములఁ,
బరిమళిత ప్రసవ వితతిఁ బాద్యార్ఘ్యము లా
దరముగ నిడి వనదేవత
వరివస్యంజేయు నతిథివర్గమున కటన్. ౪౩

క. తమ్మికొలంకులుఁ, బూటీ
రమ్ములు, ఫలతరుగణంబుఁ, బ్రాణప్రియులై
తమ్ముం గొలువఁగ భ్రాతృచ
య మ్మాకాంక్షించె నచట నావాసింపన్. ౪౪

క. పిడిది నికుంజాంతరములఁ,
బడక శిలాతలములందుఁ, బ్రాశము బిసముల్,
మడుఁగులు నారలు కాఁగా
గడఁగిరి తపమునకు నియతగతి నా భ్రాతల్. ౪౫

క. ఎడనుండి విషయమలములఁ
గడిగిరి; చంపిరి సమూలఘాతము తృష్ణన్;
బుడమి న్నిరాశ్రయము లయి
యడుగులఁబడి వీరి యాశ్రయముఁ గొనె గుణముల్. ౪౬

శా. సాయాహ్నంబులఁ దమ్ములంద ఱొక వృక్షచ్ఛాయఁ గూర్చుండఁగాఁ
శ్రేయశ్శ్రేయములం గుఱించి యతిగంభీరం బుపన్యాసముం
జేయుం; దేల్చును దారతమ్యమును దజ్జ్యేష్ఠుండు; వారెల్లరుం
బీయూషంబును గ్రోలు చందమునఁ దృప్తింబొంది హర్షింపఁగన్. ౪౭

క. కర్మగతిగుఱిఁచి యొకపరి
ధర్మంబునుగూర్చి యొక్కతఱి యందా యం
తర్ముఖుఁడటఁ బ్రవచించును
నిర్మోహము నొంద వినెడి నిజజతతియున్. ౪౮

క. ప్రతిదిన మధ్యాహ్నములం
దతిమృదుమధురంబు ధౌతమగు బిసఖండ
ప్రతతిని దాస్యర్పితమును
స్థితికై సంకేతగము భుజింతురు వారల్. ౪౯

క. తమభాగము జ్యేష్టాను
క్రమముగ నేతెంచి వారు కైకొను టాచా
రము; కాని యొకపరి నిజాం
శము కానంబడమి నుఱక చనె జ్యేష్ఠుఁ డొగిన్. ౫౦

క. తెలియదు తమ్ముల కియ్యది;
తెలియదు దాసికి; నతండు దెలుపఁడు పెఱవా
రల కిట్లు ; కడఁచె బదిదిన
ములు జరుగుచునుండె ధర్మబోధలు దినముల్. ౫౧

క. దివసక్రమమున ధర్మ
ప్రవచనశక్తియు నడంగె భ్రాతలు తద్ధే
తువు దెలియక సంకటపడి
చివరికిఁ బ్రశ్నించి రతఁడు చెప్పెనిజంబున్. ౫౨

ఆ. వె. దాని విన్నమాత్రఁ దమ్ములుం జెలియలు
నొకరుసూచుకొనిరి యొకరి మొగముఁ
దన్నుదోషి యంచుఁ దలఁతురో లాఁతులం
చెల్లవారి మోము పుల్లసిల్లె. ౫౩

క. తదుపరి యెల్లరు వినఁగం
బెదతమ్ముం డాత్మశుద్ధి వెలయింపఁగ బె
ట్టిద మగు శపథ మొనర్చెను
దదగ్రజుని చరణములను దాఁకుచు నిట్టుల్. ౫౪

ఉ. ఏతఁడు నీతిమాలి హరియించెనొ నీ బిసఖండ భోజనం ?
బాతఁడు పుత్రపౌత్రులు, మహాధనధాన్యపశూచ్చయంబుఁ, గాం
తాతతి, వస్తువాహన వితానముఁ, బొంది సుఖించుఁగాత ను
ర్వీతలమందు శక్రపదవిం దలఁదన్నెడు వైభవంబుతోన్. ౫౫

క. పిమ్మట నిది విని రెండవ
తమ్ముఁడు దనయన్న యడుగుఁదమ్ములకుఁ బ్రణా
మమ్మిడి కావించెను శప
థమ్మిట్లు నిజాకళంకతం బ్రకటింపన్. ౫౬

క. "ధర నీ బిసశకలంబుల
హరియించిన పుణ్యశాలి యవనీపతియై
తరుణీశతపరివృతుఁడై
విరివిగ భోగించుఁగాక విషయసుఖంబుల్." ౫౭

క. నతిసేసి యగ్రజునకుం
దృతీయుఁ డనుజుండు బాసతినె నీ పగిదిన్
"క్షితి నీ మృణాళచోరుఁడు
సతతము సురసతులఁగూడి సౌఖ్యము వడయున్." ౫౮

క. ఈ సరణినెల్ల తమ్ములు
బాసాఁడగ నొక్కరొకరు వాని కెరగుచుఁ
దాసి యనె నిట్టు "లీ పని
చేసినయది బ్రతుకుఁగాక క్షితి వేయేఁడుల్." ౫౯

ఆ. వె. అంత వచ్చి చెలియ లన్నకు సాఁగిలి
"నీదు కడుపుఁగొట్టు నీచురాలు
పడయుఁగాక రాజుపట్టపురాణియై
ప్రాజ్యరాజ్యసుఖము"లంచుఁ బలికె. ౬౦

క. మఱియును ధర్మశ్రవణము
కొఱకై యచ్చటికి వచ్చి కూర్చుండిన కొం
దఱు యక్షులు శపథించిరి
"సిరితోఁ దులఁదూఁగుగాక స్తేనుం"డనుచుఁ. ౬౧

క. విని ప్రతిన లిట్లు జ్యేష్ఠుం
డను "సోదరులార ! యీ బిసాపహృతికి మి
మ్మనుమానించితి నేనిం
జనియింతు గృహస్థ నగుచు శతజన్మంబుల్" ౬౨

క. సురపతి విని శపథంబులఁ
దిరస్కరిణిఁ ద్రోసి యెదుట దీపింపఁగ సో
దరు లెల్లరు సాఁగిలి మ్రొ
క్కిరి వినయవిధేయతలు ప్రకీర్తితములుగాఁ. ౬౩

గీ. "అపహరించితి మీ బిసాహార మేనె
తావకమనఃపరీక్షకై తత్పరమతిఁ
బిన్నలయ్యును గార్హస్థ్యవిముఖు లైన
మిమ్ముఁ జూడంగ నా కక్కజమ్ము దోఁచు. ౬౪

క. ఇదిగో! బిసతతి; మత్కృత
కదర్థన క్షమింపుమయ్య! ఘనమతి! నాతోఁ
ద్రిదివమునకు నేతేరుము
మదీయరథ మెక్కి యనుజమండలితోడన్." ౬౫

క. అని పలుకు వేల్పుఱేనిం
గనుఁగొని పెద్దన్న బత్తిఁ గైమోడిచి యి
ట్లనె; "నీదు ప్రసాదంబును
గొనమికిఁ గినియకుము మమ్ము గోత్రధ్వంసీ! ౬౬

శా. ఆ నాకంబున నప్సరశ్శతముతో నా నందనోద్యానమం
దాన ర్తించుచుఁ బుష్పకుంజమృదుపర్యంకంబులన్ సీధుపా
నానందంబున సంప్రవర్ధితరతివ్యామోహముగ్ధాత్మతన్
నానాక్రీడలఁ దేలుచుంట బుధగణ్యం బైన కార్యంబొకో? ౬౭

గీ. స్వర్గమైన మహేంద్ర! నశ్వరమె కాని
శాశ్వతముగాద; మాకు శాశ్వతికసుఖము
వాంఛనీయంబు; కావున వలదు పొమ్ము!
ఇవ్విధంబున వేధింప కింకఁ బొమ్ము! ౬౮

గీ. అమరలోకాధివాసంబు నభిలషించు
వారి శోధింపఁగఁ బ్రయాసపడఁగఁ జెల్లు;
శ్రేష్ఠనిర్వాణపదముఁ గాంక్షించియున్న
వారి రిత్తగఁ బీడింపఁ బాడియగునె?" ౬౯

క. అనుటయు నా పురుహూతుఁడు
చనె లజ్జానతముఖాంబుజాతుం డయి మె
ల్లన; నా సోదరగణమొం
దెను వాసన లార్చి తుదికి నిర్వాణంబున్. ౭౦

★

# జాతక కథా గుచ్ఛము

## ద్వితీయ భాగము

---

### మహాకపి జాతకము

సీ. స్మరణమాత్రన సర్వదురితముల్ క్షాళించు
నమరస్రవంతి యెం దవతరించె;
ముక్కంటి ముంగిటిముత్యమైన భవాని
ఘనమైన యెవ్వాని కడుపుపంట;
దివ్యతీర్థంబు సిద్ధిక్షేత్రము నటంచు
సప్తర్షిబృంద మెచ్చటఁ దపించు;
నమరలోకాధివాసము రోసి నిర్జరుల్
కాంక్షింతు రెయ్యెడఁ గాపురింపఁ;
గీ. గాక యత్యుచ్ఛశృంగసంఘాతముననె
యాభిజాత్యసమృద్ధిఁ, బుణ్యానుభావ
సంపదలచే, మహోన్నతస్థాన మొంది
యా హిమాలయపర్వతం బలరుఁ బుడమి.

క. మన బోధిసత్త్వుఁ డొకపరి
ఘనప్రమాణంబు గలుగు కపిరూపమునన్
జనియించి యా తుషారా
ద్రిని వాసము సేయు నొక్కవృక్షమునందున్.

క. నరులకు నబ్బని గుణములుఁ
జరిత్రముఁ దితిక్ష గలిగి జగతి గురులకున్
గురువై యుండందగె; వా
నరుఁడే యాతండు ? మౌనినాథుఁడు గాఁడే ?

క. ఆ వానరేంద్రునడుగుల
సేవించి తరింపఁ దలఁచి చిన్నలుఁ బెద్దల్
వేవేలు వన్యజంతువు
లా వృక్షప్రాంతమందె యావాసించున్.

క. ఆ వనమందలి క్రూరమృ
గావళి హింస్రతనుబాసి యతిసాధువులై
గోవులవలె, గొఱ్ఱెలవలె
నై వర్తించును దదీయ మగు బోధములన్. ౫

క. ధరియించి మృగాకృతులను
జరియించు తపస్విగణము సరణిని మృగముల్
పరమప్రశాంతమూర్తులు
నిరస్తమాంసాశనులుగ నెగడెను శములై. ౬

గీ. ప్రత్యుషంబున నందలి వన్యమృగము
లమరగంగాంబువుల స్నానమాడి వచ్చి
పండి రాలిన తియ్యనిపండ్లఁ దెచ్చి
పేర్మి గురుదక్షిణగ సమర్పించుఁ గపికి. ౭

క. సతతం బయాచితోప
స్థితమగు ఫలమూలకందతీర్థంబుల జీ
వితమును నిలుపుచుఁ గర్మ
క్షతికాలం బెదురుసూచు గతి నతఁ డుండెన్. ౮

క. ఒకదినమున నచ్చోటికి
నికటంబునఁ బటపటధ్వనివిమిశ్రితమై
"అకటకటా ! చచ్చితి"నం
చొకకూయి వినంగఁబడియె నుచ్చైస్స్వరమై. ౯

క. ఆ యార్తాలాపము విని
యా యార్తత్రాత వానరేంద్రుఁ డఱచుచున్
"ఓయీ ! వచ్చితి నిదె" యని
యా యాశకుఁ బఱుగువాఱె నతివేగగతిన్. ౧౦

చ. ప్రపతితజీర్ణపర్ణమయి పంకిలమై క్రిమికీట పూర్ణమై
ఉపగతదుష్టగంధమయి యుగ్ర మగాధము నైన యొక్కఁగ
ర్తపు సలిలంబులన్ విధివిధానమునం బడియున్న మానిసిన్
గపి కరుణాతరంగితమనస్కతఁ గాంచె నటన్ సబాష్పుఁడై. ౧౧

క. ధర నరుఁడు బ్రదుకు ధాత్రీ
ధరంబుపైనుండి పడినఁ; దక్షకుఁడేనిం
గఱచిన "ఆయు ర్మర్మా
ణి రక్షతి"యటంచు విబుధనివహము వలుకున్. ౧౨

గీ. నరకకూపంబుఁబోని యా ముఱికికూప
మున మునుంగుచుఁ దేలుచుఁ బుణ్యవశతఁ
గాలిఁ దాఁకిన పాషాణ ఖండకంబు
నాఁదుకొని నిల్చె నతఁ డలసాంగకముల. ౧౩

గీ. శోచ్యదశ నున్న యాతనిం జూడఁ గపికి
నైదుప్రాణంబులును బోయినట్టు లయ్యెఁ,
గపినిఁ గాంచిన యతనికి గతములైన
ప్రాణములు వచ్చిన ట్లయ్యె వాస్తవముగ. ౧౪

క. మరియును గపినిం గని యా
పురుషుం డిట్లనియె "నేను భూసురుఁడను నీ
గిరిఁ దిరుగుచు హృతధేనువు
కొఱకై మూన్నాళ్ళనుండి కూడొదవమినిన్. ౧౫

క. ఈ కూపతీరజాత మ
నోకహ మెక్కి తినిఁ బండ్లను భుజింపఁగ న
ట్టాఁకట మాడుచు; దుర్విధి
యీ కరణినిఁ ద్రోసె నన్ను నీ గర్తమునన్. ౧౬

గీ. విఱుగఁ దరుశాఖ, పడి క్రింద శిరసు చిదుకఁ
జీలి కత్తులబోన్పోని రాలరాసి
యోడఁగా నెత్రు వఱదలై యొడలినుండి
యవశగతి ద్రొర్లిపడితి గర్తాంతరమున. ౧౭

క. ఏదేవుఁ డంపెనో నిను ?
నే దేవుఁడవో ? యిఁకేల ? యీ దుర్గతునిన్
జేఁదుదువో యొడ్డునకుం ?
గాదందువొ ? యగతికులకు గతి దైవమెకా ! ౧౮

క. ఏ పాపఫలమొ ? యీ మల
కూపంబునఁ గూలఁబడితి; ఘోరమయిన యిం
కే పాప మనుభవింపఁగ
నీ పగిదిని బ్రదికినానొ ? యెఱుఁగఁగనైతిన్. ౧౯

క. సిరి పోయి చీడ వట్టిన
కరణిని హృతమయ్యెగోవు; గలిగెను నాకీ
దురవస్థ; యనర్థంబులు
పరంపరగ వచ్చుఁగద ! విపత్కాలమునన్." ౨౦

క. అనుచును వాపోవు మను
ష్యుని దీనావస్థఁ గాంచి యుఱికెను గర్తం
బున కతని నెత్తఁగాఁ గపి;
ఘనుఁ డార్తత్రాత; లెక్కఁగా గొనఁ డొడలిన్. ౨౧

క. దుమికియు వానిని స్వస్కం
ధముపైఁ గూర్చుండఁబెట్టి తగ నెగిరి యమాం
తముగాఁ దెచ్చె వెలి; కసా
ధ్యము గలదే హనుమదన్వయప్రభవులకున్ ? ౨౨

క. ఆతనినిఁ దెచ్చి యొక చ
ట్రాతిపయిం బండఁబెట్టి ప్రాశింప ఫల
వ్రాత మిడి మానిచెను క్షత
గాత్రంబు వనౌషధిప్రకాండము వలనన్. ౨౩

క. దూరాపాతజమైన శ
రీరవ్యథ యుపశమిల్లఁ బ్రిదులంగా క్షు
ద్భారము కరాపసృతమగు
తీరున నతఁ డొంది యొడలు దెలియని నిద్రన్. ౨౪

క. తెలివొంది రెప్ప కంటిని
వలెఁ దన్నుం గాచుచున్న పార్శ్వస్థునిఁ గ్రోఁ
తులజేనిఁ గాంచి "సఖుడా!
అలసితి ననుమోసి నిద్ర నందుము!" యనియెన్. ౨౫

గీ. బడలియుంట నొడలు వానరనాథుండుఁ
గొలఁదితడవుఁ దానుఁ గూర్కఁదలఁచి
యావులించుకొనుచు నాకేకరాక్షుఁడై
కనులు మూసి నిద్రఁ గొనియెఁ బజ్జ. ౨౬

మ. నిదురం జెందిన యా ప్లవంగముని సాన్నిధ్యంబునం గూరుచుం
డ దురూహంబు జనించె బ్రాహ్మణుని డెందంబందు "నీ క్రోఁతి క్రొ
వ్వి దృఢాంగంబయియుండె; దీనియొడలిన్ భేదించి మూన్నాళ్ళయం
గద దీఱంగ భుజించి మాంసమును నేగం జెల్లు" నం చిస్సిరో! ౨౭

క. అకృతజ్ఞము గద లోకం;
బొకఁ దన్నుం బిడ్డ దాత కౌగి నిడు సున్నం;
బొకరుఁడు నది దాఁటిన తె
ప్పకు నిప్పంటించి పోవుఁ బాపాత్ముఁడై. ౨౮

ఆ. వె. బ్రాహ్మణాపసదుఁడు భావించి పైగతి
దానిమేలు మఱచి దయను విడిచి
వంశకీర్తిఁ జెఱచి పాపకవాటంబుఁ
దెఱచె నచట దాని యెఱచికొఱకు. ౨౯

క. పెనురాతిబండ నొకదా
నినిఁ గైకొని వాఁడు క్రోఁతి నెత్తిని విసరెన్
గనికరమును గొని దూరం
బునఁ బడి యది దానిప్రాణములఁ గాపాడెన్. ౩౦

గీ. ఆ శిలాఘాతజాత మహారవమునఁ
గ్రోఁతి మేల్కాంచెఁ; జచ్చె విప్రుండు సగము
తా నొకండు దలంపంగ దైవ మొకటి
తలఁచు ననియును దుష్టుండు దలఁపఁ డకట! ౩౧

గీ. అడుగకయుఁ గ్రోఁతి యా బ్రాహ్మణాపసదుని
యాస్యమున వ్రేలుచున్న పాపాక్షరములఁ
జదువుకొని, రాయి నొడువు సాక్ష్యంబు వినియుఁ,
దెలిసికొనెఁ దత్కృతఘ్నత కలఁతపడక. ౩౨

క. చచ్చినవానిం జంపుట
మెచ్చిన పని గాదటంచు మెదలక కపి వా
విచ్చక చూచుచు నిలిచెను;
ఎచ్చటి చూపో! దహించె నీ బ్రాహ్మణునిన్. ౩౩

గీ. సాధువుల చల్లచూపె యసాధువులను
నిట్టనిలువునఁ గాల్చును నీ తొనర్ప
కవనిని "మృదు స్సుతీక్ష్ణ" యటన్నసూక్తి
యర్థమయ్యె నటంచు బ్రాహ్మణుఁడు వగచె. ౩౪

శా. అంతం బల్కెను వానరుం డిటులు విప్రా! పొందఁగాఁ బోకుమీ!
స్వాంతంబందు భయంబు నా వలన; నీ శైలంబునం దున్న యీ
జంతువ్రాతము విన్న నీ చెనఁటిచేష్టన్ సైఁప; దిక్కాన దా
టింతున్ రమ్మని యావనాంతమున విడ్చెం దెచ్చి వానిం దయన్. ౩౫

గీ. పుచ్చె నొడ నెల్ల; నా పాదమూర్ధముగను
ముసరె నీఁగలు; క్రుళ్ళెను బురుగులు వడెఁ;
బఱవఁదొడఁగెను జీమునెత్తురులు సతత
మచిరకాలంబుననె బ్రాహ్మణాధమునకు. ౩౬

క. ఇలు వెడలించిరి బిడ్డలు;
తొలఁగిరి చుట్టములు; స్నేహితులు పెడమోమై
తలఁగిరి; దేశబహిష్కృతి
గలిగెఁ గృతఘ్నతఫలంబుగాఁ గుష్ఠగుటన్. ౩౭

క. చూడంగాఁ జుట్టంబును
వేఁడంగా వేలుపేని వెలయకయు రుజా
బీడితుఁడై తను రోయుచుఁ
గాడుపడు చతండు పోయెఁ గారడవిఁబడిన్. ౩౮

క. ఇడవయ్యెఁ దరులు ఫలముల;
నిడవయ్యెను నీఱు లేఱు; లిరవైనను దా
మిడవయ్యె గుహలు వానికిఁ;
జెడుగునకు సహాయపడ దచేతనతతియున్. ౩౯

క. తుదికి మహాప్రస్థానము
మది సలుపఁగ నిశ్చయించి మఱలక చనుచున్
ఎదురైన యెరగలిం బడె
"నిదె! ప్రాయశ్చిత్త" మనుచు నీ దొసఁగునకున్. ౪౦

★

# జాతక కథా గుచ్ఛము

## ద్వితీయ భాగము

## శ్రేష్ఠి జాతకము

క. జనియించె బోధిసత్త్వం
డనవద్యుఁడు క్షితిఁ దృతీయమగు వంశమునన్
ధనకనకవస్తువాహన
సనాథమై నాటఁగొలెఁ బ్రశస్తి నది కొనెన్. ౧

క. సిరియు సరస్వతియుఁ బర
స్పరప్రతిస్పర్థఁ బూని సతతముఁ దత్సం
దర్శిలోచనవదనంబుల
గురుబలమున నాక్రమించికొనియుండి రొగిన్. ౨

క. జనరత్నం బగు నాతని
వనితారత్నంబు చెట్టవట్టెను; "రత్నం
బును గూడును రత్నం" బను
జనవాక్యము రిత్తవోక సార్థతఁ గాంచెన్. ౩

క. నిరతంబును "ధర్మస్య
త్వరితాగతి" యన్న లోకవాచోయుక్తిన్
స్మరియుంచుచు నా వైశ్యుఁడు
జరియించుచు నుండుఁ బుణ్యసంగ్రహపరుఁడై. ౪

క. మహి వెలుఁగు దివాకరుఁ డాతఁడు
సహస్రకరుఁ డగుచు దానసమయములందున్
బహుధా ద్వినేత్రుఁడయ్యును
సహస్రనేత్రుఁ డగు నర్థిసంతతిఁ గాంచన్. ౫

క. ఇలఁ దార్తీయాకం బగు
కులమున జన్మించియున్న, గౌనములచేతన్
జెలువొందె నాతఁడగ్రిమ
కులమున కగ్రిముఁ డటంచుఁ గొని పెనుకీర్తిన్.

క. కులధనము వదాన్యత్వము,
కులవ్రతము సత్యసూక్తి, కులదేవతని
ర్మల మగు ధర్మము, మన యీ
కులీనవైశ్యునకు నతని కులయువతికినిన్.

క. ధర్మార్జితస్వవిత్తము
ధర్మారాధనముకొఱకె తా నర్పించున్
ధర్మజ్ఞుం డగు నాతఁడు
నిర్మోహముఁ గొనక విషయనివహమునందున్.

గీ. వినుట "నభ్యాగత స్స్వయం విష్ణు" వనియు
"నతిథిదేవోభవ" యటన్న యార్షసూక్తి
నతఁడు చేరికిఁ గొనక ప్రాణాత్యయంబు
నహరహంబును గావించు నతిథిపూజ.

క. అడిగిన మేరకు దానం
బిడుచున్నను యాచకాళి కీతని కోశం
బిడుచుండె నక్షయంబుగ
విడిముడి! వర్షించునో? కుబేరుఁడు కూర్మిన్.

గీ. అతఁ డొకదినంబునను దేవతార్చనంబు
దీపధూప నైవేద్యముల్ దీఱిచికొని
యన్నపరిషేచనంబు నేయందలంచి
యాఁగె నొకత్రుటి వత్తురో! యతిథు లనుచు.

క. అదనున "భవతీ భిక్షాం
దదా"తనెడు నుడిని శ్రేష్ఠితనయుఁడు విని త
త్సుదతీమణికి వచించెను
"దదీప్సిత మొనర్పు" మనుచు దయ దళుకొత్తన్. ౧౨

క. శిరసావహించుకొని యా
తరుణీమణి భవునియాజ్ఞఁ, ద్వరగా నరిగెన్
బరిపూర్ణ భక్ష్యభోజ్యం
బరివాణంబును గ్రహించి యతిథి కొసంగన్. ౧౩

గీ. కడచి కక్ష్యాంతరంబు లా పడఁతిమిన్న
నడచుచుండంగ నట్టింటినడిమి నిలిచె
నిడుదకోఱలు, మిడిగ్రుడ్లు, వెడఁదనోరు
కారుమేనును బెన్గదం గల యొకండు. ౧౪

గీ. దయ్యమొ ? పిశాచకంబొ ? ప్రేతంబొ ? యనుచు
దరుణి భయమొంది వెనుకకుఁ దిరిగివచ్చె;
నతిథిపూజకుఁ గలిగిన యంతరాయ
మునకుఁ బొగులుచుఁ దన డెందమునఁ గడింది. ౧౫

క. ఒనరింప కతిథిపూజను
జనుదెంచిన సతినిఁ, దద్వచస్సంభ్రమమున్,
విని యచ్చెరువడి యాచెలి
మనోభయం బుడిపి శ్రేష్ఠిమణి మదిఁదలఁచెన్. ౧౬

క. "భూతప్రేతపిశాచ
వ్రాతము నాయిల్లు చొచ్చి వర్తించుట కే
హేతువు ? మదీయ మగు పా
పాతిశయము నేఁడు బద్ధ లయ్యెనొ యిట్టుల్ ?" ౧౭

క. అని వగచి భక్ష్యపూర్ణం
బును బాత్రం బతిథికొసఁగఁ బోయెను దానై;
కనఁబడె నా నడిచావడి
మునుపటి భూతంబు ఘోరమూర్తి భయదమై.

క. మరియుం గనఁబడె నయ్యెడ
దురధిగమము నరక మొకటి; దోఁచిరచటఁ గిం
కరు లాయుధపాణులు ము
ష్కరు లగు జీవులను బాధ సలుపు చనేకుల్.

క. కలయో? నిజమో? మాయా
విలాసమో? తాను దానొ? పెఱయో? యెదియుం
దెలియక, పాపము! వైశ్యుఁడు
కళవళపాటును వహించి కడు నట నిలిచెన్.

ఆ. వె. అక్కజంబు వడుచు నా శ్రేష్ఠి కనుచుండ
నా సుదీర్ఘదంష్ట్రిఁ డా విరూపుఁ
డా కరాళమూర్తి యట్టహాస మొనర్చి
వాని డగ్గఱించి పలికె నిట్లు.

క. "ఎఱుఁగుదువా? లేదా? చూడుము
నరకం బీ దృశ్య; మేను నరకాధిపతిన్
గఱచుచుఁ బొగడ్త లాత్మం
భరు లగు నర్థులను దానపరు లందు రిటన్.

క. కనుమీ! పూర్వార్జిత మగు
ధనంబు వ్యయపఱచి త్వద్విధంబున నరకం
బున గ్రమ్మ వదాన్యులను; మ
హిని 'అతి సర్వత్ర వర్జయే' త్తని వినవే?

క. మును వెనుకలఁ గనకయుఁ దల
మునకలుగా నున్న ద్రవ్యమును జలమువలెన్
దినమిటు వెచ్చించుట నీ
యనంతరీయులను బెద్ద యలఁచుట గాదే ! ౨౪

గీ. తన్ను మాలిన ధర్మంబు దగదుసుమ్ము
మొదలు చెడునట్టి బేరంబు పొదలునోయి ?
కట్టః! త్వదనంతరీయులఁ గడుపుమాడ్చి
యే మహాపుణ్య మార్జింతు విట్టికృతుల ? ౨౫

గీ. కాన నీవెట్టిదానంబుఁ గట్టిపెట్టి
మరలి పోపొమ్ము ! వచ్చిన మార్గముఁబడి
ఆప్తవాక్యంబు గైకోమి ననుభవింతు
వా ఫలం" బని బెదరించె నా యముండు. ౨౬

గీ. ఆ యధర్మోపదేశంబు నాలకించి
శ్రేష్ఠిపుత్రుండు వొంది యచ్చెరువుఁ బలికె
"విశ్వమున ధర్మరాజన్న పేరిఁగొనియు
నేతిబీరను జేసికొంటివె ? మహాత్మ ! ౨౭

క. నరకంబు దానఫల మని
యెఱిఁగించితి వీ వొకండ విట్లంటివి; మా
గురుదేవుఁ డెఱింగించిన
తెఱఁగున వర్తింతు; మంచిది యదే నాకున్. ౨౮

క. సుమతులు బుధు'లర్థో మూ
ల మనర్థానా'మటం ద్రిలాతలమున దా
నము వెలి యగు ద్రవ్యము భో
గ్యము గాదుగదా ! యగంధ మగు సుమమువలెన్. ౨౯

క. అతిథులె నాకుం బరదే
వత; లతిథిసపర్య నాకుఁ బ్రాణముకన్నన్
సతతముఁ బ్రియతర మగు; దు
ష్కృతమైనను దానినిం ద్యజింప మహాత్మా ! ౩౦

క. మును దానంబు లొనర్చిన
ఘను లొందిన ఘోరనారకమె వచ్చుత నా
కును; గాలవిళంబము సైఁ
పను నాతిథ్యమున" కనుచు వైశ్యుఁడు వడిగన్. ౩౧

క. పిఱుదివియక చొరఁబడి యా
నరకంబున యుద్ధమల్లు నాయంబునఁ జె
చ్చెరఁ జనుచుండంగాఁ ద
న్నరకముఁ గింకరు లదృశ్యతంగనె యముఁడున్. ౩౨

క. చని శ్రేష్ఠి యతిథి కర్పిం
చిన నా మధురాన్నపాత్రఁ జేకొని యతఁ డా
త్మను మోదపడుచుఁ బలు దీ
వన లర్పించుచును వైశ్యవరునకుఁ జనియెన్. ౩౩



# జాతక కథా గుచ్ఛము

ద్వితీయ భాగము

## రురుజాతకము

సీ. కనికరంబునఁ గాచుఁ గడుపున నిడుకొని
శరణుఁ జొచ్చిన క్షుద్రజంతువులను
ద్యాగం బొనర్చును దన జీవనంబెల్లఁ
బాదాశ్రయముగొన్న ప్రాణులకును
దన కౌఁగిటికిఁ దార్చి తనుపుచుండును దన్నుఁ
గాల్పంగ వచ్చిన కారుచిచ్చు
నర్పించి సంజీవనౌషధులను మన్ను
నఖిలకాలం బామయాతురులను
గీ. విడుదు లర్పించును మహర్షి బృందమునకు
గగనచరులైన వేలుపుగమిని గనుచు
సతముఁ బైకెత్తి శృంగహస్తముల మ్రొక్కు
నొక్క శైలంబు పుణ్య సముజ్జ్వలంబు. ౧

క. ఆ గిరిని నానుకొన్న మ
హాగహనమునందుఁ దన్మృగావళి పుణ్య
శ్రీగురుఫల మన రురువై
యోగీంద్రుఁడు బోధిసత్త్వుఁ డుదితుం డయ్యెన్. ౨

ఆ. వె. పంచవన్నె చిలుక వలె, రంగురంగుల
పూలరాసి చందమునను, మరియు
మాయితాప్రహీణ మారీచు విధమునఁ
బరగె రురువు చిత్రవర్ణ మగుచు. ౩

క. ప్రభుశక్తి గలదు తద్వి
గ్విభవంబునఁ గాకయున్నఁ బెద పెద్ద లటన్
ఇభహరిముఖసత్త్వంబులు
స్వభావ ఘాతుకత మాని చరియించునొకో! ౪

క. కనుఁగవ, మొగమున, నెమ్మెయి
ననన్య సాధారణము మహాతిశయముఁ గ
న్గొని యన్య వన్యమృగములు
వినీతతను రురువు గురువు పేర్మినిఁ గొలుచున్. ౫

గీ. ప్రాయమునఁ బిన్న ధైర్యదర్పములఁ జిన్న
యయ్యు మిన్నయ్యె రురువు మృగావళికిని;
జగతి దివ్యాంశకలితపాషాణకంబు
రాజరాజులకును సమర్చ్యంబుగాదె? ౬

క. జననాంతరీయ వాసన
లనువృత్తము లగుట నిజము ప్రాణికిఁ; గాకుం
డిన నీ రురు వెక్కురణిని
ననుత్తమార్షేయచరిత కాస్పద మయ్యెన్. ౭

క. ఎర కాశించుచు మృగయుల
యురులందుం జొఱక విడువ కున్నయిరవునన్
దఱికిం దొరకిన కొలఁదియు
గఱికపరక లొగిని మేసి కాలముఁ గడపున్. ౮

క. ఆ రురు వొకనాఁడు నదీ
తీరంబునకుం బిపాసఁ దీర్పఁగ బోఁగా
దూరమున నీరి నడుమం
బూరుషుఁ డొకఁడగపడియె ముమూర్షావస్థన్. ౯

చ. మునుఁగుచుఁ దేలుచున్ మరలమున్గుచుఁ దేలుచు నీటి వెల్లువన్
బెనుసుడులన్ భ్రమించుచు శ్రమించుచుఁ గన్నులఁ దేలవైచుచున్
“మనుపుఁడు న”న్నటంచును నమస్సులవేఁడుచుఁ దీరవర్తులన్
మన రురువున్నచోటికిఁ గ్రమంబున వాఁ డరుదెంచె నేటిలోన్. ౧౦

చ. పిలువఁగ నోరురాక పెదవిం గదలించుచు, నశ్రుపూర్ణ దృ
క్కులఁ బ్రసరించుచుం దెసలకుం, గొనయూపిరితోడఁ దన్నదీ
జలములఁ బోవువానిఁ గని సత్వర మా హారిణంబు దూఁకె; దు
ర్బలులయినన్ సహాయపడవత్తురి విపన్నులకున్ దయాళువుల్. ౧౧

గీ. దూఁకి రణవీరుఁ డట్టు లీఁదుచును వడిగ
డాసి యవలంబనార్థ మాసాస గొన్న
దీనజనునికిఁ దోఁక నందించి చేతి
కురుతరాయాసమున నీడ్చు చొడ్డుఁజేర్చె. ౧౨

క. ఎక్కడఁ బ్రవాహవేగం ?
బెక్కడ నీ యబలహరిణ మీఁది మనుష్యం
దక్కించుట ? సాహసమునఁ
బెక్కేటికి ? లక్ష్మి తాండవించునుగాదే ? ౧౩

క. పరమేశ్వరుండె రూపాం
తరమునఁ దన సుకృతలవమునన్ సాయపడున్
ధర నరున; “కనాథో దే
వరక్షిత” యటన్న విబుధవాక్యము సరిరాన్. ౧౪

క. ఆ రురు వీ గతి వానినిఁ
దీరమునకుఁజేర్చి మోసి తెచ్చి స్వకీయా
గారస్థగృహమునకు, శ్రమఁ
దీఱిచి ఫలమూలసంతతినిఁ దిన నొసఁగెన్. ౧౫

క. నాన్నాళు లుంచుకొని తన
సన్నిధి, నాతనికిఁ గూర్చి స్వస్థతఁ బసిచెన్
"గన్నది విన్నది గాదీ
తె"న్నని యాతండు విస్మితిం గొని యనియెన్. ౧౭



ఆ. వె. "నరుఁ డొనర్ప రాని పరమోపకారం బొ
నర్చు నీకు నేమొనర్తుఁ బ్రతిగ
నీ ఋణంబుఁ దీర్ప నేర్తునే? చచ్చి నీ
కడుపునందుఁ బుట్టుకలను గనియు.

ఉ. వెల్లువయందుఁ గొట్టుకొని వెళ్ళెడి నన్ననుఁగొంచు నొడ్డులం
బల్లిదులౌ ద్రుమంబుల విఘాతిని నిల్చిరి కాని కావఁగా
నీళ్ళఁ జొఱం డొకండు; నవనిం బ్రతివానికిఁ దీఁపి ప్రాణముల్
బెల్లముకన్న; నీవొకఁడవే! విపరీతతఁ దోఁచి తీగతిన్. ౧౮

క. కాయ మొనర్చితివి తృణ
ప్రాయంబుగ మనుప నను స్రవంతికినిఁ; దృణ
ప్రాయత ననుఁ దలఁచిరి తమ
కైయన్యులు; దగదె? నిను మహాత్మ వనంగన్." ౧౯

క. అతఁ డిట్టులు శ్లాఘింపఁగ
స్తుతులకుఁ దన శిరసు వ్రాల్చి తోడ్తో రురు వీ
గతిఁబల్కె "నీదు సుకృతమె
బ్రతికించెను; నాదు సాయపాటెంత సఖా! ౨౦

క. నిను వేఁడుదు నే నొక్కటి
యనుగ్రహింపుము! మదీయమగు నావాసం
బునుగూర్చి నన్నుఁగూర్చియు
జనులకుఁ దెలుపకుము మిగుల సంతోసింతున్. ౨౧

క. అనుకొనకు కృతజ్ఞతగా
ననుఁగూర్చి ప్రశంస సేఁత నలువురికడ; నా
మనవినిఁ జెల్లించుటయే
యనుకొమ్ము కృతజ్ఞతగఁ ద్వదాత్మమునందున్. ౨౨

క. తమజోలికి రాకున్నను
మముబోంట్లకు నెసరువెట్టి మార్గింతు రర
ణ్యములందుఁ గిరాతులు; పు
ణ్యముఁ బాపములేదు వారి కాత్మలయందున్. ౨౩

క. జనలోభనీయ మగు నా
తనువున కాశించి పట్టఁదలఁతురు ఱేఁడుల్;
మనియుండి కష్టజీవుల
కును సేవ నొనర్పఁ గలదు కోరికి నాకున్. ౨౪

క. ఒకవేళఁ జంపకయు నను
నికటంబున నుంచుకొన్న, నిజముగ లోకో
పకృతిన్ ఘటింపఁజాలని
స్వకీయ దేహంబు వ్యర్థతర మని తలఁతున్." ౨౫

క. అతనిని నివ్విధిఁ బలుమఱు
బ్రతిమాలియు రురువు వాని బాసలుగొని స్నే
హితుని గతిన్ వీడ్కొలిపెను
మతిమెచ్చుచు మృగగుణాళి మనుజుం డరిగెన్. ౨౬

క. కలఁగనె నాదేశప్రభు
లలనామణి చిత్రవర్ణలలితంబై క
న్నులవిందుగొలుపు మృగమును
దెలవాఱెడి తటిని నిది గతించిన పిదపన్. ౨౭

క. సుదతియు "నభూతపూర్వం
బదృష్ట పూర్వంబు మరియు నశ్రుత పూర్వం
బిది"యని మేల్కొని యెడఁదం
దదాశగొని పతిని డాసి తగ నిట్లనియెన్. ౨౮

క. "కలఁగంటి నాథ ! తైలముఁ
గలిపినయలవోలెఁ జిత్రకాంత్యుజ్జ్వలమై
లలితమగుమృగము; దానికిఁ
ద్రిలోక సామ్రాజ్యలక్ష్మి దిగదుడుపు సుమీ ! ౨౯

క. మన లీలోద్యానంబున
మన యంతఃపురమునందు మనతో విహరిం
చును; నా కల నిక్కల యని
మునుపెఱుఁగవె ? తెమ్ము; దానిఁ బొ"మ్మని కోరెన్. ౩౦

క. "ఏతాదృశ హరిణము మును
సీతకుఁ దేఁజాలఁడయ్యె శ్రీరాముఁ; డిగో !
నా తరుణి కిత్తు స్వర్గముఁ
బాతాళము వెదకి" యనుచుఁ బతి శపథించెన్. ౩౧

క. స్వయముగఁ గాంతాప్రీణన
కయి కానుకలిచ్చుచుం ద్రహర్నిశముఁ బతుల్;
ప్రియురాలి కోర్కెఁ దీర్పఁగఁ
బ్రయతింపరె ? యదియు జన్మఫల మనుకొనరే ? ౩౨

చ. పిలువఁగ నంపి యంతఁబృథివీపతి పల్వుర వేఁటకాండ్ర నా
కలఁగనుఁగొన్న వన్నెల మెకంబును గూఱిచి తెల్పి "మీరు కా
నల, గిరికందరంబులఁ, దృణస్థలులం, బొదలన్, నదీతటం
బుల వెదకుండు పోయి మృగముంగొనితెండిట కక్షతంబుగాన్." ౩౩

క. అని పలుక, వారు నలు దెస
లను బరిశీలించి మృగము లక్షింపక తే
నిని డాసి తెలిపి రీ గతి
"నన్నృతముగా కెట్లు స్వప్న మగును ఋతముగాన్." ౩౪

క. అంతటఁ బోసీయక భూ
కాంతుం "డా మృగముఁ జూపఁగలవానికి న
ర్పింతును మదర్ధ రాజ్యము
సంతసముగ" ననుచుఁ బుడమిఁ జాటింపించెన్. ౩౫

క. క్షితి మండలి తద్ఘోషణ
ప్రతిధ్వనించుచును వాడవాడల యందున్
మితిఁగడచియు వ్యాపించెను
బ్రతివానికి నాశపుట్ట రాజ్యము వడయన్. ౩౬

చ. తొలుతట లేడిచే నుపకృతుం డగు మానిసి యీ సువార్త చె
వ్వులఁబడ హర్ష మొందియును పూర్వము దానికిఁ దా నొనర్చు బా
సలను దలంచి పొందు మది సంకటపాటు; వహించు మోమునన్
వెలవెలపాటుఁ; గాంచుఁ గరణీయము దోఁపక త్రొట్రుపాటునున్. ౩౭

క. వెఱచుచుఁ గళవళపడు చి
క్కరణిని నాతండు కొలఁదికాల, మనుకొనెన్
"సరి రా మోకా లొడ్డుట
తెఱఁగే? యిఁక ముందు బ్రదుకు తెరు వొకఁ డున్నె? ౩౮

క. ధనమూలము గద లోకము;
ధనశూన్యుఁడు తృణసముండు; ధనమున సిద్ధిం
చును సర్వకార్యములు; ని
ర్ధనుండు జీవచ్ఛవంబ ప్రాణులయందున్. ౩౯

క. నరకము స్వర్గము నెవ్వరు
పరికించిరి ? దురిత సుకృతఫలము లటంచుం
గఱపెడి కుమతుల నేటికి
నరకుఁగొనఁగఁ? ద్రోసిరాజు నలుపవలవదే ! ౪౦

క. చినుకులకుఁ జెఱువు నిండునె ?
యనయము ధర్మానుబద్ధ మగు నల్పార్థం
బున నరుని కడుపు నిండునె ?
జనుండు సుఖపడ నధర్మచరితంబె తగున్. ౪౧

క. కలుష మొక వేళఁ గలిగిన
నలయిష్టాపూర్తముల సమాచరణమునం
దొలఁగింపవచ్చుఁ 'గర్మం
బులు పాయవె కాంచనమున' భువి జనములకున్ ?" ౪౨

క. అని యెంచి మున్ను లేడికిఁ
దనచేసిన ప్రతిన లెక్కఁ దలఁపక చనియెన్
జనపతికి జాడఁ దెలుపఁగ
ధనలుబ్ధులు లుబ్ధకులకుఁ దాతలు గారే ? ౪౩

క. చని ఱేనిం గనుఁగొని యా
తనిచేతఁ దదర్థరాజ్యదానంపుఁ బ్రతి
జ్ఞను దృఢపఱిపించుక వా
నినిఁ గొని యా హరిణ మున్న నెలవున కరిగెన్. ౪౪

ఉ. పండెను బాటఁ గొండచిలువల్; పులి మొత్తము బొబ్బరించె; వే
దండము లాచరించె భయదం బగు బృంహితముల్; వరాహపుం
బిండులు ఘుర్ఘురించె నడవిం బడి వారలు పోవుచుండఁ బో
కుండ నిరోధముం జలుపు నోజను దద్రురు రక్షణార్థమై. ౪౫

ఉ. కంటకముల్ పదంబులకుఁ గాఁడుచునుండెను; దాఁకి గట్టిగా
మంటలు గొల్పె జాలగమి; మార్గము డాఁగెను గానరాక ము
క్కంటికిఁ; గారుచిచ్చెదురుగాఁ బఱతెంచెను బోవుచున్న చె
న్నంటులకున్ నిరోధము నొనర్చి సహాయ మొనర్ప లేఁడికిన్. ౪౬

క. వంకలు డొంకలు దాఁటుచు
సంకటపడు చివ్విధమునఁ జనఁ జన రురుపా
దాంకపరిభ్రాజితమై
శంకాతంకములు లేని స్థాన మగపడెన్. ౪౭

క. అచ్చటి కలంతి దవ్వునఁ
బచ్చిక పట్టునను గసవు పరకలు దినుచున్
విచ్చలవిడిఁ దిరుగుచుఁ గ
న్ముచ్చటగా మృగమొకటి కనుంగొన నయ్యెన్. ౪౮

ఉ. అంతట నా కృతఘ్నుఁడు నృపాగ్రణి కిట్లను "జూడవయ్య! భూ
కాంత! విచిత్రవర్ణ మగు కాయము గల్గి సురేంద్రు వింటితోఁ
బంతము లాడు చున్నటులు భాసిలుచున్న కురంగకంబు; నీ
కాంతకు మొన్న స్వప్నమునఁ గన్పడి నట్టిది! యిట్టిదే కదా!" ౪౯

క. అనుచుం జేయెత్తియుఁ ద
ర్జనిచేఁ జూపించుచున్న సమయముననె యా
తని బాహువు ఛిన్నంబయి
జనపతి యచ్చెరువడంగ జాఱెను నేలన్. ౫౦

క. కా దింద్రజాల మయ్యది;
కాదయ్యది మంత్రశక్తి; కానంబడుఁబో!
మేదిని నత్యుత్కట దురి
తాదుల కుచిత మయిన ఫల మా నిముసమునన్. ౫౧

క. పిమ్మట నెకిమీఁ డా హరి
ణమ్మును బట్టంగఁ దలఁచి నలుదెసలకు సై
న్యమ్మనిపి ముట్టడింప మృ
గమ్మా కోలాహలమ్ముఁ గని వెఱచి మదిన్. ౫౨

క. నలుఁగడలను నిప్పంటిన
యిలువలె, నల్దిక్కుఁ బొంగు నేశుల నడుమం
గల దీవివోలె నా మృగ
మలజడివడియెం బ్రతిక్రియాశూన్యంబై. ౫౩

వ. "నాకుం గాలము దాఁపురించినది యీనాఁ డెందులన్ డాఁగినన్
నా కీ మృత్యువు దప్పునే ? కనుకఁ జింతల్ వంతలున్ మాని ని
ర్భీకత్వంబున డాసి ధర్మపథమున్ విన్పింతు" నంచెంచి యా
క్ష్మాకాంతుం బఱతెంచి డగ్గఱి కురంగం బి ట్లనెం బిమ్మటన్. ౫౪

క. "మన్నిఁ గొని నన్ను నీవే
పున్నెంబార్జింపఁ జిత్తమునఁ దలచితివో ?
నన్నెవ్వ రెఱింగించిరో ?
అన్నా ! తెలుపవె ?" యటంచు ననె దీనముగన్. ౫౫

క. వెఱగుపడి రురుముఖంబున
నరవాక్యము విని, శరాసనము డించి ధరా
వరుఁ డా ప్రక్కన నిలిచిన
నరుఁజూపు "చితండె నిన్ను నా కెఱిఁగించెన్." ౫౬

క. అని మరియేమో పలుకఁగ
జనపతి పూనంగ సరభసంబున మృగమా
మనుజాధమునిఁ, గృతఘ్నునిఁ
గనుఁగొని నిట్టూర్చి "మిత్రఘాతీ !" యనియెన్. ౫౭

క. విని కళవళించెఁ బురుషుఁడు;
జననాథుఁడు తెల్లఁబోయి సరిదికొనియుఁ "గా
రణమేమి యిట్టు లంటకు ?"
నని యడుగఁగ నొడివె హరిణ మాద్యంతకథన్. ౫౮

క. "ఏతాదృశ మగు మృగమును
భూతలమునఁ గనము! వినము! ముని యెవ్వఁడో? యీ
రీతిని జనించె" ననుకొని
చేతులఁబతి మొగిచె; మరి వచించె నరునికిన్. ౫౯

క. "ఓరీ! మిత్రద్రోహీ!
ఓరీ! విశ్వాసఘాతి! ఓరి కృతఘ్నా!
ఓరీ! పాతకి! యింతటి
క్రూరుండవె! నిన్ను మన్నిఁగొన నఘ మున్నే?" ౬౦

చ. అని చుఱకత్తినిం బెఱికి యాతనిపై దుమకంగబోవఁ జ
య్యన హరిణంబు భూపతికి నడ్డము వచ్చి వచించె నిట్లు "లో
జనవర! యీతఁ డిప్పటికె చచ్చె సగంబు; తెగెం గరంబు; వీ
నిని నిఁకఁ జంప నేల? దయనీయుఁడు గాఁడె యమాదృశుం డిలన్? ౬౧

క. ధనలోభంబునఁ గాఁబో
లును వీఁ డొనరింపఁగాఁ గలుషకార్యముఁ బూ
నెను; లోభంబునఁ గొమరుఁడు
జనకుని వధియించుచుంట జగతిం గనమే? ౬౨

క. బలవత్తరంబు లోభము
బలిఁగొనుఁబో! యెంత యెంత పండితులను; ని
య్యిల నేటికి నెదురీఁదెడి
బలియుఁడు గోటికి నొకండు పరగునో? లేఁడో? ౬౩

క. పీఁ దేలోభంబున నా
జాడను నీకెఱుకపఱప సాహసపడె వా
యోడక చెల్లింపుము నీ
యాడిన బాసఁ బిఱువీఁకు టతిపాప మగున్. ౬౪

క. అతఁ డది విని తల నఱకిన
వితమున, శరధారచేత విదళించిన ప
ద్ధతి, నొందె మర్మవేధను;
క్షితిఁ గిఱుకు మేలు సేఁత శిక్ష యగుఁగదా! ౬౫

క. హరిణోపదేశమున భూ
వరుండు రాజ్యార్ధ మొసఁగ వాఁ డర్పించెన్
హరిణమునకు; దానిం గని
నరపతియు స్వరాజ్య మర్పణముఁ గావింపన్. ౬౬

క. "నాకేటికి రాజ్యం బవ
లోకించితిరే? మృగంబు లోకంబున ము
న్నేకడను రాజ్య మేలెనె?
కైకొని మీరాజ్యముల సుఖంబుగ మనుఁడీ!" ౬౭

క. అని హరిణము రాజ్యంబులఁ
బునరర్పణ సేయ, స్వార్ధమును తేనికి న
ర్పణమును గావించుచుఁ ద
జ్జనుండు మునివృత్తి నుండ సంకల్పించెన్. ౬౮

క. క్షితిపతి కోరెను "నీకుం
బ్రతినిధివై యేలువాఁడ రాజ్యము; నీవే
గతి నాకు; దేశికుఁడవై
హితోపదేశములు సేయుమీ!" యని బత్తిన్. ౬౯

క. అమ్మాట సమ్మతించు మృ
గమ్మును గూర్చుండఁబెట్టి కనకరథముపై
నమ్మానవపతి గొని రా
జ్యమ్మున సింహాసనమ్ము నందునిచెఁ దగన్. ౨౦

క. కొలువుం దీర్చిరి పలు పె
ద్దలుఁ బిన్నలుఁ బ్రకృతులుం బ్రధానులు సామం
తులు మిత్రులు మొదలగు వా
రలు మృగబోధశ్రవణపరం బగు నెడఁదన్. ౨౧

గీ. అంత బోధింపఁ గడఁగె నిట్లా మృగంబు
దివ్యతేజంబు మోమునఁ దేజరిల్ల
"మొదటి పాఠంబు మీకుఁ జెప్పెదను వినుఁడు
"ఆత్మవత్సర్వభూతాని" యన్న సూక్తి. ౨౨

క. అకటా ! వినోదమని వేఁ
టకుఁ జని ప్రజ సత్త్వ సంకటము సేయును; బి
ల్లికి నెది చర్లాటమొ ! యెలు
కకు నయ్యది మృత్యు వంచుఁ గన రెద వారల్. ౨౩

క. తన ప్రాణ మెంత తీపో !
జనులారా ! మానవునకు, జంతువులకు నె
ల్లను గూడ నంత తీఁపని
యనుకొనఁడేలా ? వివేక మన్నది యున్నే ? ౨౪

ఆ. వె. ఈఁగలేనిఁ, జీమలేని, దోమలునేని
మానవుండు పట్టఁబూనినంత
ఆత్మరక్షణార్థమై కడంగును లెస్స;
బ్రదుక జీవి యెంత పరితపించు ?" ౨౫

చ. అనుచు హితోపదేశము మృగాగ్రణి యీయఁగ భూమిపాలకా
గ్రణి విని నాఁటఁగోలెఁ దన రాజ్యమునం గల దిర్యగావళిం
దనయులఁ బోలె, సోదరుల నాయమునన్ గనుఁగొందు నంచు నా
య్యన శపథం బొనర్చి కఠినాజ్ఞ నొసంగెఁ గిరాతజాతికిన్. ౭౬

క. హరిణంబీగతి ధాత్రీ
శ్వరునకు నుపదేశ మిచ్చి స్వస్థలమునకున్
అరిగె; నృపుం డపు డపు డా
రురువుం దరిసించి వినును గ్రొంగ్రొత్తకథల్. ౭౭



# జాతక కథా గుచ్ఛము

## ద్వితీయ భాగము

### శశజాతకము

క. జనియించె బోధిసత్త్వం
డనఘుఁడు శశరూపియై; నిజాంకముగా దా
నినిఁ దాల్చి విధుఁడు కుటిలుఁ, డ
తనిఁ దాలిచి పశుపతియును దాల్చిరి యశమున్. ౧

క. శశధరవంశజులెల్లరు
విశాల ధర్మైకవృత్తి విశ్రుతయశులై
అశరణశరణ్యులై కడుఁ
బ్రశాంత విషయరతులగుచుఁ బరగిరి భువిపై. ౨

గీ. ఆ మహాశయ ముదయించినట్టి యదను
క్షితి మహోదయమంచుఁ బ్రసిద్ధినొందె
నది మహత్తమ పర్వమం చనిరి బుధులు
ఆ పదము నేఁడు భాక్తమై యవనిఁజెల్లు. ౩

గీ. అల్పమయ్యు గుణాళి ననల్పమగుచు
నబల మయ్యు సదాచార సుబలమగుచు
జంతువయ్యు సురశ్లాఘ్య చరిత మగుచు
నా చెవులపోతు భువినిఁ జెన్నాఱుచుండె. ౪

క. ఆ కుందేలు వసించిన
యాకుం బొద పూతమనుచు నద్దాని సుమా
నీకంబుఁగోసి సుర పూ
జాకల్పనమును బొనర్తురు సంతతము మునుల్. ౫

గీ. ఆ చెవులపల్లి వసియించు నడవియందుఁ
దరులమొత్తంబునకుఁ గాపు దఱుగదెపుడు;
నెండ వయ్యేను సెలయేఱు లెండతఱుల;
వసుధ ముక్కారుఁ బండు నా ప్రాంతమందు ౬

క. లతికలు, సుమంబులును, ఫల
తతులును, దొల్లింటికంటెఁ దగెఁ గ్రొంగ్రొత్తై;
పతగప్రతతి విలక్షణ
రుతములఁ గన్పట్టె మధురరుచులఁ గొలుపుచున్. ౭

క. తనుఁ దగ శుశ్రూషించెడు
వనసత్త్వంబులకుఁ గఱపుఁ బ్రత్యహము నహిం
సన, మతిథిసేవ, సద్వ
ర్తన మది ప్రచ్ఛన్నమునివిధంబున ససిగాన్. ౮

క. పులులకు సింగంబుల కే
న్గులకుం బందులకుఁ దోఁచెను శశంబు గడుం
బలవత్తరం బటంచును
బలిగొనునో తమ్మ టంచు భయ మెద నిండెన్. ౯

ఆ. వె. ఒక్కనాఁట శశక మొద్దఁ గూర్చుండిన
ఛాత్రకల్పవన్య జంతువులకుఁ
బెక్కు ధర్మములను వివరించి తెలుపుచుఁ
బలికె ధర్మసార వాక్యమిట్లు. ౧౦

గీ. "బుద్బుదప్రాయ మాయువు పుట్టినట్టి
ప్రాణులకునెల్ల; దయ గాఁనఁబడదు లవముఁ
గాగడాల్వేసి వెదకినం గాలుని మది;
'వడిగలది ధర్మగతి' యన్న నుడిని వినరె? ౧౧

గీ. ధర్మములనెల్లఁ ద్యాగ ముత్తమ మటంద్రు;
త్యాగమునఁ బ్రాణితతి యమృతత్వమొందుఁ;
ద్యాగమున జంతువులు బీదలయ్యు లెస్స;
సానఁ దఱిగిన రతనాలు చాల వెలుఁగు. ౧౨

ఆ. వె. త్యాగహీనమైన ద్రవ్యంబు వర్జ్యంబు
వలపులేని పువ్వుపగిది; నిస్సి
దీఁపిలేని చెఱకుతీరున హేయంబు
విజ్ఞు లెవరు దాని విడువకుంద్రు ? ౧౩

క. న్యాయార్జిత విత్తంబును
జేయుఁడు త్యాగంబుఁ; గాంక్ష సేయుఁ డెడందన్
శ్రేయఃప్రాప్తికిఁ; బాప
ప్రాయాచారంబు భువి నవద్యము సుండీ ! ౧౪

క. వాడని కూపోదకమున
కీడగుఁబో ! లోభిద్రవ్య మిల దూషితమై;
వాడెడి కూపోదకమున
కీడగుఁబో ! దాత ద్రవ్య మిల భూషితమై. ౧౫

ఆ. వె. ఉర్వి లేరొకో ? "పరోపకారార్థ మి
దం శరీర"మన్న ధర్మసూత్ర
మనుసరించి జన్మమును ధన్యపఱచిన
ఘనులు బుధులు ద్రవ్యకథ యదెంత ?" ౧౬

క. అని లెస్స ధర్మబోధం
బొనరించెడి సమయమందె యొకయతిథి మహో
గ్రనిదాఘగ్లానిం గొని
చనుదెంచెను నడచి నడచి సాంద్రపిపాసన్. ౧౭

గీ. ఆతఁ డిట్లని యఱచె "మహాత్ములార!
విప్రుఁడను; వృద్ధ; డప్పికిఁ బీఁకె యెండెఁ;
గడుపు కాలుచునున్న దాఁకటికిఁ గడిఁది;
తడఁబడును గాళ్ళు; సత్తువ యడఁగిపోయె. ౧౮

క. పుడిసెఁడు జలంబులును గ్రు
క్కెఁడు గంజియు దొరక కకట! కృశియింపంగా
నొడలు కికారణ్యంబునఁ
బడి తూలుచు సోలు చిట్లు వచ్చుచు నుంటిన్. ౧౯

క. బ్రతికింపుఁడు! బ్రతికింపుఁడు!
సదయాత్మకులార!" యనుచు శశముండిన యా
పొదముం దతండు కాళులఁ
గదపంగా రామిఁ గూలఁగాఁబడె నకటా! ౨౦

క. రొప్పుచు రోఁజుచు బిట్టుగ
రెప్పలఁ దేలంగవైచి మృతకల్పుండై
'యప్పప్ప!' యని యొగర్చెడి
యప్పాఱుని డాసె నా శశాదిమృగంబుల్. ౨౧

ఆ. వె. అతనిఁ గాంచి పఱచి యనుకంప దెసలకు
నాహరించి జలము లాకుదొప్పఁ,
గందమూలఫలములం దెచ్చి యర్పించె
నోలి వన్యమృగము లొక్క టొకటి. ౨౨

గీ. ప్రాణములు దేఱుకొనిన వాఃపానమునను
గందమూలఫలాదులఁ గనఁడు తృప్తి;
నలఁతఁ బాయఁడుఁ; దొంటి స్వాస్థ్యంబుఁ గొనఁడు;
బ్రాహ్మణుండొ! పరీక్షింపవచ్చు వేల్పొ? ౨౩

గీ. మరియు నాహారముం దేర నరిగె నవియుఁ
జబచఅను దిక్కులకు నొక్క శశముదక్క;
ముసలి కావుటఁ జాలక పొగులుచుండె
నయ్యదియుఁ దన్నుఁ దలఁచుచు వ్యర్థమ నని. ౨౪

క. "అతిథిని సేవింపని నా
బ్రతుకేటికి ? నాదు మే నుపాయన మిత్తుఁ
గౌతుకక" యని యయ్యది ని
శ్చితమతియై యతిథితో వచించెను బేర్మిన్. ౨౫

క. "మలమల మాడెను దరుగు
ల్మలతాగణ మీవనమున; మందున కైనన్
ఫలముం గాయయుఁ దోపఁవు;
బలవత్తుద్బాధఁగొంటి పాపము ! కట్టా ! ౨౬

క. ఓ యతిథి దేవ ! యన్యో
పాయన మిడ శక్తి లేమి భక్తి నొసఁగుదున్
నాయొడ లిదె ! భుజియింపుము
నీ యాఁకలిఁ దీర్చుకొమ్ము ! నిలుపు ముసురులన్. ౨౭

ఆ. వె. శాస్త్రములు వచించు "జాతస్య మరణం ధ్రు
వ" మ్మటంచు; నింకఁ బరుల కొఱకు
నాత్మ దేహమును సమర్పించి జంతువు
అమరమైన పదము నందుఁగాదె !" ౨౮

క. అని యేతాదృశ భాగ్యము
తనకు లభించుట మహాముదంబునఁ బ్రాంతం
బున నున్న యెరగలింబడ
మన బాపఁడు నిలిచి తత్సమక్షమున ననెన్. ౨౯

క. "పురుహూతుఁడ నేను నినుం
బరీక్షణము సేయు బొంచె వచ్చితి; నాతో
నరుదేరుము స్వర్గమునకు;
సరి యెవ్వరు లోకమందు శశమా! నీకున్." ౩౦

క. అని పలికి యగ్నితప్తం
బును శశకము నమృతహస్తమునఁ దాఁకి తగం
బొనరించి సచేతనముగఁ
గొని చనియెన్ స్వర్గమునకుఁ గూరిమి వెలయన్. ౩౧



# జాతక కథా గుచ్ఛము

ద్వితీయ భాగము

## సుతసోమజాతకము

క. ప్రభవించె బోధిసత్త్వుఁడు
శుభసమయమునందు మదనసుందరతనుఁడై
విభవోజ్జ్వలుఁడై సాధు
స్వభావుఁడయి తొలుతఁ గౌరవకులేందుండై. ౧

క. సుగృహీతనాముఁ డగు నా
జగతీపతిపుత్త్రకుండు జనియించిన దా
దిగఁ దగె నభూతపూర్వం
బుగఁ బండువులపయిఁ బండువులు లోకమునన్. ౨

క. కల్యాణధర్ముఁ, డాతఁడు
బాల్యప్రభృతియు; దిశాయువతితతికి శిరో
మాల్యంబై; భువికి సుధా
కుల్యయయి యతనికీర్తి కొలలుచునుండున్. ౩

క. ఆనాఁడు, నేఁడు, లేఁడు స
మానస్కంధుఁడగు నొక్కమానవుఁడు ననూ
చానుండగు నా భూపతి
సూనునకు స్వకీయధర్మసువ్రతనిష్ఠన్. ౪

క. కృతలక్షణుండు, బహువి
శ్రుతుండు, సమ్మాన్యుఁడతఁడు సుతసోమాఖ్యన్
క్షితినిం బ్రఖ్యాతిం గానెఁ;
గృతయుగపురుషుండఁటందు రెల్లరు వానిన్. ౫

క. క్షితివరుఁడు, "యతోధర్మ
స్తతోజయ" యటన్నసూక్తి, "ధర్మంచర" యన్
శ్రుతివచనంబును మది న
ప్రతిమం బగు మంత్రములుగ భావన సేయున్. ౬

గీ. ధర "శరీర మాద్యం ఖలు ధర్మసాధ
న మ్మను" బుధోక్తి నతఁడు సత్య మ్మెనర్చెఁ
దమకుఁ బ్రత్యక్షదేవుండు ధరణి విభుఁడె
యనుచుఁ బ్రజలెల్లఁ గేల్మోడ్చి రతనిభక్తి. ౭

క. క్షితిదేవి పుణ్యఫలమున
నతండు దగ యౌవరాజ్యమంది వెలింగెన్;
గృతకృత్యతఁ గంటిమి యని
పితరులు ముదమొంద నతని ప్రియులు చెలంగన్. ౮

ఆ. వె. తెలిసికొనుచునుండుఁ దెలిసియే యున్నను
ధర్మములు సుభాషితము లతండు;
వచ్చికఅపుచుండ్రు వానికంతర్ముఖు
లయిన పండితేంద్రు లనుదినంబు. ౯

క. ఒక చెవితోడను విని వే
ఱొకచెవితో విడుచుచుందు రొకకొందఱు ధ
ర్మకథల్; మన సుతసోముఁడు
సకలము హత్తించి వాని సాధనసేయున్. ౧౦

చ. తమినొకనాఁడు రాసుతుఁడు ధర్మకథాశ్రవణంబు సేయు స
త్సమయమునందుఁ బౌరజనసంతతి సాధ్వససంభ్రమాంగకం
పములఁ గడుం దడంబడుచువచ్చి "నమోనమ" యంచు హస్తయు
గ్మము మొగిడించి మ్రొక్కిరి మొగంబుల దైన్యము వ్రేలుచుండఁగన్ ౧౧

మ. మరియున్ వారలు పల్కి రివ్విధముగన్ "క్ష్మానాథపుత్రా! సుదు
ష్కరుఁడున్ దుర్దముఁడున్ సుదాసు సుతుఁడౌ కల్మాషపాదాఖ్యుఁ డా
శరుఁ డొక్కండు ద్వితీయకాలుఁడన బల్ శక్తిన్ విజృంభించి యీ
పురవాస్తవ్యులఁ జంపితించిటకు బర్వుల్ వాఱుచున్నాఁడిగో! ౧౨

చ. ఎఱుఁగవె యా సుదాసు ధరణీశు? నతం డొకతూరి కాననాం
తరమున కేగి వేఁట కట దైవవశంబునఁ జెప్ప సిగ్గగున్;
స్మరపరిపీడ్యమానుఁడయి సంగమముం బొనరించె సింగపుం
గరితను; దాన నయ్యదియు గర్భముఁ దాల్చి కనెం గుమారునిన్. ౧౩

క. ఆ యర్భకుండు స్వసజా
తీయుఁడు గాదనుచు నది మదిం దలఁచెనొ? యే
మో? యచ్చటం ద్యజించియ
పోయెను; బెంచిరి కిరాతముఖ్యులు వానిన్. ౧౪

క. తదుపరి కొన్నాళ్ళకు నా
సుదాస ధరణీశ్వరునకు సూనునిఁ బెను సూ
డిదగా శబరు లొసంగిరి;
ముదమునఁ గొని పెంచె నతఁ డపుత్రకుఁ డగుటన్. ౧౫

క. అయగారిఁ జేయఁబోఁ గ్రోఁ
తయిన విధంబునను బెంచి యాతేఁ డతనిన్
బ్రియముగ శ్రేష్ఠునిఁ జేయఁగఁ
బ్రయతింపఁగ వాఁడు క్రూర రాక్షసుఁడయ్యెన్. ౧౬

గీ. బాల్యమున యందు నేత్రోత్సవం బొనర్చె;
భావికాలానఁ గల్యాణ వర్ధనుండు
గాఁగలఁడటంచుఁ దలఁప లోకంబు తుదికి
నయ్యె గుఱ్ఱంబు గాడిదయైన పగిది. ౧౭

క. ప్రకృతి విరుద్ధంబుగ సిం
హికఁ బురుషుఁడు గూడె; విప్రతీపత నది పు
త్త్రికుఁ గనె; నతఁడు జగత్కం
టకుఁడగుటకు నక్కజంపడం గా నేలా? ౧౮

క. ఏఁడులు పైఁబడ వానికిఁ
గీడులు పైఁబడె సుదాసు క్షితిజనములకున్;
వీడెను సుతుదుశ్చేష్టలు
చూడంగా లేక పిత యుసురులం దుదికిన్. ౧౯

క. ఎరగలి వనసత్త్వంబుల
తెఱఁగునఁ, బడబాగ్ని వారిధినిఁ బోలెను, వాఁ
డెరనేసి మ్రింగివేసెను
బురుష స్త్రీ బాల సంఘము స్వరాష్ట్రమునన్. ౨౦

క. పడి ప్రక్క యూళ్ళపై నా
తఁడు చిచ్చుఱపిడుగువోలెఁ దత్తత్సకలం
బడఁచి మన యూరిపై ని
ప్పుడు వడి చేసెడిని బెడిదములు ప్రాణులకున్. ౨౧

ఉ. మారి మసంగిన ట్లతఁ డమాంతముగాఁ గనఁబడ్డవారి న
వ్వారిగ గొంతు నుల్మి యకృపామతి నెత్తురుఁ బీల్చి ప్రేఁగులన్
హారముగా ధరించి పలలౌఘము మ్రింగుచుఁ గ్రాయు చెమ్మలన్
దారుణచేష్టుఁడై పరువునం జనుదెంచుచునుండె వీఁడిగో! ౨౨

శా. ఒక్కండయ్యును బట్టఁ బగ్గములు లేకోజస్సమృద్ధాంగుఁడై
పెక్కండ్రట్టులు లెక్కకుం గొనక పై విచ్చేయు శూరావళిన్
దృక్కుల్ క్రక్కఁగఁ జంద్ర నిప్పుల నతం డేతెంచు నీ దిక్కుకున్
దక్కెన్ నీ దయ మాదు జీవితము లన్నా! వీనిఁ దున్మాడవే? ౨౩

గీ. ఔషధము గీడునకుఁ గీడ యగునుగాని
పున్నియపుఁ జేఁతగాదు సూ! పుడమియందు
నుపకృతుండగు దుష్టెవ్వఁ డుపశమిల్లు ?
"అస్త్ర మస్త్రేణ శామ్యతి" యంట వినవె ? ౨౪

క. అనవుడు సుతసోముం డా
య్యాన నిట్లనియెన్ సుదాసు నాత్మజుఁడే యీ
ఘనుఁ ? డిల బీజంబెట్టిదొ !
జనించు నంకురముఁ దత్సజాతీయంబై. ౨౫

చ. అని వచియించి "మీరు భయమందకుఁ డిచ్చట నుండుఁ డేన యా
తని కడకేగి తెల్పెదును ధర్మకథావళిఁ దత్ప్రవృత్తి మా
ర్తును; బరిమార్తుఁగాని యెడ; దుష్టుఁ డెవండు మనెం జిరంబు ? ధా
త్రిని వినిపాత హేతు వనరే ? యధికోగ్రచ్ఛయమున్ బుధోత్తముల్". ౨౬

క. అని యూఱడించి ప్రకృతుల,
జనవరసుతుఁ డతని డాయఁజనఁ బూనఁగ నా
మనుజాశనుండె కడు రి
వ్వునఁ బెద్ద తుపానుగాడ్పు పోల్కిని వచ్చెన్. ౨౭

ఉ. దారుణకాళరాత్రికినిఁ దమ్ముఁడొ ? యన్నయొ ? నాగ మేను క్రొ
క్కారు మొగిల్వలెం గురియఁగా దెసలన్ బహుళాంధకారముల్
క్రూరత మూర్తినింగొనెనొ ? లోకములం గబళించు శక్తియో ?
చేరువచుట్టమో ? యనఁగఁ జెంగటకుం బఱతెంచె వాఁడొగిన్. ౨౮

క. తమి జనతిమితతి మ్రింగెడు
తిమింగిలం బనఁగఁ బాఱుతెంచెడువానిన్
సుమనస్కుఁడు సుతసోముఁడు
తిమింగిలగిలంబువలె నెదిర్చెను గడిమిన్. ౨౯

గీ. ఔషధము గిడునకుఁ గీడ యగునుగాని
పున్నియపుఁ జేఁతగాదు సూ! పుడమియందు
నుపకృతుండగు దుష్టెవ్వఁ డుపశమిల్లు ?
"అస్త్ర మస్త్రేణ శామ్యతి" యంట వినవె ? ౨౪

క. అనవుడు సుతసోముం డో
య్యన నిట్లనియెన్ సుదాసు నాత్మజుఁడే యా
ఘనుఁ ? డిల బీజంబెట్టిదో !
జనించు నంకురముఁ దత్సజాతీయంబై . ౨౫

చ. అని వచియించి "మీరు భయమందకుఁ డిచ్చట నుండుఁ దేన యా
తని కడకేగి తెల్పుదును ధర్మకథావళిఁ దత్ప్రవృత్తి మా
ర్తును; బరిమార్తుఁగాని యెడ; దుష్టుఁ డెవండు మనెం జిరంబు ? ధా
త్రిని వినిపాత హేతు వనరే ? యధికోచ్ఛ్రయమున్ బుధోత్తముల్". ౨౬

క. అని యూఱడించి ప్రకృతుల,
జనవరసుతుఁ డతని డాయఁజనఁ బూనఁగ నా
మనుజాశనుండె కడు రి
వ్వునఁ బెద్ద తుపానుగాడ్పు పోల్కిని వచ్చెన్. ౨౭

ఉ. దారుణకాళరాత్రికినిఁ దమ్ముఁడొ ? యన్నయొ ? నాగ మేను క్రొ
క్కారు మొగిల్వలెం గురియఁగా దెసలన్ బహుళాంధకారముల్
క్రూరత మూర్తినింగొనెనో ? లోకములం గబళించు శక్తియో ?
చేరువచుట్టమో ? యనఁగఁ జెంగటకుం బఱతెంచె వాఁడొగిన్. ౨౮

క. తమి జనతిమితతి మ్రింగెడు
తిమింగిలం బనఁగఁ బాఱుతెంచెడువానిన్
సుమనస్కుఁడు సుతసోముఁడు
తిమింగిలగిలంబువలె నెదిర్చెను గడిమిన్. ౨౯





గీ. అపుడు కల్మాషపాదుం డహంకరించి
యెత్తి ప్రాయంపుబెబ్బులి నేన్గుపగిది
నిజభుజాస్కంధమునఁ బెట్టి నిట్టలంపు
వడినిఁ బరువెత్తెఁ జూపఱు బెడఁ దవడఁగ ౩౦

క. బెట్టిద మగు నేతత్కథ
పట్టణ మంతయునుఁ బ్రాఁకె; వాని పితృముఖుల్
అట్టుడికినట్టు లుడికిరి;
కట్టా ! యని పొగిలెఁ ప్రజయుఁ; గలకల మెగసెన్. ౩౧

క. సుతసోముండు చలింపక
స్మితముఖమునఁ గూరుచుండెఁ జిత్తంబునకున్
ధృతిఁ గూర్పఁ "యతోధర్మ
స్తతోజయ" యిటన్న దివ్యధర్మ మొకటియే. ౩౨

ఉ. వానిని నట్ల మోసికొని పర్విడి యారజనీచరుం డర
ణ్యానులఁ బెందటాకనివహంబుల దాటియుఁ, గ్రుళ్ళుకంపునన్
ఘ్రాణము వ్రయ్యలించు చెముకల్ పునుకల్ పడి పెద్దరాసులై
కానఁగవచ్చు నొక్కగిరిగహ్వరసీమకుఁబోయె నుద్ధతిన్. ౩౩

గీ. అచ్చటను డించి వాని స్మితాస్యుఁగాంచి
యక్కజంపడి రాక్షసుం డనియె నిట్లు
"ప్రమదపడుదువు పెండ్లికి వచ్చినట్లు
పెద్ద పెండ్లిని నీకుఁ గావింతు నిపుడె ! ౩౪

క. క్షితిపతులఁ బసులఁగా నిడి
శతయజ్ఞంబుల యజింప సంకల్ప మొన
ర్చితి; దొంబది తొమ్మిదిఁ జే
సితి; నీతోఁ బూర్తియగును శిష్ట మొకటియున్". ౩౫

క. అనవుడుఁ గలకుగ, జనపతి
తనయుం దేదో స్మరించి తన కనుదోయిన్
జనియింపఁగ బాష్పంబులు
ఘనశోకముఁ బొందె; నంతఁ గ్రవ్యాదుఁ డనెన్. ౩౬

ఉ. "ధైర్యము సాహసంబు మహితంబనినీయెడ, మొక్కవోని స
ద్వీర్యముఁ గల్గితంచు, మృతి భీతి వహింప వటంచు వింటి నీ
ధుర్యత, కార్య శూరతయు దోఁచెను రిత్తగ; మేఁకపోతు గాం
భీర్యముఁ జూపఁగల్గిన ప్రవీర శిఖామణి వంట చెల్లెడిన్." ౩౭

క. అని నవ్వఁగ సుతసోముం
డనె "నాకును మృత్యు భీతి యన్నది లేదో
మనుజాశన! నే గురుద
క్షిణ నీకేతెంచితి; నది చిత్తముఁ గాల్చెన్. ౩౮

క. గురుఋణమును దీర్పమినిన్
దురితం బగు నండ్రు కోవిదులు; కావున నేఁ
బురి కరిగి తీర్చివత్తు న
చిరంబుగఁ గనికరించి సెలవీయఁ గదే! ౩౯

క. జనుషాంధులకును జ్ఞానాం
జనమిడి తెలిపించి కనులు జన్మము సఫలం
బును జేయఁజాలు గురువుల
ఋణంబున కియత్తగలదె? యిల సత్యముగన్. ౪౦

క. ననుఁ బశువుఁ గనిరి జననీ
జనకులు; దేశికుఁడు ధర్మ సర్వస్వము నా
కును నూఱిపోసి చేసెను
మనుజునిఁ; దదృణంబుఁ దీర్చి మగుడన్ వత్తున్. ౪౧

గీ. గురుఋణంబును దీర్పని కొఱఁతతోడ
మృత్యువుం గాంతునని చిత్త మెరియుచుండెఁ;
దల్లిదండ్రుల దర్శింపఁ దలఁప నైతి;
నాలుబిడ్డలనుం గాంచనైనఁ దలఁప." ౪౨

మ. అనుడున్, రాక్షసుఁ డట్టహాసమున "నౌరా! యెంత మాయావివో
యి! ననుం బుట్టను బెట్టి పోఁదలఁచితే? యింతేల? నీకన్న నే
ర్పున నేఁడాకుల నెక్కుడేఁ జదివితిన్ బో పొమ్ము! నీబోటి వా
రిని వీక్షించితి నూట తొంబదుగురిన్ బృథ్విన్ ననున్ మింతువే? ౪౩

క. సిలకుం జక్కలిగింతలు
గలవే? నను మోస పుచ్చఁగలవే నీ మా
యలు? చెప్పువారు చెప్పిన
వలదె వివేకంబు వినెడి వారికి నైనన్? ౪౪

గీ. నన్ను వంచించి తప్పించుకొన్న నీవు
మరల నేతెంతు వన్న నమ్మంగ నగునె?
ఉరులఁ దప్పించుకొని చన్న హరిణ మెట్లు
వెదకికొని వచ్చుఁ గ్రమ్మఱ వేఁటకాని? ౪౫

క. గురుఋణమును దీర్పమినిన్
దురితం బగు నంచుఁ బల్కెదువు నీ యీ మాయా
దురితముతో నా కేటికిఁ
గరుణింపన; యెద్దుపుండు కాకికి ముద్దే?" ౪౬

క. అనవుడు సుతసోముం డి
ట్లను "నోయీ! రాదు కల్లయగు నుడి నా నా
ల్కను గోసిన; నా హృదయం
బును జీలిచి చూచుకొమ్ము! పొరి నమ్మవయేన్. ౪౭

క. ఈ యల్ప శరీరమునకు
శ్రేయస్కాముం డిసీ! వచించునె కల్లల్ ?
నీ యిష్ట మున్నఁ బంపుము
వేయేటికిఁ ? గాక యున్న విఱువుము నన్నున్. ౪౮

క. సత్యమె నా యిలువేలుపు;
సత్యమె నా తోడునీడ; సర్వస్వంబున్;
సత్యవ్రతుండు సతముం
బ్రత్యుత్థానం బొనర్చు మరణంబునకున్." ౪౯

క. అని నిర్భయముగ నిలిచిన
జనవరసుతుఁ గాంచి రాక్షసవరుం డెద నీ
తని వాక్కకృత్రిమంబుగఁ
గనఁబడుఁ; గంఠంబు మ్రోగుఁగద గంటవలెన్. ౫౦

క. వదలుదుఁ; బరిశీలింతును;
దదీయ సత్యప్రతిజ్ఞఁ; దప్పినఁ బ్రతినన్
బ్రదికింతునె యీ పలువను ?
జిదుమనె; చేయంగ లేనె చిత్రవధఁ దుదిన్ ? ౫౧

క. అని తలపోసి నృపాత్మజుఁ
గని "యోయీ! పోయిరమ్ము! కడఁకం గనుఁగొం
దును నీదు వాగృజుత్వము"
నని పనుపఁగ వానిఁ బొగడు చాతం డరిగెన్. ౫౨

క. తలిదండ్రు లాలుబిడ్డలుఁ
జెలికాండ్రురు వచ్చినట్టి శ్రీ సుతసోమున్
నలుదెసల మూఁగికొని కౌఁ
గిలికొని కన్నీరు గొనియుఁ గీర్తించి రొగిన్. ౫౩

ఉ. వచ్చిన రాకుమారుఁగని బంధులు రాహుముఖాంతరంబునుం
జొచ్చి బహిర్గతుండయిన సోముఁ డితం డని, భార్గవోదరం
బుచ్చిన యా కచుండు ననియున్, యమునిన్ మెడపట్టి నెట్టి వే
వచ్చు మృకండుజుం డనియుఁ బండుగు చేసిరి సంతసించుచున్. ౨౪

క. ప్రతిరోధము సేయుదు రని
క్షితివరసూనుండు తెలయఁజేయక స్వపున
ర్గతిఁగూటిచి, కొని ధనసం
తతి నాచార్యున కొసంగి తత్పరమతియై. ౨౫

క. మరియు శుభోదర్కంబును
గురూపదిష్టమగు ధర్మకోటిని విని ని
ర్భర మగు హర్షంబును గొని
త్వరితగతిని నసురకడకుఁ బయనం బయ్యెన్. ౨౬

గీ. ప్రాఁకె నవ్వార్త నగరి నల్వలఁకు లందు
నాలుబిడ్డలుఁ దలిదండ్రు లాది యైన
వార లాబాలవృద్ధంబు పౌరజనులు
పెద్దవెల్లువయై వానివెనుకఁ బఱచి. ౨౭

చ. వల దని కాళ్ళకడ్డముగ వత్తురు; చేతులువట్టి లాగుచుం;
ద్రలబలముల్ పొనర్తురు; కడుఁ బ్రార్థన సేతురు వెంటఁగూర్మిఁ ద
మ్ములఁగొనిపొమ్మటంచుఁ; దలమోదుక యూర్పుచుఁ బెట్టుచుందు రే
డ్పులుఁ బెదబొబ్బలున్; నృపతిపుత్రుఁడు వారికిఁ బల్కె నత్తఱిన్. ౨౮

ఆ. వె. "వత్తు మగుడ ననుచు బాసాడి యసురకు
వచ్చి మాటఁ దప్పఁ బాఁడియగునె?
నాదుమాట వినుఁడు, నాకుఁ బ్రాణముకన్న
జగతి సత్యసూక్తి చాలఁదీఁపి. ౨౯

గీ. క్ష్మాజనులు 'నానృతా త్పాతకం పరమ్మ'
టంచు, 'సత్యేన లోకాన్ జయతి' యటంచు
సరవి 'సత్యంవద' యటంచుఁ జదివి తుదికి
నగునె యొజ్జల పుచ్చకాయగ నొనర్ప! ౬౦

క. రా జయి సత్యముఁ దప్పిన
నే జనులద్దాని నిర్వహించెదరు? 'యథా
రాజా తథా ప్రజా'యను
నోజను మీ రెఱుఁగురే? బుధోత్తములారా? ౬౧

క. భయపడవలవదు ధర్మమె
జయమొందును దిరిగివత్తు సరగున మరలన్
ప్రియముగ నను దీవింపుఁడు
పయనింపఁగ నిండ"టంచు వారి కెరగుచున్. ౬౨

క. కనుచుండ వారు బాష్పే
క్షణములను విలాపములను క్ష్మాపతిపుత్రుం
డనుకంపాశూన్యునివలె
వెనుదిరుగక చూడకయును వేవేగఁ జనెన్. ౬౩

క. కనుచూపుమేర నుండియె
కనుఁగొని యా వచ్చుచున్న క్ష్మావరతనయున్
అనిదంపూర్వాద్భుత మిది
యని కరగఁగఁ దొంటిహృదయకార్కశ్య మొగిన్. ౬౪

క. క్రమముగఁ బ్రభాకరోద్గతిఁ
తమము తలఁగునట్లు నృపతితనయుండు సమీ
పమునకు వచ్చిన కొలఁదియు
తమీచరుని మానసోద్ధతత్త్వము తలఁగన్. ౬౫

క. ఎదు రేగి మోఁకటిలి త
త్పదాంబుజంబుల, నతఁడు కృతజ్ఞతఁ బలుకన్
మొదలిడఁగాఁ నా రక్కసి
మొదటఁ దను క్షమింప దీనముగఁ బ్రార్థించెన్. ౬౬

క. మరియుం బల్కెను రజనీ
చరుండు "ధన్యుండ నైతి సత్యము; గంగా
ఝరమువలె నన్నుఁ బావునిఁ
దరియించెను నీదు దివ్యదర్శనము సఖా! ౬౭

క. నినుబోటి సత్యసంధునిఁ
గనియు వినియు నెఱుఁగఁ; బ్రళయకాలసదృశునిన్
నను డాసితి 'మ్రింగుమి' యని
తృణీకరించియు సిరిం ద్వదీయంబెల్లన్. ౬౮

క. నీపాద దాసుఁడను; నా
పాపౌఘం బడఁగు నట్టి ప్రాయశ్చిత్తం
బో పుణ్య! తెలుపు పశ్చా
త్తాప దవానలము నన్ను దగ్ధు నొనర్చెన్. ౬౯

ఉ. క్రుళ్లిన పెంటకుప్పవలె రోఁతను గొల్పుచు నుండె నాకు నా
యొ ళ్ళఘపంకిలం బయి; యయో! హృదయంబున వాఁడియమ్ములం
బెల్లుగ గ్రుచ్చినట్టులుఁ దపింతు; భ్రమించుచు నుండెఁ గట్ట! నా
కళ్లను; జావునుం బ్రదుకుఁగాని విధంబున నుంటి నిత్తఱిన్. ౭౦

క. చరితమున జయించితి ననుఁ
గరిశతబలు వజ్రకాయుఁ; గనుఁగొంటిని భూ
వర సుత! ధర్మబలమునకు
సరిరా దని నిశితవజ్రసముదాయంబున్. ౭౧

క. శరణముఁ గోరితి నిన్నున్ ;
గురుండవై సర్వ ధర్మకోటిని నాకుం
గఱపుము ; క్షాళింపుము త్వ
త్కరుణారసమున మదీయకలుషం బెల్లన్." ౭౨

క. అని ప్రార్థింపఁగ నిట్టులు
జనవరపుత్రుండు వలికె "సాఁగింపుము : పూ
నినయజ్ఞ మవిఘ్నంబుగ
మనుజాశన ! నీకు ధర్మమార్గ మదేలా !" ౭౩

క. అనఁ జింతిలి యసురుఁడు చ
చ్చిన నన్నుం జంపఁజన్నె ? క్షితిపతి పుత్రా !
మనుపుము ధర్మాదేశం
బునఁ గాకున్నను ద్యజింతుఁబో ! ప్రాణములన్." ౭౪

క. అనవుడు సుతసోముం డా
తనిఁ బశ్చాత్తాపవహ్ని దగ్ధమనస్కున్
గనికర మొలికెడు కన్నులఁ
గనుఁగొని ధర్మామృతంబుఁ గడఁగెం జిలుకన్. ౭౫

క. "మనుజుండవయ్యుఁ గట్టా !
మనుజాశనవృత్తిఁ గొంటి మాతృగుణమునన్ ;
విను మో సఖ ! కర్మఫలం
బనుభోగింపక యడంగ దందురు పెద్దల్. ౭౬

గీ. ధర్మకంచుకసంవృత తనువుఁ బ్రాణిఁ
దాఁకఁజాలదు కర్మసంతతి ఫలంబు
దాన వాసన లడఁగి నిర్వాణమొందు
ధరణి 'ధర్మం తు చింతయే త్ప్రాజ్ఞ' యంద్రు. ౭౭

క. ధర్మం బహింస ; సత్యము
ధర్మం ; బస్తేయవృత్తి ధర్మము ; మరియున్
ధర్మం బింద్రియ విజయము ;
ధర్మము శౌచంబు వీనిఁ దాల్పుము సఖుఁడా ! ౭౮

క. పరహింసఁ గూర్చు దురితము ;
దురితము నరకమునఁ బ్రాణిఁ ద్రోయును ; వాఁడా
నరకసహస్రంబులలో
దురంతమగు పీడపడుచుఁ దుందుడుకుఁ గొనున్. ౭౯

క. ఇహసుఖలుబ్ధాత్మకునకు
నహి నహి పో ! కర్మవాసనాక్షయము సఖా !
బహుమానింపం దలఁతియు
నిహసౌఖ్యము వాసనాక్షయేచ్ఛ వెడందన్ ! ౮౦

క. ఎదురీఁత సుమ్మి ! ధర్మా
స్పదమగు జీవితము ప్రాణిజాలంబునకున్ ;
వదలుదు రజ్ఞులు ; ప్రాజ్ఞులు
సదభినివేశమున దాని సాధింత్రు సుమీ ! ౮౧

క. జయభేరిని మ్రోగించిన
క్రియఁ దోఁచు నధర్మమనెడి ఱేఁడు మొదట ; నె
మ్మెయినైనఁ దుదికి ధర్మమె
జయించును జయించు శుద్ధసత్య మిది యగున్. ౮౨

క. విత సుమ్మి ! గజస్నానము
వితమునఁ గొందఱకు ధర్మవిద్యాశ్రవణం ;
బతకదు జలాక్షరము వలె ;
క్షితిఁ గొందఱ కెంత మేలొ చేయుఁ జరింపన్." ౮౩

క. అనుచుఁ మరియును మరియును
వినిపింపఁగ ధర్మములను విని యవధానం
బున రాక్షసుండు పొగడెను;
ప్రణమిల్లె సహస్రశముగ రాట్పుత్రునకుఁ. ౧౪

క. ఇందుగున నీరు దేఱిన
చందంబున వాఁడు ధర్మసంశ్రవణమునఁ
డెందము విమలముగాఁగ న
మందానందమున తేని మన్ననసేసెన్. ౧౫

క. సాదరముగ వీడ్కొలుపఁగ
భూదారసుతుండు సనియెఁ బురమున కెలమిఁ;
ప్రాదుర్భూత వివేక
స్వాదుమతిని రాక్షసుండు జన్మముఁ గడపెన్. ౧౬



# జాతక కథా గుచ్ఛము

ద్వితీయ భాగము

---

## హంస జాతకము

క. మును బోధిసత్త్వుఁ డొకపరి
జనించె హంస మయి మానససరోవర మం
దున శుద్ధకీర్తిసంచయ
మునఁ దత్ప్రాంతాద్రి శుద్ధమును గావించెన్. ౧

క. అతిపూతము గావుట నా
క్షితిధరమున నమరనది దిగెన్; శివుఁ డా ప
ర్వతపుత్త్రిక నర్ధాంగిగఁ
బ్రతిగ్రహముచేసి శుభపరంపరఁ బడసెన్. ౨

గీ. ధరణి నా హంసఱెక్కల తాఁకుఁ గొన్న
తమ్మి ధన్యమ్మ; కలుములకొమ్మ యందుఁ
బ్రభవముం గాంచి హరిని వివాహ మాడి
యౌర! యైశ్వర్యవంతురాలై చెలంగె. ౩

క. పదునాలుఁగు లోకంబులు
వెదకి వెదకి తుదికి వేల్పుఁబెద్దయు సంప
త్ప్రద మని వాహనముగఁ గొనెఁ
దదన్వయజు సృష్టికర్తృతం గొనె దానన్. ౪

క. ఆ పరమహంస లోకముఁ
బాపావిల మనుచు రోసి వలిగుబ్బలినిం
బ్రాపించి మానసంబునఁ
గాపుర ముండెను మృణాలఖండాశనమై. ౫

క. నలుదెసలనుండియు ద్విజా
వళివచ్చి సమాశ్రయించి వరహంసంబున్
జలజాసను బ్రహ్మర్షుల
వలె నుపదేశములఁ గొనుచు వదలక కొలుచున్. ౬

గీ. తన్ను సేవించు ద్విజతతిం దన్నుఁ బోని
పరమశుద్ధులఁ గావించెఁ బరమహంస;
యవనియందు స్వయంతీర్ణు లయినవారు
పరులను దరింపఁజేయు టచ్చెరువు గాదు. ౭

క. వెలిమబ్బుల తునియలవలె,
మలయల్లుని నవ్వువెలుఁగు మాద్రిఁ, దుషారా
చలతటగమునీంద్రుల మది
వెలి కుఱికిన సత్త్వరాశివిధిఁ దగె హంసల్. ౮

క. ఛాత్రులవలె నా హంసకుఁ,
బుత్రులకరణిం, ద్రిశుద్ధిఁ బొందిన సుమహా
మిత్రులవలెఁ గలిగించుచు
నేత్రానందంబు హంసనివహము చెలఁగున్. ౯

క. సతతముఁ గొలుచును బింబముఁ
బ్రతిబింబము వోలెఁ బుణ్యవరు నా హంసన్
ఇతరాండజముల కంటెను
నతివృద్ధం బొక్క మల్లికాక్షము బత్తిన్. ౧౦

ఆ. వె. బోధిసత్త్వహంసమును వృద్ధహంసంబు
రాజసచివులట్ల, భ్రాత లట్ల
సూర్యచంద్రులట్ల, శోభిల్లె నటఁ బర
స్పరగుణానుబద్ధభావము లయి. ౧౧

క. ఆ వెలిపులుఁగులచరితము
క్ష్మావలయమునందుఁ గథలు కథలుగ జనముల్
కావింత్రు ప్రసంగంబులు
పావనతరమైన భాగవతకథలవలెన్. ౧౨

క. పరగును దత్కాలంబున
ధరణీనాయకుఁడు బ్రహ్మదత్తాఖ్యుం డౌ
క్కరువుఁడు వారాణసిఁ; ద
న్నరపతి విని వీనిఁ గూర్చి నానాకథలన్. ౧౩

క. పలుమఱు వినుకలినిఁ గుతూ
హలపడి చిత్తమునఁ జూడ నా హంసములన్
గొలువుందీఱిచి యొకపరి
పలికెను బ్రెగ్గడల భూమిపాలకుఁ డిట్టుల్. ౧౪

క. "కలవఁట మానససరమున
వెలిపులుఁగులు; వానిఁగూర్చి వినియుందురు మీ
రలు; నందు జంట గలదఁట
కలిగించెడునంట యదియుఁ గన్నులవిందున్. ౧౫

క. కనియును వినియు నెఱుంగని
మనోజ్ఞవిహగంబులంట; మన మెక్కరణిన్
గనఁగలుగుదు మప్పులుఁగుల?
నొనర్పుఁ డాలోచనంబు నో మంత్రవరుల్!" ౧౬

క. అని ప్రశ్నింపఁగ సచివులు
క్షణ మాలోచించి యేకకంఠంబుగ ని
ట్లనిరి "మహీపతి! వింటిమి
మును మేమును బెద్ద హంసములఁ గూర్చి కతల్. ౧౭

గీ. మానససరోవరంబన్న మానసంబు
పొంగిపోవును రాయంచమొత్తమునకు
దానిని నధఃకరించు సౌందర్యము గల
పరసరస్సున్న నవి దాని వదలివచ్చు. ౧౮

గీ. ఉర్వి జంతువులన్నియు నుత్తరోత్త
రాభివర్ధిష్ణువైన సౌఖ్యంబుఁ గోరుఁ;
దారతమ్యంబుఁ గని తొంటితావు విడిచి
పరువిడుచునుండుఁ గాదె నన్యస్థలంబు ? ౧౯

గీ. సప్త సంతానములఁ బ్రశస్తము తటాక
సంప్రతిష్ఠయు నద్దాన సంఘటిల్లు
నిహపరంబులుఁ ; గానఁ జేయింపు మట్లు
ధరణి "నేకక్రియా ద్వ్యర్థకరి" యటంద్రు. ౨౦

క. అనవుడు రాజోత్తముఁ డి
ట్లనె ; "మంచిది యట్లచేయుఁ" డని యాజ్ఞాపిం
చెను ; వెచ్చింతురు ప్రభువులు
వినోదముల కొఱక పిఱుదివియక ధనంబుల్. ౨౧

క. మఱుసటినాఁటికె చక్కని
చెఱువుం ద్రవ్వించి వారు సిద్ధముఁ జేయిం
చిరి ; తేం డ్లాలస్యంబును
భరింపరు స్వకార్య సిద్ధిపట్ల నొకప్డున్. ౨౨

ఆ. వె. బ్రహ్మదత్తు రాజ్యరమ నిల్వటద్దమై
మానసంబుఁ గన్న మాతయయ్యు,
నమృతవార్ధి బిడ్డ యగుచుఁ, గాసారంబు
కలుగఁజేసెఁ బ్రజకుఁ గనుల విందు. ౨౩

క. కలువలతోఁ, దమ్ములతోఁ,
జలవిహగావళి యొనర్చు శ్రావ్యములగు త
త్కలకల నాదంబులతోఁ
గొలంకు దగె నీటి వనమొకో? యిది యనఁగన్. ౨౪

క. పలుకులచెలితో ముదుసలి
నలువయు జలకేళికై మనంబునఁ గోరెన్;
జలధిం ద్యజించి హరి యీ
కొలఁకున రమతోడఁ బండుకొనఁగాఁ దలఁచెన్. ౨౫

క. యాతాయాత శకుంత
వ్రాతముచే నాలకించి రాయంచలు త
న్నూతన తటాకశోభను
గౌతూహల మొందెఁ గాంచఁగా నద్దానిన్. ౨౬

క. ఒక టొకటిగ నా హంస
ప్రకరము ప్రార్థించె హంసరాజును మంత్రిన్
ఒకమారు పోయి రమ్యముఁ
బ్రకటమునగు సరసుఁ జూచివత్తమని తగన్. ౨౭

క. అనవుడును మంత్రి హంసము
విని, "యాఱేఁడేల కొలఁకు వెలయించెఁ? బ్రయో
జనము వినా మూఢుండును
బనికిం బూనం డటంచు వచియింత్రు బుధుల్. ౨౮

క. మతిఁ దలపంగఁ దటాక
ప్రతిష్ఠ యను మిష వహించి, వసతికి రాఁగా
క్షితివరుఁ డస్మాదృశులను
బ్రతిగ్రహింపంగఁ దలఁచువాఁడయి తోఁచున్. ౨౯

క. అరయఁగ మన కీ కొలఁకునఁ
గొఱఁ తేమిటి ? యటకుఁ బోవఁ గొప్పేమిటి చే
కుఱు ? కుడిచి, కూరుచుండక
యురుల వెదకికొనుచుఁ బోవు నోజ యిదిసుఁడీ !" ౩౦

క. అని దివ్యదృష్టినిం గాం
చిన గతిఁ బ్రకటిత మొనర్చె క్షితిపతి మనమున్
గణియించు నావులించిన
జనముల ప్రేఁగుల నొకొక్క సచివుండు భువిన్. ౩౧

క. ఎడఁదకు నప్రియ మగు నా
నుడి విని రాయంచ లిట్లనుం "బెద్దలకుం
బెడతల నుండవె బుద్ధులు ?
అడుగడుగున నిట్లు సంశయంపడఁ దగునే ? ౩౨

క. అరుదేరుము నీవో దే
వర ! వినుమీ ! మాదు విన్నపం బితని నుడుల్
సరకుగొననేల ! యీతఁడు
పరికించియుఁ దనదు నీడ భయము వహించున్." ౩౩

క. అనుచుఁ బదింబది నభ్య
ర్థనమొనరింపంగ నాశ్రితవిహంగంబుల్
మనబోధిసత్త్వహంసము
కొని మొగమోటంబు నొప్పుకొనె నటకేగన్. ౩౪

క. వసుధను వివేకు లేనియు
నసదాలోచనము వింద్రు ప్రారబ్ధముచే
వసమతి; "బుద్ధిః కర్మా
నుసారిణీ" యన్న బుధుల నుడి నిజముగదా ! ౩౫

క. పిమ్మట నా హంస సమూ
హమ్మంతయుఁ రాఁగ వృద్ధహంసముఁ దమతో
నిమ్ముగ వింటికి శరద
భ్రమ్ములవలె నెగసి పఱచి వ్రాలెఁ గొలఁకునన్. ౩౬

గీ. వ్రాలి రాయంచ లా సరోవరమునందు
నూర్మికాడోలికలయందు నూఁగుకొనుచుఁ
దమ్మి పూఁదేనె లానుచు ముమ్మరముగఁ
గలకలంబు లొనర్చుచుఁ జెలఁగుచుండె. ౩౭

క. త్వరపఱపఁ దొడఁగె మానస
సరోవరంబునకుఁ దిరిగి చనఁగా హంసో
త్కరమును రాజును మంత్రియు
నరిష్టశంకాకులాత్మలై యయ్యదనన్. ౩౮

గీ. మరులుఁదీఁగెను ద్రొక్కిన మాద్రి నకట !
చొక్కమందు మెసంగిన చోద్యమునను
మఱచెఁ గాణాచికిం బోవుమాట నవియుఁ
గాంచనైనను వానినిఁ గాంచఁబోవు. ౩౯

క. నిజసంశ్రిత వర్గంబును
ద్యజించి చన నిష్టపడక యా హంసంబుల్
గజిబిజినిఁ గొనుచు నొక పం
కజపత్రము నొద్దనిలిచెఁ గడిఁదిఁ బిలుచుచున్. ౪౦

గీ. బ్రహ్మదత్తుండు గాసార రక్షకావ
బుద్ధ హంసాగముం దతఃపూర్వమందె
"వానిఁ గొనితేరుఁడీ ! సజీవములఁబట్టి"
యనుచు నానతిసేయ బోయలుసెలంగి. ౪౧

క. అహమిహమిక నా హంసల
గ్రహించి బహుమాన మందఁగా గొలనికడన్
విహరించుచుండ నం దొక
మహానిపుణు నురుల నవి ప్రమాదమునఁ బడెన్. ౪౨

క. వలఁజిక్కిన తముఁ గనుఁగొని
యలబలమొనరింపఁ దొడఁగె హంసద్వయ మ
య్యులివు విని లాఁతిపులుఁగులు
'కలిగెంబో! బెడఁద' యనుచుఁ గలకలకూసెన్. ౪౩

క. "విన కుంటిమి సచివోక్తులు
మనకతమున నిరువురికిఁ బ్రమాదము కలిగెన్;
ఒనరించుఁ బాపమొక్కఁడు
గనుఁ దత్ఫల మొక్కఁ డను ప్రకారమునఁ గటా! ౪౪

క. చిరజీవి పాపి; పుణ్యుఁడు
తరించు లోకంబు మిగులఁ ద్వరితంబుగ నం
దురు; మన ముంటిమి పాపుల
మరుగుదు రీ పుణ్యు లిరువు రమరనగరికిన్. ౪౫

ఆ. వె. పెద్దవారిబుద్ధి పెడతల నుండదే?
యనుచుఁ దెగడినార మక్కటకట!
పెద్దవారిమాట చద్దిమూట యటంచుఁ
దెలిసె"నంచుఁ దమ్ముఁ దిట్టికొనుచు. ౪౬

క. గుమిగొని యా పెఱపులుఁగులు
దమచేడుం బ్రగడయున్న తావుకుఁ జని నే
త్రములను బాష్పము లొలుకఁగఁ
దమశిరసుల వ్రాల్చి లజ్జితములయి నిలిచెన్. ౪౭

క. ధృతిఁగొని గభీరచిత్తత
గతమునకై వగవనేల? "కానున్నది యె
వ్వితమునను గాకమానద
క్షితి"నని హంసద్వయంబు చెందెను శాంతిన్. ౪౮

క. పుడమిని వేనిని నిడుములు
విడుచును? విధిరూపమైన పెనుసుడి యందుం
బడకున్న ప్రాణి గానం
బడ దొకటియు; దీని బుధులు పాటింప రెదన్. ౪౯

క. తము మూఁగుచున్న యా హం
సములను వలఁ జిక్కుకొనక సత్వరముగ దూ
రమునకుఁ బొ"మ్మని హంసయు
గము కోరిన నవియుఁ బోవకయు నట నిలిచెన్. ౫౦

క. ఒకరొకరిఁ జూచుకొనుచును
మొకముల వ్రేలించి యంచ మొత్తంబుండన్
వికసితచిత్తుండు కిరా
తకుఁ డేతెంచెను గ్రహింపఁ దద్యుగ్మంబున్. ౫౧

గీ. బోయనుం గాంచి యా వెల్లపులుఁగు లెల్ల
డాసి మెడ లెత్తి చంచూపుటములు సాఁచి
క్రేంకృతి పురస్సరంబుగాఁ గింకఁబూని
పొడవఁగా నల్వలంకుల మూఁగె లెస్స. ౫౨

గీ. అప్పు డాయంచకవ లాఁతియంచలఁ గని
"వలదు విడువుండు హింసన పద్ధతులను
మనల హింసించు వారినిం గనికరింపుఁ
డపకృతికినిం బ్రతిక్రియ యుపకృతిసుఁడీ!" ౫౩

క. అనుచున్ హితోపదేశం
బొనరింపగఁ దొలఁగె నవ్వియుఁ, గిరాతుం డొ
య్యన వానిఁబట్ట డాయఁగ
మనుజోక్తుల హంసయుగము మాటాడె నిటుల్. ౫౪

క. "అన్నా! కిరాత! యిదిగో
చెన్నారఁగ స్వాగతంబుఁ జేకొనుమయ్యా!
ఎన్నఁగ నే పురుషార్థము
మన్నింగొని మమ్ముఁ బొంద మదిఁ దలఁచితివో? ౫౫

క. తడయంగ నేల? కొని మా
యొడళ్ళు సాధింపుమోయి! యుత్తమపద; మీ
యొడళులు చరితార్థములగుఁ;
బుడమిని సఫలంబు మాదుపుట్టువు నగుఁజూ!" ౫౬

క. అని పలుకఁగ నా యెఱుకయు
విని యక్కజమొంది దెసలు వీక్షించియు వే
రినిఁ గనక యకట! "యంచల
తనువుం దాలిచిన దేవతలా? వీ"రనుచున్. ౫౭

క. భయపడుఁ బశ్చాత్తాపము
పయికొనఁ బట్టంగ; వెఱచువదలంగ నెదన్
బ్రయతించి డాయకయుఁ దన
మెయి కట్టియవాఱ నతఁడు మెదలక నిలిచెన్. ౫౮

క. నిలిచిన వానిం గని యం
చలకవ యనె "నోయి! మమ్ముఁ జంపుము చంపం
దలఁచిన వెస; నాలస్యము
కలిమికి నెత్తురు వఁటంద్రుగద! విబుధేంద్రుల్." ౫౯

క. నావుడుఁ గిరాతుఁ డిట్లను
"నే వేల్పులొ మీర ? లంచలే ? మిమ్ముల మా
భూవరుఁడు పట్టఁబంపఁగ
నే వచ్చితిఁ బారితోషికేచ్ఛ జనింపన్. ౭౦

క. కరుణింపుఁడు నను; వదలుదు
నరుగుండు యథేచ్ఛ" నన్న హంసయుగ మనెన్
"సిరి రా మోకా లొడ్డెదె!
దరిద్ర! కొంపోమ్ము! వాని దగ్గఱకు మమున్. ౭౧

క. అని కడు నిర్బంధింపఁగ
ననుకొనె నా బోయ "యీ మహాత్ముల మోయం
గనుటయు భాగ్యం"బనియును
"ననఘతయును నాకుఁ గలుగు"నని యనుకొనుచున్. ౭౨

క. ఆవెలిపులుఁగుల జంటను
గావడిఁగొని తన్ బునీతుఁగాఁదలఁచు చెదన్
క్ష్మావరుఁడు బ్రహ్మదత్తుని
తావుకుఁ గొంపోయెఁ బరపతంగము లఱవన్. ౭౩

క. కని బ్రహ్మదత్త భూపతి
మనమున హర్షించి తన శ్రమంబు ఫలించెన్
అనుకొని బహుమానించెం
దన తొడవుల నెల్ల నొలిచి తచ్ఛబరునకున్. ౭౪

గీ. క్ష్మాపతికిఁ దోఁచె రాయంచజంటయందు
నొక యలౌకిక మగు మహాజ్యోతి కనుల
నప్రయత్నంబుగా మోడ్చి హస్తయుగము
మోఁకఱిల్లెను బతి భక్తిపూర్వకముగ. ౭౫

క. అంతట బోయయు యావదు
దంతము వచియింప బ్రహ్మదత్త నృపతి య
త్యంతాశ్చర్య భయంబులు
స్వాంతంబున సందడింప శబరుని కనియెన్. ౬౬

క. "మునులో ? సురలో ? యేకా
రణముననో పుట్టినారు రాయంచలుగాఁ ;
గొనితిమి తెలియక; సరగునఁ
గొని వీనిని విడిచిరమ్ము కోరినచోటన్". ౬౭

క. అని నొడివియు నపచారం
బును క్షమియింపంగ హంసములఁ బ్రార్థించెన్
జనవరుఁడు బ్రహ్మదత్తుఁడు
పునఃపునర్వందనములఁ బొనరించెఁ దగన్. ౬౮

క. రాయంచదోయి ఛేనికి
బోయకు ధర్మైకవృత్తి, భూరిశుభంబుల్,
శ్రీయును, గలుగఁగ దీవన
లాయతముగఁ జేసి చనియె నాత్మేష్టగతిన్. ౬౯

క. జనపతికిఁ, గిరాతునికిం
బునీతచరితమగు హంసముల వరసంద
ర్శన మాదిగఁ గలిగెను శో
భనములపై శోభనములు బహు వత్సరముల్. ౭౦



# జాతక కథా గుచ్ఛము

ద్వితీయ భాగము

## మైత్రీబల జాతకము

క. ఆవిర్భవించె నొకపరి
క్ష్మావర వంశమున బోధిసత్త్వుఁడు దానన్
బావనమయి తద్వంశము
తావలమయి ధర్మదేవతకు విలసిల్లెన్. ౧

క. ఆ బోధిసత్త్వుఁ డిల మై
త్రీబలుఁడని పొంది నామధేయంబును బా
హాబల, ధీబల, ధర్మ
ప్రాబల్యములను వహించి పడసెను గీర్తిన్. ౨

క. తంగేటిజుంటి విధమున,
ముంగిటిముత్తియము చందమునఁ, బెల్లగు ముం
గొంగుంబసిండిరీతిఁ జె
లంగుచుఁ బ్రకృతిష్టుఁడై యిలాపతి యేలెన్. ౩

క. తరుణులు పాటలను, గవీ
శ్వరులు సుకావ్యముల, బుధులు స్తవములఁ, దగఁ జి
త్తరువులను జిత్రకారులు
విరచించిరి నాఁడు వాని వివిధచరిత్రల్. ౪

ఉ. తల్లులులేనివారలకుఁ దల్లియ తానయి ప్రోపుసేయుచుం,
బిల్లలులేనివారలకుఁ బిల్లఁడు దానయి ముద్దుఁ గూర్చుచుం,
గాళ్ళయి కుంటివారలకుఁ, గళ్ళయి గ్రుడ్డులకున్ సతంబు వ
ర్తిల్లెను రాజచంద్రుఁడు మదీయుఁ డటంచుఁ దలంప నెల్లరున్. ౫

క. ఏనుఁగుఁబోఁడియ తద్విభు
దానము, చట్టాలసురభి ధరణీశుఁ డఁటం
చానందింతురు లోకులు
భూనాథుం డిట్టిఁ డెపుడుఁ బుట్టఁడు పుడమిన్. ౬

క. ముట్టిన దెల్లయు ముత్యముఁ,
బట్టిన దెల్లయుఁ గడింది బంగారంబై,
తొట్టుకొనఁ బాడిపంటలు
దట్టంబుగ మనిరి ప్రజలు ధర్మబలమునన్. ౭

క. అత్యంతలోకమంగళ
కృత్యాధాయకుఁ డతండు గెరలెను "రాజా
ప్రత్యక్ష దేవతా" యను
నీత్యాలాపంబు నెగడ నిక్కంబగుచున్. ౮

గీ. కలదు చంద్రుని యందైనఁ గళఁకుగాని
యలఁతి కళఁకేనిఁ గానరాదయ్యె నౌర !
రాజచంద్రుని దగు చరిత్రంబునందు
నతఁడు జగదేకపూజనీయతఁ గొనండె ? ౯

క. సిరిసంపదలం దన దగు
పురము నతిశయింప వాసవుఁడు దురసూయా
పరుఁడై తద్రాజ్యముపై
ధరేంద్రుపైఁ గన్ను వేసె ధ్వంస మొనర్పన్. ౧౦

క. నహి యంట పరశ్రేయ
స్సహనము స్వర్గపతియైన శక్రునికిని; ని
మ్మహి లాఁతుల కత యేమిటి ?
సహనాదులు లేని సురత స్తవనీయంబే ? ౧౧

క. ఆతనిచేఁ బ్రేరితులగు
దూతలు రూపాంతరంబుతోఁ జని తద్భూ
నేతృని రాజ్యముఁ జొరఁబడి
గోఁతులు ద్రవ్వంగఁ బూనికొనియుండి రటన్. ౧౨

క. పురికొలుపుచుఁ గయ్యంబులఁ
బోరిఁబోరి యొండొరుల జుట్లు ముడివేసి, ప్రజం
బఱపుచు దుర్వ్యసనంబులఁ
జరియింపం గడఁగినారు శక్రుసి చారుల్. ౧౩

క. దూతలు విషబీజంబుల
క్ష్మాతలనాయకుని ప్రకృతిజనచిత్తములన్
లోఁతుగఁ బాఁతిన నంకుర
జాతము మొలకెత్త కందుఁ జచ్చుచునుండెన్. ౧౪

ఉ. అందఱు రాజభక్తిపరు; లందఱు సత్యవచఃపరాయణుల్;
అంద అహింసనవ్రతుల; యందఱుఁ బుణ్యచరిత్రులౌర! పౌ
రందర దూతబృంద మెట వ్రాలిన; గావివి మిన్నగుగ్గిళుల్
అందని యిన్నగుగ్గిళు లటంచుఁ దలంచిరి వార లత్తఱిన్. ౧౫

క. ప్రతికూలవాయువితతియె
ప్రతిదిశ వారలకు వీచెఁ; బాపులు కృతకృ
త్యత సాధింతురె? మేఘ
ప్రతిరోధము సాఁగునే తిరంబుగ రవికిన్? ౧౬

క. నిప్పులకుం జెదలంటని
యప్పగిదిని నెంత యెంతఁ బ్రయతించిన వా
రప్పుజలఁ బాపమంటద
యప్పటికిని మానరైరి యా జతనంబుల్. ౧౭

క. వారల మాయలు, మంత్రము,
లా రాజ్యప్రజలఁ బాఱ వని తెలిసి తుదిన్
ఆ జేని కెసరు వెట్ట వి
చారం బొనరించి రొక్క సమయమునందున్. ౧౮

క. 'సలుపుఁడు ధర్మ భ్రష్టుల
నిలాపతినిఁ బ్రజల మీర; లివ్విధి నిశ్శ్రీ
కు లయి చెడుదు'రని యింద్రుఁడు
పలికెను; వీరెంచి రవనిపతినిం జిదుమన్. ౧౯

ఆ. వె. ప్రభువు మెచ్చఁజేసి పారితోషిక మొందఁ
బ్రయత పడుచు నుంద్రు రాజభటులు
ఆకుఁ గోయు మన్న నామూలముగ సము
త్పాటనం బొనర్తు రి ధరణిరుహము. ౨౦

ఉ. పిమ్మట వారు మెత్తికొని వెల్మిడి దట్టముగా మొగంబులన్,
తొమ్మునఁ, గేలుదోయిని, శిరోధినిఁ దావళముల్ ధరించి, శీ
ర్షమ్మునఁ బెంజడల్ గొని, కరంబున గిండి వహించి మౌని వే
షమ్మున నా ధరాధిపతి చక్కటికిం జని రొక్క ప్రొద్దునన్. ౨౧

ఉ. వచ్చిన యా మునిబ్రువులవర్గము బత్తినిఁ గాంచి స్వాగతం
బిచ్చి శుభాసనంబు నిడి యెంచి స్వజన్మము ధన్యమం చెదన్
మెచ్చుచుఁ దన్ను భూపతి యనెన్ "భవదీయ పదాబ్జ దాసుఁడన్
ఇచ్చకు వచ్చినట్లు గ్రహియించి ననుం బనిఁ బెట్టుఁ"డం చొగిన్. ౨౨

క. అనుడుఁ బురందరదూతలు
మనమున శంకించుచున్న మాద్రిఁ బలుకకుం
డినఁ గని జేఁడనెఁ "దెలుపుఁడు
వెనుదీయక యిత్తు నొడలి విటిచియు" ననుచున్. ౨౩

క. అంతట వారనిరి "ధరా
కాంతా! తిరిగితిమి భూమిఖండము నఖిల
ప్రాంతముల; లేరు సాహస
వంతులు త్వాదృశులు భూమివరులం దొకఁడున్. ౨౪

గీ. పాపము లడంచి నిర్వాణపదవిఁ బొంద
సాధ్యపడ దెవ్వనికి నొక్క జన్మమందు;
దాన నజరామరంబైన తనువుఁదాల్ప
సాధ్యమయ్యెడి యగు నొక్కజన్మమందె. ౨౫

గీ. కాన నజరామరత్వంబు గలుగ నరుల
కొఱకుఁ దపమొనరింప నత్తఱిని మింట
మాకు వినఁబడె "రాడసృఙ్మాంసములను
గూర్చి యీ మందు మెసవ మేల్గూఱు" ననుచు. ౨౬

క. తెఱవంగ మేము గన్నులఁ
బురస్థలిని నౌషధంపుఁబ్రో వగపడియెన్;
దిరుగుచునుంటిమి లోకో
ద్ధరణంబునకై తదౌషధము రచియింపన్. ౨౭

క. లోకోద్ధర్తల మనుచుం
గేకలు వైచెదరు; గాని క్రియ కే రాజున్
దూఁకండ; గొడ్డువోయెను;
లోకమునఁ బరోపకారలుబ్ధత్వ మిసీ! ౨౮

క. వలయును రాజులరక్తముఁ
బలలము; గాకున్న మావి పడి నీయమె? రా
ట్తిలక! తృణప్రాయము లసు
వులు మాదృశులకును వేఁడఁబోదుమె? పరులన్. ౨౯

గీ. కాన నీమేనినుండి రక్తమును దీసి
మాంసముంగోసి యీవయ్య! మందుకొఱకు;
లోకము సముద్ధరించు సుశ్లోకి వీవు
బహువిధంబులఁ బ్రార్థింప వలయు నొక్కొ?" 30

క. అనవుడు భూవరుఁ డిట్లనె;
"మునులారా! నా శరీరమునఁ గల్గునెడన్
జనములకు మేలు కావల
సిన దున్నదె? యింతకన్న శ్రేయము గలదే? 31

క. మున్ను దధీచి యొసంగెను
వెన్నెముక నటంచు నేను విన్నది మొదలా
తెన్నునఁ బోనుంటిసి నా
పున్నెము ఫలియించె; మనసు మునిఁగెం బ్రీతిన్." 32

క. అని యపుడ పిలిచి వైద్యులఁ
దన యొడలినిఁ గోసి రక్తధారలు మాంసం
బును వలసినంత యిమ్మని
యనవద్యచరిత్రుఁ డాతఁ డాభాషించెన్. 33

క. విని యేతద్వృత్తాంతముఁ
జనుదెంచి నృపాలుకడకు సచివులుఁ, బ్రకృతుల్
కనుఁగవ స్రవింప నశ్రులు
మనములఁ దెగడుచును మునుల మనవిడి రిట్టుల్. 34

క. "మునిముచ్చుల మాటలు విని
తనువుం గోయించు టేటి ధర్మము? తనుమా
లిన ధర్మంబును మొదలుచె
డిన బేరం బుండునే? కడిందిఁ దలఁపుమీ! 35

క. పలుకుట్రలు గావించుచుఁ
బలువ లెవరో తిమ్మి బ్రహ్మి బ్రహ్మినిఁ దిమ్మిం
జలుపుచు మన రాజ్యంబును
గలంచుచున్నారు కొంతకాలమునుండిన్. ౩౬

క. వారే వీరై యుందురో ?
క్ష్మారమణా ! నిగ్రహింపుమా ! యీ పాపా
చారుల, నాపోశింపఁగ
వారలె నీ ప్రాణములను వచ్చిరో ? యిటకున్. ౩౭

క. వినము; నృపరక్త మాంసము
లను మందుం జేయునట్టిలాగు; నబద్ధం
బున కర్థమున్నె ? గ్రుడ్డికిఁ
గనఁగా ముక్కద్ద మున్నె ? క్ష్మాతలమందున్. ౩౮

క. పాపము రాని మ్మో నృప !
శాపము రానిమ్ము ! మా కొసంగుమి ! యానన్
బాపంబును గ్రక్కింతుము;
ఊఁపుదు మెల్లరము నాలు గూఁపులు వీరిన్. ౩౯

క. నావుడు నా మైత్రీబల
భూవరుఁ డిట్లనియెఁ; బుణ్యపురుషులు వీరల్;
ఈ విధి వాగ్దూషణములఁ
గావించినఁ గనులు వోవె ? కడఁగుఁడు కొలువన్. ౪౦

క. ఇంగల మొసంగి మనుజుఁడు
బంగారముఁ గొన్న పగిది బహుమలమయ మీ
యంగమున నమలకీర్తిఁ గొ
నంగాఁ దగదే ? వివేచనము సేయుఁ డెదన్. ౪౧

క. పుట్టిన ప్రతివాఁ డెట్టో
గిట్టును ; బున్నెంబుగాదె క్షితిహితముగఁ దాఁ
గిట్టిన ; నట్టి మనుష్యుని
మట్టి మహాతీర్థమృత్స్నమం బని తలఁతున్." ౪౨

చ. అని వచియించి వైద్యునికి స్వాంగమొసంగ, నతండు వాఁడి క
త్తినిఁ గొని మేని కండలను దీయుచుఁ బళ్లెమునందు నుంచు ; నిం
చును రుధిరంబు గిన్నియల ; క్షోణివిభుండు స్మితాననంబునం
గనుఁగొనుచుండ మంత్రితతి కన్నుల నిండఁగ బాష్పపూరముల్. ౪౩

క. కనఁబడె రక్తాశోకం
బన నాతఁడు రక్తసిక్తుఁడై యపు డా మూ
ర్ధనఖంబుగ ; నా కృత్రిమ
మునులకుఁ గన్నీరు పొంగి పొరలె నవశమై. ౪౪

క. ఆ రక్త మాంసములఁ గొని
వారలు దీవించి కపట భావంబునఁ ద
ద్భూరమణు సమక్షము విడి
పాఱి రదృశ్యత్వ మొంది స్వర్గంబునకున్. ౪౫

క. వారటు వోవఁగ ఱేని శ
రీరం బక్షతముఁ దొంటిరీతి సుదృఢమున్
సారమునయి తోఁచె సభా
స్తారులకును ధర్మదేవతాకృప కలిమిన్. ౪౬

ఆ. వె. దివ్యదృష్టిఁ గాంచి దేవేంద్రుఁ డిది యెల్ల
వెఱఁగుపడుచు ననుతపించి యెడఁద
నీరసంబు వదలి ధారుణీనాథుపైఁ
గురిసెఁ బారిజాత కుసుమవృష్టి. ౪౭

క. అతనిం జెఱచును ధర్మం
బెతండు ధర్మమును జెఱచు; నేతఁడు గాచుꣳ
అతనిం గాచును ధర్మము;
క్షితి నీ యాభాణకంబు సిద్ధముగాదే! ౪౦



# జాతక కథా గుచ్ఛము

## ద్వితీయ భాగము

## మహాబోధి జాతకము

క. మున్నొకపరి ప్రభవించెను
సన్నుతగుణశాలి బోధిసత్త్వం డొక సం
పన్నగృహస్థుని కడుపునఁ
బున్నియపుంబంట చందమునఁ బూజ్యుండై. ౧

క. జనియించెఁబో! యతఁడు బొ
డ్డున మాణిక్యంబుతో; నటుల్ కావుట నే
లను దింపక చేతులలోఁ
బెనిచిరి తలిదండ్రు లతనిఁ బేరిమి వెలయన్. ౨

క. జ్ఞానము వచ్చిన దాదిగ
స్వానూనైశ్వర్యభోగ మాశింప కతం
డూనెను సన్న్యసిత్వము
మాననమునఁ బూర్వపుణ్యమహిమము కతనన్. ౩

క. పంచశరత్ప్రాయమునఁ బ్ర
పంచ క్లేశంబులందుఁ బడక సుఖింపం
బ్రాంచిత మార్గంబు గవే
షించు చతఁడు యతులసేవ సేయం దొడఁగెన్. ౪

గీ. పితరు లాతని బంగారుపిచ్చుకగను
సలిపి యుంచిన వజ్రపంజరమునందు
నతఁడు కాషాయ భస్మంబు లభిలషించె
శైల కాననముల నివాసము వరించె. ౫

క. తొంబది తొమ్మిది యేండ్లు ప
యింబడ్డ జయింపజాల రింద్రియసముదా
యంబును విద్వాంసులు; బా
ల్యంబునన జయించె నీతఁ డనఘుఁడుగాఁడే ? ౬

క. ప్రాయంబుతోడ నా య
బ్బాయికి వర్ధిల్లుచుండె వైరాగ్యము; త
త్కాయంబుతోడ సుగుణని
కాయంబు ద్రఢిష్ఠమై ప్రకాశించెఁ గడున్. ౭

క. తరుణుం డాతఁడు పీడగఁ
గరపిడన మెంచె; గండకత్తెరగా సుం
దరి; నంపసెజ్జగా నను
విరిపాన్పును దలఁచి రోసివేసెను వీనిన్. ౮

క. మరలింపంగా నీతని
విరాగముఁ బ్రయత్నపడినఁ బితరులు కట్టా!
మరలదు; సికతాసేతువు
నిరోధ మొనరింపఁ జాలునే పెనువరదన్ ? ౯

క. కాలక్రమమునఁ బితరులు
కాలము సేయఁగ నతండు గల ధన మెల్లన్
గాలించి బీదసాదుల
పాలుగ నొనరించి యొక్క వనమున కరిగెన్. ౧౦

క. సెలయేఱు లొసఁగెఁ బాద్యము;
నలలతికావళి సుమార్ఘ్య మర్పించెఁ; గుజం
బులు ఫలసంతతి నిచ్చెను;
బులుఁగులు స్వాగతముఁ బాడెఁ బొరి నాతనికిన్. ౧౧

ఉ. అయ్యెడ నున్న శైలము బుధోత్తముఁ డీతఁ డటంచుఁ బైఁడికా
ళ్ళయ్య యటంచుఁ దన్మృదుపదాబ్జరజంబు ధరింపనెంచి పె
న్నెయ్యము వియ్యమున్నెఱపి నిల్పి స్వకీయ గుహాంతరంబునం
దయ్యతిచంద్రుఁ గొల్చెను మృగావళి కింకర పంక్తితోఁ దగన్. ౧౨

గీ. నాతి వృష్టిక నాత్యుష్ణ నాతి శీత
మై ప్రకల్పించె మునికి సాహ్యంబు ప్రకృతి :
అతఁడు యోగపరిభ్రష్టుఁ డగుటఁ దొల్లి
శీఘ్రముగనె తపస్సిద్ధిఁ జెందె నేఁడు. ౧౩

క. తనకు లభించిన జ్ఞానం
బను దివ్యామృత మొసంగి యగదంకారుం
డనఁ బాపరుగ్ణసంతతి
మనుపఁగ లోకమునఁ దిరుగ మహితుఁడు దలఁచెన్. ౧౪

క. చలివెలుఁ గవ్యాజ కృప
న్నొలికించి నిజామృతంబు నుర్విజ లతా
దులను వలె జ్ఞాని లోకం
బుల నప్రార్థితుఁడ జ్ఞానబోధలఁ బ్రోచున్. ౧౫

క. కరతలభిక్షల తోడను
దరుతలవాసంబుతో నతఁడు గ్రుమ్మఱుచుం
బుర నగరంబుల గ్రామై
కరాత్రముగఁ దుదికి డాసె క్ష్మావరు నొకనిన్. ౧౬

క. మేరువు దొరకిన కరణిని
భూరమణుం డలరి యా తపోధనముఖ్యున్
స్వారామంబున నొక పూ
టీరంబున విడియఁ జేసె నెంతయు బత్తిన్. ౧౭

క. ఆతఁడు రాట్ప్రార్థితుఁడై
చాతుర్మాస్యమగు దీక్ష సంకల్పించెన్
బ్రాతము మొద లాసాయం
జాతతమగు ధర్మములను వ్యాఖ్యానించెన్. ౧౮

క. "ఏదీ నరులకుఁ బసులకు
భేదము ధర్మప్రవృత్తి విడనాఁడిన నాఁ?
దేదీ! పండిత పామర
భేదము సత్పుణ్య పాప విజ్ఞత వెలిగాన్?" ౧౯

క. అని బహువిధ ధర్మంబుల
వినిపించె నతండు వింత విధములతోడన్
దొనలను దీసియుఁ గరమున
నునిచిన చందమున హృదయ మూఱటఁ గొనఁగన్. ౨౦

క. జరుగుచునుండఁగ నివ్విధి
ధరావరుఁడు విడిచి రాజ్య తంత్రంబు యతీ
శ్వరుఁ గొలుచుచుండె; నమృతము
మఱగిన జిహ్వకు గుడంబ మధురంబ కదా! ౨౧

క. కొలువఁడు తొలుతటి గురువులఁ;
గలియఁడు మున్నింటి చెలిమికాండ్రను; బోవం
దలఁపఁడు శుద్ధాంతమునకు;
సలుపుచు మునిపాదసేవ క్ష్మాపతి యెపుడున్. ౨౨

క. ఏతత్పరాఙ్ముఖత్వము
చేతస్స్పృహ్యంబు గామిఁ జేరి యొకట సం
గాతులు, మంత్రులు, గురువులు
క్ష్మాతలపతినిన్ మరల్ప సలిపిరి కుట్రన్. ౨౩

క. ఒకదినమున నా భూపతి
నికటమునకుఁ బోయి యెదుట నిలిచి ప్రణతితో
మొకముల ముడించి యని రి
"ట్లకటా ! యేమందుమయ్య ! యవనీనాథా ! ౨౪

క. పరదేశంబులఁ గ్రుమ్మఱి
యరుదెంచిరి నేఁడు వేఁగు ; లయ్యె కథలం
బరికింప గుండె చెదరెడు;
ధరేంద్ర ! నమ్మెదువో ? లేదో ? తగ మా మాటల్. ౨౫

క. మన రాజ్యముఁ గబళింపఁగ
గను వేసియుఁ బగఱు చాలఁగాలమునుండిన్
బనిచిరి యీ సన్న్యాసిని
మన కనులకుఁ గంతగట్టి మన్నెంబుఁ గొనన్. ౨౬

క. నల్లవి యెల్లను నీళులు
దెల్లవి పాలంచు నమ్మితిమి; యీతనికిన్
బెల్లేల ? కొక్కు వెట్టమిఁ
దెల్లమ ! మనగోయి మనమ తీయుగతి యగున్. ౨౭

క. ఇతఁ డైంద్రజాలికుండఁట;
అతిమాయలమారియంట; యకటా ! శత్రు
క్షితిపతులకు ని న్నిడి పా
రితోషికముఁ బొందునంట రేపో ! మాపో ! ౨౮

క. కనుఁగీటుచుండు నిచ్చటి
మనతొత్తుల; నిన్నుఁగాంచి మూరాడరు వా
రును; మిండతపసియాతఁడు;
చని రేలఁ దపం బొనర్చు జవరాండ్రకడన్. ౨౯

క. ఈ సన్న్యాసికి నేఁడే
యాసీమాంతంబుఁ జెప్పి యంపుము రాజా !
ఆ సూర్యచంద్రనభముగ
నీ సర్వంసహను నేలుమీ ! యొడయుఁడవై. ౩౦

క. మాకుందోఁచును మందో ?
మ్రాఁకో ? యా బోడతపసి క్ష్మావర ! పెట్టెన్
నీకును; గాకున్నను మ
మ్మీకరణి ననాదరించితే ? యెపు డేనిన్. ౩౧

క. తెలిపితిమి తెలిసినట్టిది
"తెలిసియు ముందేల నాకుఁ దెలుప ? "రటంచుం
బలుకుదు వని; దేవా ! చే
తులు గాలుడు నాకుఁ బట్టఁదొడఁగినఁ జన్నే !" ౩౨

ఉ. ఈ యుపదేశమున్ విని క్షితీంద్రుఁడు వారల నంపి చిత్తమం
దా యతి వచ్చునాఁటఁగొలె నాతని మాటలఁ జేఁత లందెవో !
చేయఁదొడంగె శంకలను జిత్త మశుద్ధమయేనిఁ దోఁచుఁ బో !
యీ యిలపై విరుద్ధముగ నెల్లదియున్ వచియింప నేటికిన్ ? ౩౩

క. గోరంతలు గొండంతలు
గా రచియించెను; మహాత్ముఁ గపటుం డనుచున్
వారలు వేసిన బీజం
బా రాజు నెడంద నాఁటె నతిగాఢముగన్. ౩౪

క. ఆముని నిశ్వాసంబును
భూమిపతికిఁ దోఁచె మోసముగ; దక్షిణమున్
వామముగఁ గానిపించుఁగ
దా ! మతిపోవుట ఖలోక్తితతిని జనులకున్. ౩౫

చ. ప్రతిదినమందుఁబోలె నరపాలవతంసుఁడు పోక ధర్మసం
శ్రుతికయి, వాని దిక్కయినఁ జూడక, పంపక భుక్తికై ఫల
ప్రతతియు, మాన్పి తత్సవిధవర్తులఁ గింకరులం గడున్నిరా
దృతి నొతరించె; దిట్టరులు తేఁడు లనుగ్రహనిగ్రహంబులన్. ౩౬

గీ. కడడె నొకనాఁడు; రెన్నాళ్ళు గడచె; జరిగె
నిట్లు మూన్నాళ్లు; గ్రహియించె నెల్లయు యతి
కరతలామలకంబుగా; ధరను ఋషుల
యాంతరంబైన దృష్టికి నడ్డమున్నె ? ౩౭

ఉ. అంతట నా యమీంద్రుఁడు మహాత్ముఁడు డగ్గఱి శాంతిమై ధరా
కాంతునిఁ "బోయి వత్తును సుఖంబుగ నుండుమి రాజ! ధర్మమున్
స్వాంతమునుండి వీడక ప్రజాపరిపాలనముం బొనర్పు; ధీ
మంతుఁడ వీవు చెప్పఁదగు మాటలు లేవిఁక వేయు నేటికిన్." ౩౮

క. అనుచును వచించి యాతఁడు
చనె వెనుకకుఁ దిరిగి చనక; సజ్జను లెద దూ
షణభూషణముల సమముగ
గణించెదరు; పైకి బల్కఁగడఁగరు లవమున్. ౩౯

క. చనుచున్న మౌనివైఖరిఁ
గని "యాతఁ డకృత్రిముఁడుగఁ గానంబడుచుం
డెను; మంత్రు లనిరి 'ధూర్తుం'
డని, తల్లక్షణ మొకండు నగపడకుండెన్." ౪౦

గీ. అని తలంచియు బుద్ధిమాంద్యమున మునినిఁ
బనిచి రాజ్య సుఖంబులఁ బడసియుండె;
బాణి యందున్న బెల్లంబుఁ బాఱవైచి
యాకు నాకిన యవివేకి యవ్విధమున. ౪౧

ఉ. ఆ ముని చన్ననాఁటఁగొలె నా పృథివీపతి రాజ్యమందు ను
గ్రామయ రూపదేవత సహస్రముఖంబుల విప్పి తత్ప్రజా
స్తోమము మ్రింగెడుం; గొలిపి తుందుడుకున్ మది నీతిబాధలుం
దామరతంపరయై చెలఁగి నైకవిధంబుగ నేఁచు భూపతిన్. ౪౨

క. పలువురు తనవలె యతినిం
దొలుతట సేవించు పండితులు, వృద్ధులుఁ, బూ
జ్యులు వచ్చి ఱేనిముంగల
నిలఁబడి కైమోడ్చి యి ట్లనిరి నిశ్శంకన్. ౪౩

క. "వెనుకాడుచున్న వారము
జనవర ! యిన్నాళ్ళనుండి సల్లాపింపం
గను మునిఁగూఱిచి; నీ చే
సిన పని గర్హ్యమని సాహసింతుము తెలుపన్. ౪౪

క. అపచారం బొనరించితి;
సుపరీక్షితుఁ జేయవైతి; శుద్ధచరిత్రున్
విపరీతుఁ డని వెలార్చితి
విపు దేని యెఱింగినావె యేతత్ఫలమున్ ? ౪౫

క. తమ ప్రాజాపత్యంబును
దమ గౌరవ మడఁగియుంటఁ ద్వత్సచివాదుల్
కుమతులు కుత్రను బన్నిరి;
తమ రెఱుఁగమి యిట్టి యాపద తటస్థించెన్. ౪౬

క. నిలుకడమీఁదను నిక్కము
దెలియు ననియుఁ; ద్రవ్వఁద్రవ్వఁ దేలును దథ్యం
బిల ననియు నంద్రు; పాపము
వెలివిఱియక దాఁగదెపుడుఁ బృథివీనాథా ! ౪౭

ఆ. వె. దైవవిగ్రహంబుఁ దలఁచి రాయి యటంచుఁ
ద్రోసిరాజుఁ జేసివేసినావు;
జనుల కెవుడు నచ్చు సదుపదేశము కన్న
దురుపదేశ; మందుఁ దొరఁగుఁదేనె. ౪౮

క. చెప్పందగ్గది తప్పక
చెప్పవలయు ననుచు నీదు శ్రేయోఽర్థులమై
చెప్పితిమి; తలం దఱిగిన
నిప్పుడు సిద్ధముగ నుంటి మేలా పెక్కుల్ ?" ౪౯

క. అని వచియింపఁగ భూపతి
విని సచివులఁ గబురుసేసి పిలిపించి నిద
ర్శన మడిగి వారి మోసముఁ
గనుఁగొని దండించి బందిఖానా నునిచెన్. ౫౦

క. మదిఁగొని పశ్చాత్తాపము
వెదుక దెసల కనిపె ఱేఁడు వేఁగులవారిన్
వెదకినఁ గనరాఁ డయ్యెను;
నదుపాజ్ఞల నుందురే మహర్షు లొకయెడన్ ? ౫౧

క. నానామతస్థు లొకపరి
ఱేనిం దమ మతమునకును ద్రిప్పఁగ నేవే
వో నూతన ధర్మంబులఁ
బూనిరి కఱపఁగ బ్రమాణము లివే యనుచున్. ౫౨

క. తలవని తలఁపుగ నా యతి
పొలుపుగ ధర్మప్రచారమునకై నల్ది
క్కులఁ దిరుగుచు నానాఁ డీ
యిలాధిపతి కొలువులోని కేతెంచెఁ దగన్. ౫౩

క. తన్నవమానించెఁగదా !
ము న్నీ మన్నీఁ డఁటంచుఁ బొందక యలుకన్
మన్నించివచ్చెఁ గూర్పఁగఁ
బున్నెము; మానావమానములు ఋషి కున్నె ? ౫౪

ఉ. వచ్చిన దౌలఁగాంచి నరపాలుఁడు గద్దియ డిగ్గి మౌనికిన్
నిచ్చలమైన బత్తిమెయినిం జని సన్నిధి కర్ఘ్య పాద్యముల్
ఇచ్చి క్షమాపణంబు వచియించియు మ్రొక్కఁగఁ దత్సభాస్థ వి
ద్వచ్చయ "మీతఁ డెవ్వఁ"డని వానినిఁ గాంచుచు నిల్చె ఱిచ్చమై. ౫౫

క. పిమ్మట రాజప్రార్థితుఁ
డమ్ముని సభఁగూరుచుండి యచట నుపన్య
స్తమ్ము లగు వివిధబుధ ధ
ర్మమ్ముల నాపాత సుమధురమ్ముల వినియెన్. ౫౬

ఉ. ఒక్కఁడు సాంఖ్యవాదము, మరొక్కబుధుండు విశేషవాద, మిం
కొక్కఁ డపూర్వవాదము, నహో ! మరొకండు స్వభావవాద, మీ
ఫక్కి నఖండచర్చ జరుపంగఁ బ్రతిధ్వని యిచ్చునట్లు న
ల్దిక్కులు బోధిసత్త్వుఁడు తుదిన్ వచియించెను దత్సమాధులన్. ౫౭

క. ఆతండు మరియు నొడివెను
"శ్రౌతం బగు యజ్ఞకర్మచయము వృథసుఁడీ !
ఘాతుకములు గావే యివి ?
యే తీరున స్వర్గ మబ్బు నీ కర్మములన్ ? ౫౮

క. నరుఁ డజ్ఞానపుఁ బశువుం
బరిమార్చుట కన్న నన్యమఖ మొకఁడున్నె ?
పరమార్థంబు గ్రహింపరు
నరులు గతానుగతికులు మనస్వుల యయ్యున్. ౫౯

క. కలఁడా ? లేఁడా ? యను చ
ర్చలు పరమాత్మం గుఱించి ప్రారంభింపన్
వలవదు రిత్తఁగ; మీ తృ
ష్ణల నార్పఁగ నలుపుకొనుఁడు జతనము మీరల్". ౬౦

మ. అని నానాగతులన్ స్వధర్మమును వ్యాఖ్యానింప నమ్మౌనివ
ర్యుని సాష్టాంగముగ్రొక్కి రా కొలువునం దున్నట్టి యాయాబుధుల్;
ముని యాదేశమునన్ నృపుండు వదలెన్ బూర్వంబు గారాగృహం
బున బంధించిన మంత్రిముఖ్యులను సద్బుద్ధిం గొనన్ వారొగిన్. ౬౧

క. ఆనాఁటఁగోలె తేఁ డా
మౌనినిఁ గులదేవతగను స్మరియించును; స
మ్మానించు స్వాంతమున; సం
ధానించుఁ దదుక్త పుణ్యధర్మము సతమున్. ౬౨



# జాతక కథా గుచ్ఛము

## తృతీయ భాగము

### మేషజాతకము

గీ. వారణాసీపురిం దొల్లి బ్రాహ్మణుండు
పావనుఁడు వేదవేదాంగ పారదృశ్వ
గలఁ; డతఁడు సల్పఁబూనె యాగం బొకండు
"స్వర్గకామో యజేత" యన్ శ్రౌతవిధిని. ౧

గీ. దేశదేశంబులందు నార్త్విజ్యమందు
నందెవేసినచేతుల నరసి తెచ్చి
యెల్ల యజ్ఞియవస్తువు లేర్చికూర్చి
మంచిమూర్తంబునందు దీక్షించియుండె. ౨

క. కొనితెచ్చి నల్లమేఁకను
బునీత మొనరించి మంత్రముల యూపమునం
బనుపడ బంధించియు విశ
సనము సలుప ఋత్విజుండు సన్నద్ధుఁడుగాన్. ౩

క. మరణోన్ముఖమగు నయ్యజ
మరుదుగఁగావించి యట్టహాసంబును, ను
త్తరమగు క్షణముననే బి
గ్గరగాఁ గన్నీరు గాల్వగట్టఁగ నేడ్చెన్. ౪

క. యజమానుండును ఋత్విజు
లజకృతమగు నవ్వు, లేడ్పు లర్థముగా క
క్కజపడి యితికర్తవ్య
త్వజడంబుగ నొండొరువులఁ బరికించిరొగిన్. ౫

గీ. మాని మారణకర్మంబు మౌనమూని
నిలువఁగఁబురోధ, డెందంబుగలఁగఁబాఱ
గద్గదిక నంత యజ్వ భాగంబు నడిగె
"ఎవర ? వీనవ్వు లీ యేడ్పు లేల ? చెపుమ. ౬

గీ. దృష్టచరమేని శ్రుతచరంబేనిఁగాద
నీదుచందంబు, గలిగెఁబో ! నింద్యమైన
యంతరాయంబు నీవల్ల;" ననుడు, నజము
మరల నవ్వియు నిట్లని మాఱువలికె. ౭

"ఓవిప్రా ! విను ! నేను నీవలెనె మున్నుర్వీసుపర్వాన్వవా
యావిర్భావమునొంది కర్మఠుఁడనై యజ్ఞంబుఁగావించి సీ !
ఏవంబొందక మాదృశంబు నజమున్ హింసించితిన్; దానికై
గా వైతిం జనియించి చాగమయి నైకంబైన జన్మంబులన్. ౮

ఆ. వె. ఐదునూర్లసారు లవని జన్మించితి;
యజ్ఞపశువనైతి నన్ని సార్లు;
దోసమలఁతిగానె దోఁచునుగాని కొ
లందియున్నె ? తత్ఫలంబు గుడువ. ౯

కం. ఇది నా తుదిజన్మము సూ !
వదలును నీదయను నాదు పాపంబని స
మ్మదమొంది పెద్దనవ్వితి ;
ముదమొదవదె ? బరువుదీఱిపోవుచునున్నన్. ౧౦

గీ. పాప ! మయ్యయ్యొ ! నావలెఁ బలుతడవలు
మేషమయి నీవు జన్మించి మేదినిపయి
యాగపశువౌదువంచు నీయార్తిఁదలఁచి
యెడఁద వగులంగ నట్టు బిట్టేడ్చియుంటి." ౧౧

కం. అనవుడునయ్యజమానుఁడు
మనసుఁ గుదించుకొని దానిమ్రందింపక ని
ల్చినఁగాంచి మేఁకవలికెను
"ననుఁజంపక యీవిలంబనంబేల ? బుధా ! ౧౨

గీ. తమకపడుచుంటిని నికృష్టతనువు విడిచి
ముక్తిఁబొందంగ; నాలస్యమునకు సైఁపఁ;
జంపు ! చంపుమ"యని పెద్దసాఁచి మెడను
విడిచి యూపంబు నాతనికడకుఁ బఱచె. ౧౩

ఆ. వె. మేఁకడాయు కొలఁది మేదినీదేవుండు
వెనుకవెనుక కడుగు వేయఁదొడఁగెఁ;
'జంపు'మను నజంబు; 'చంప'నంచు వచించుఁ
బాపభీతివుట్ట బ్రాహ్మణుండు. ౧౪

గీ. తలవనితలంపుగావచ్చి ధర్మమూర్తి
యచ్చటికి బోధిసత్త్వుఁడత్యాదరమున
వారిచే సత్కృతుం డయి వారి కథలు
విని వచించెను భూసురేంద్రునికిఁ బ్రీతి

గీ. "ఓయి ! నీవెంటగొని దీని నుర్వియెల్ల
సంచరించుచు యాజ్ఞిక సంచయమున
కుచితబోధలు గడిఁదిసేయుచును, మాన్పి
జీవహింసను బుణ్యమార్జించికొమ్ము." ౧౬



# జాతక కథా గుచ్ఛము

తృతీయ భాగము

## రాజవాద జాతకము

గీ. బ్రహ్మదత్తుండు గాశికా పత్తనంబుఁ
బాలనము సేయు తఱి వాని పట్టమహిషి
గర్భమున బోధిసత్త్వుఁ డావిర్భవించె
సర్వకల్యాణగుణసముచ్చయముతోడ. ౧

ఆ. వె. దినదినాభివృద్ధిఁ గనుచు నా బాలుండు
శుక్లపక్షచంద్రు శోభనొంది
కరముఁ బ్రకృతితతికిఁ గనువిందు, సెవివిందు
సలిపెఁ దనదు నందచందములను. ౨

గీ. ఒక్కనాఁ డక్కరంబుల గ్రుక్కఁబట్టి,
గుణితముల నొక్కనాఁడు మూర్కొని, యతండు
పాఠ్య పుస్తకముల నొక్క పాటఁబాడి
కొలఁదినాళులఁ జదువులకొలఁదులంటె. ౩

గీ. సకలకళలందు సర్వశాస్త్రములయందు
రాజ్యతంత్రంబున నతండు రాసికెక్కె
శైశవమునందె ప్రాపించి కౌశలంబు
పిల్లమిరియం బితండని యెల్లరాడ. ౪

మ. పితృపైతామహమైన రాజ్యమది ప్రాప్తింపఁగఁ బట్టాభిషి
క్తత యుక్తంబగు కాలమందెనసి సద్ధర్మంబు లోకంబునం
జతురంశంబుల జాగరూకమయి మించంజూచుచుఁ భాగ్య దే
వత రూపొందె నటంచు స్వప్రజ నుతింపంబొల్చె వాఁడున్నతిన్. ౫

శా. న్యాయస్థానములెల్ల శూన్యములుగా నయ్యెఁ గా సమస్తప్రజల్
న్యాయాధీశులు, సర్వగేహములు న్యాయస్థానముల్ కావుటన్ ;
ఆయుర్వేశుఁడు విష్ణుఁ; డా జనులమర్త్యౌఘంబు, వైకుంఠ మో
హో ! యా భూపతిదైన రాజ్యమును వేయుంజెప్పగా నేటికిన్ ? ౬

గీ. కబ్బములనల్లి పాటలుగా రచించి,
కథలుగా గ్రుచ్చి, తగనాటకములు వ్రాసి,
యా మహీపతి చారిత్ర్య మహరహంబుఁ
బ్రీతి దళుకొత్త బుధులు వర్ణించుచుండ్రు. ౭

సీ. రచ్చల లోకాభిరామాయణంబుల
నాడు చిల్లరమూఁకఁ గూడి మాడుఁ;
గడిఁది విస్రబ్ధంబుగా మంతనములాడు
పెద్దలతో వాదుపెట్టి యాడుఁ
బరిషత్తులకుఁజొచ్చి పార్షదులకుఁ బ్రతి
ద్వంద్వియై చర్చలం బాలుగొనును;
బానశాలల నసంబద్ధ ప్రలాపముల్
వదరు నున్మత్తుల పలుకులు విను ;
గీ. దినదినము నొక్క యవతారమును ధరించి
యా ప్రభుండు భ్రమించు నహర్దివంబు
నేలనాలుగు సెఱఁగుల నిష్ఠమెయిని
స్వీయ దోషంబులను గవేషింపఁదలఁచి. ౮

మ. అతఁ డట్టుల్ చరియించుచుం గని స్వరాజ్యక్షోణిపారంబు, హ
ర్షితుఁడై యాత్మగుణప్రశంస, మరలం జేరంగ స్వగ్రామ మే
గుతటిన్ గోసలరాజు సద్గుణ సమగ్రుండీ నృపుండట్లు, స్వ
క్షితి రాజ్యంబున యందుఁ గ్రుమ్మఱుచు వచ్చెన్ మెల్ల నచ్చోటికిన్. ౯

క. ఎదురయ్యె వారి యరదము;
లది యిఱుకగు బాట యగుట నవకాశము లే
దొదిఁగిచన; సూతు లిరువురుఁ
గొదికిరి తమ తేర్ల వెనుకకును నడిపింపన్. ౧౦

గీ. అలఁతి తడవప్లై నిలిచి కోసలమహీంద్రు
సారథి వచించెఁ గాశీశు సారథికినిఁ
"త్రిప్పుమా! వెన్క దెసకు నీ తేరు వెసను
సార్వభౌముం డితండు కౌసలుఁడు సుమ్మ! ౧౧

గీ. అంతఁ గాశీశ్వరుని సూతుఁ డాడె నిట్లు
"సార్వభౌముండు గాశి భూజాని యితఁడు"
నీదు నరదంబె వెనుకకు నెట్టవోయి!
ఇప్పటికె చాలఁ బ్రొద్దయ్యె నేగవలయు" ౧౨

గీ. ఇట్టు లిరువురు నీవునీవంచుఁ గొంత
తడవు వాదాడి తుదికిట్టు ధర్మ నిర్ణ
యం బొనర్చిరి; "ఇర్వురియందుఁ బిన్న
బాట నొసగంగవలెఁ బెద్దవాని" కనుచు. ౧౩

చ. అరయఁగ వారియిర్వురి వయస్సు సమానమెయయ్యెఁ; బెద్ద రా
చటికముఁబట్టి తేల్పఁదలఁచం దులఁదూగిరి వారు; వంశపుం
గరిమముఁ బేర్కొనన్ నృపయుగంబు సరాసరియంచుఁ దేలె; నె
క్కరణిని ధర్మనిర్ణయము గావలెనో కద! యిట్టి పట్టునన్. ౧౪

గీ. అంతఁ జోదకు లిద్ద ఱొక్కింత తిరిగి
కలిసి యోజించి గుణ్యుండె గణ్యుఁడిలను;
గాదు ప్రాయంబు; రాచటికంబుగాదు;
వంశ గౌరవ మేనియుఁ గాదుగాదె! ౧౫

గీ. కాన గుణవంతుఁడైన క్ష్మాజాని కిచట
దారి నొసఁగుట యుక్తియుక్తం బటంచు
నిశ్చయించిరి; కోసల నేతృసూతుఁ
డోలిఁ దనతేని గొనము లిట్లుగ్గడించె. ౧౬

శా. "దండించుం గడు దండ్యులన్ జముని చందంబున్ విడంబించు చు
ద్దండుండై; తగఁ బ్రోచు సాధుజన బృందంబున్ దయాంభోధి వి
ష్ణుం డట్టుల్; ప్రజలొజ్జుగాఁ దలఁచి రాజున్ మెత్తవానిం జెవుల్
పిండుం; గావున నాతికర్కశతఁ జూపించున్ మనోవాక్కులన్. ౧౭

క. అరులకు సింహస్వప్నము;
సరసుఁడు; చుట్టాల సురభి; సజ్జనతతి కె
త్తఱి ముంగొంగుఁ బసిఁడి మా
ధరావరుఁడు; కాన మాకు దారిని నిమ్మా!" ౧౮

ఆ. వె. అనుడుఁ గాశిరాజు యంత కోసలరాజు
తేరిఁ దోలువాని దెసకుఁ దిరిగి
నిరసనంబుఁ దెలుపు చిఱునవ్వు నవ్వుచుఁ
దనదుతేని వృత్తమును వచించె. ౧౯

సీ. "దండింపఁడ యవశ్య దండ్యుల నేనియు
క్షాంతిమైఁ దద్బుద్ధి సంస్కరించుఁ;
దనదు వాఙ్మనసంబు లనయంబు నవనీత
రచితంబులట్లు మార్దవముఁ బూను
మహిత సత్త్వస్ఫూర్తి నహిత బృందం బాత్మ
హితబృందముగఁ బరిణతమొనర్చుఁ
దనవారు లాఁతివారను భేదమెఱుఁగని
చేతన్నరములేని దాతృతఁదగుఁ

గీ. గోప మెఱుఁగఁడు; సెవియొగ్గి కొండియములు
వినఁడు; సత్యవ్రతంబును విడువఁ డెపుడు
తేండ్లపై తేఁడు; భృత్యుల భృత్యతరుఁడు
మా ప్రభూత్తంసుఁడిమ్మోయి! మాకు దారి." ౨౦

ఆ. వె. ధర్మపరుఁడు మీదు ధరణీవిభుండు; స
ద్ధర్మపరుఁడు మాదు ధరణివిభుఁడు
అడరు నిరువురందుఁ గుడి యెడమల భేద;
మిదియ నిర్ణయించు హెచ్చుఁ దచ్చు. ౨౧

శా. కాశీ భూపతి చారుచర్యను సమాకర్ణించి యా కోసల
క్ష్మాశానుం డట సూతుతో దిగి రథం, బేతెంచి పెం బత్తిఁగా
శీశాంఘ్రిద్వయి వ్రాలి, "నా కితఁడు లక్ష్యభూతుఁ"డం చెంచి పీ
తాళంకం దనతేరునెట్టుమనియెన్ యంతన్ వడిన్ వెన్కకున్. ౨౨

క. వరవడిగాఁ గైకొని త
చ్చరితముఁ గోసల మహీశచంద్రుఁడు లోకో
త్తరుఁడగు కాశీవసుధా
పురందరునకుఁ బ్రతిబింబముగ నయ్యెఁ దుదిన్. ౨౩



# జాతక కథా గుచ్ఛము

## తృతీయ భాగము

### గజజాతకము

క. ఒకతూరి బోధిసత్త్వుం
డొకానొక యరణ్యమందు నుదయించి గజా
ర్భకమై క్రమముగఁ బెద్దై
యకళంకచరిత్ర వడసి యౌవన మొందెన్. ౧

ఆ. వె. కండక్రొవ్వుదేఱి గాత్రంబు చతురస్ర
శోభియగుటఁ గడిదిఁజూచి వలచి
దాని డెందమెక్కి ధర్మదేవత నిల్చె
రమణివోలె నిండుప్రాయమందు. ౨

క. కలియదు మత్తగజంబుల;
మలీమసపువృత్తిఁ బోదు; మౌనివితమునన్
గొలఁకుల నీరాడుచు నా
కులు మేయుచుఁ జెట్లనీడఁ గ్రుమ్మఱుచుండెన్. ౩

సీ. జవసత్త్వము లడంగి పసిదప్పి యెత్తువ
డ్డట్టి జంతువుల నర్హముగఁ గొలుచుఁ;
దమతల్లికై తప్పి తారాడు బిడ్డలఁ
గనికరంబు వహించి జననిఁగూర్చుఁ;
క్షుత్పిపాసార్తియై క్షోభిల్లు మృగపంక్తి
కామిషాంబువుల బిట్టరసి తెచ్చుఁ;
దనదు ప్రాణంబుల వినిమయం బొనరించి
మృతజంతువులఁగావ మతిఁ దలంచు;

ఆ. వె. ప్రాణితతికి మేలు పచరించుతఱి స్వీయ
గాత్రయష్టి సురభిగంధి యట్ల
కానివేళఁ బూతిగంధి యట్ల తలంచి
యెదురుసూచుఁ బరుల గొదలు దీర్ప. ౪

క. తన యందచందములఁ గని
తను నహమహమికను వలచి దర్పోత్సేకం
బున వచ్చు కరేణూతతిఁ
గని యయ్యువగజము రాతిగతిఁ గలఁగదెదన్. ౫

క. కని దాని యనుత్తమ వృ
త్తిని నవ్వనమృగములెల్ల దివ్యగజముకాఁ
గొని మది నభిషేకింపం
గను దమ యూథాధినాథుగా నున్నంతన్. ౬

గీ. అక్కరీంద్రుండు పసివట్టి యవ్వితంబు
నిస్సిరో! నాకు నీ పీడయేటి? కనుచు
వీడి యచ్చోటు దెలుపక వేరితోడ
దూరమందున్న యొక్క యెడారిఁజేరె. ౭

సీ. తొలి యగస్త్యుఁడు నీరు చుఱుకించి త్రావంగ
బయలైన కంధ్యదోభాగ మట్లు
ఇనుపగజ్జెలతల్లి యేకాతపత్త్రయై
శాసించుచున్న రాజ్యంబు నట్లు
పఱతెంచి మును గిరుల్ గఱులతో వ్రాలిపోఁ
బెంపెల్ల నడఁగిన పేఁటయట్లు
ప్రళయంబునందెల్ల ప్రాణిబృందము నూర్చు
కటికకాలుని పెద్దకళ్ళమట్లు

గీ. పేర్మివెలియైన శుష్కజీవితము నట్లు
నైదువతనంబు దొలఁగిన యవని యట్లు
ధరఁగృతఘ్ను నసారచిత్తంబు నట్లు
నకట! మది కేవఁబుట్టించు నయ్యెడారి. ౮

క. అడుగులు దిగఁబడి సాఁగవు
నడకలు; సుడిగాలి పిండునకు నయ్యెడ నే
ర్పడు మేటియిసుకవాముల
నడంగుఁ బయనించు ప్రాణి యమ్మరుభూమిన్. ౯

శా. ఆనిప్పచ్చర మేలుచున్న భువియం దాహస్తి కాఁపుండి య
ద్దానిం దాఁటఁగరాక కస్తిపడు తత్తజ్జంతుజాలంబునుం
బైనిం దాలిచి మోయు; దూప నుడుపన్ వార్ధారలం దెచ్చి తొం
డానన్; గ్రాసమొసంగు నెట్టొ! దయదొట్టన్ బిట్టు డెందంబునన్. ౧౦

క. దొరకఁదిను నింత రొడ్డను
దొరకనియెడఁ బస్తువడియుఁ దూలుచును గడుం
దఱితో దగ్గఱి లగ్గుగఁ
బరిచర్య లొనర్చుఁ బ్రాణివర్గంబునకున్. ౧౧

చ. ప్రతిదినమందుఁ బోలె గజరాజ మెడారిఁ జరించుచొక్కనాఁ
డతితమమైనయార్తరవ మక్కట! యొక్కటి నాలకించి య
ద్భుతపడి దానితత్త్వ మెదఁదోఁపక దిక్కులు సూచుచుండ దు
ర్గతులయి వచ్చు దీనజనకాండము గన్పడె దవ్వుదవ్వులన్. ౧౨

క. కని యేయుత్పాతము గ
ల్గెనొ? కట్టా! యెల్లవారికి? నటంచు మదిన్
వనరుచు "వీరల సేవిం
చిననె కృతార్థంబు నాదు జీవిత" మనుచున్. ౧౩

క. ఎదురుగఁ బోవుచు నుండఁగ
సుదూరమున గజముఁ గాంచి చొప్పఱి యెంతే
నదవదపడి నలుదెసలకు
యథాయథలునయ్యు నంగలార్చుచు వారల్. ౧౪

క. "ముంగల నుయ్యియు నిఁక వెను
కంగొయ్యియు ; నెచటి కేగఁగల ? మక్కట ! కీ
డుం గీడు వెంటనంటెను
ముంగటి మన యెల్లపాపము ఫలించె నిటుల్." ౧౫

క. అని యితికర్తవ్యతదోఁ
పని చిత్తముతోడ, విన్నఁబాటెంతయు నొం
దిన మోముతోడఁ, జిడిముడి
గొను నడుగులతోడ, గోడు గుడుచుచునున్నన్. ౧౬

మ. తన తొండంబును బైకి నెత్తియుఁ గరీంద్రం బివ్విధిన్ మర్త్యభా
షను వాక్రుచ్చె "భయంబుఁ బొందకుఁడు లేశంబేని; మీ కూర్చువాఁ
డను ముమ్మాటికి నమ్ముఁ; డీ రెవ ? రనిష్టంబేమి ? మీ రిట్లు క్రం
దనముల్ సేతురు; మీ ప్రయాణ మెట ? కింతం గూర్మిమైఁ దెల్పుఁడీ ! ౧౭

క. మిముఁ గొలుతు యథాశక్తిగ;
స్వమిత్రుఁగాఁ దలఁచి నన్ను భవదాపదలన్
సమముగ భాగం బొసఁగుఁడు ;
భ్రమింపకుఁడు మిమ్ము మ్రింగు రాక్షసి నంచున్. ౧౮

క. అను నయ్యేనిక పలుకులు
జనులందఱు నాలకించి శాంతంబగు రూ
పును గని విస్రంభంబును
గొని యొక్కొక్కరుగ వచ్చి కూడిరి దానిన్. ౧౯

గీ. అంత నా బాటసారులయం దొకండు
నొడివె నా దంతితోడ "మా పుడమియొడయఁ
డకట! మమ్ముఁ బ్రభుద్రోహులనుచుఁ గినిసి
పాఱఁదోలించె నీ పెన్నెడారి కిపుడు. ౨౦

మ. చెవిఁబెట్టండు జనార్తనాదముఁ; బ్రజాక్షేమంబుఁ బాటింపఁ; డు
క్కివులై బీదల రక్తమాంసములఁ గుక్షిన్నింపు నుద్యోగులన్
అవలంబించి ప్రభుత్వము న్నెఱపు మర్యాదన్ విలంఘించి; యీ
భువి గావించిన పాపమేమొ కద! భూపుల్ కల్గ నేతాదృశుల్? ౨౧

క. నెఱవాఁడిముల్లు పైఁబడి
చెఱచునొ? తమ్మంచు దరికిఁ జేరక మనున
య్యరఁటాకుల వడువున మా
దొర దృష్టిఁ దొలంగి బ్రదుకుదుము మే మెపుడున్. ౨౨

శా. ఏకగ్రీవముగాఁ బ్రభుం దఱిసి మా యిక్కట్లుఁ, జిక్కట్లు, మా
మా కైక్కట్లును విన్నవించుకొనఁ బో క్ష్మానాథుఁ డీక్షించి మా
రాకం "గట్టిరి కత్తి నా పయిని వీరల్; వీర్ప్రభుద్రోహు; లీ
మూఁకన్ సర్వరథంబుఁ దోఁచుకొని పోమొత్తుండు దౌదౌలకున్." ౨౩

క. అని రూక్షకంఠమున దు
ర్జనుఁ డాతఁడు నొడువ భటులు సర్వస్వంబుం
గొని మమ్ముఁ దోలి రచటికిఁ
దిని ధూళిని, ద్రావి గాలి దిక్కఱి చావన్. ౨౪

గీ. ఆకలంబులు మేయుచు నచ్చటచటఁ
బడియనీరాని చట్రాలఁ బండుకొనుచు
నిట్లు మున్నాళ్లనుండి మేమిందఱమును
బయన మొనరించుచుంటిమి బడలివడలి. ౨౫

గీ. తిండియుందీర్థ మొదవమి, నెండఁ గడుపు,
పచ్చిపుండయి కాళులు నొచ్చుచుండ,
నకట ! కదలంగ మెదలంగ ననువుగాక
బ్రదికియుంటిమి జీవచ్ఛవంబు లట్లు. ౨౬

మ. తినఁగా నాకులుఁ, ద్రావఁగా జలము, మధ్యేమార్గ మొక్కొక్కచోఁ
గనరామిన్ వడదాఁకి కొంద ఱడవిం గారాకులై ; రెందఱో
పెనుకార్చిచ్చున మ్రగ్గి; రేమిటులు బెంబేలొప్పుచున్నాము; మా
జన మేనూఱవు; దిప్పుడుంటిమి దశాంశంబందుఁ; జూడంగదే ! ౨౭

క. నినుఁ గని యమదూతనుగా
మనంబు వెఱపొందె మొదట; మా చెవుల సుధల్
చినికినపలుకులచొప్పును
విని మా యిలువేల్పువంచుఁ బేర్కొంటిమి నిన్. ౨౮

ఆ. వె. నీదు బుజ్జవముల, నీ కృపాదృష్టుల
మాదు దుఃఖమెల్ల మఱచినాము;
నవ్యమైన చేతనత్వంబు సమకూరె;
నగము బలము గాదె సంతసంబు ? ౨౯

క. దప్పితి మాఁకలిదప్పులఁ
గ్రుస్సితి; మియ్యెడల మాకుఁ గ్రోలఁగ నీరున్
లెస్సగఁ, దిండియుఁ జూపుము;
నిస్సీమపుఁ బున్నెమబ్బు నీ కనఘమతీ !" ౩౦

శా. ఆ మూలాగ్రముగాఁ దదీయమగు వృత్తాంతంబు నాలించి భూ
స్వామిక్రోధదవానలంబునఁ దృణప్రాయంబుగా మ్రగ్గు త
త్ప్రేమంబుం బ్రదికించుటె ? ట్లని కృపాచుంచుండు వాపోవు చా
భూమీశాధముఁ దూఱు బొక్కతృటిసేపుం బుచ్చి నెయ్యంబునన్. ౩౧

మ. తన తుండాగ్రము నెత్తిచూపుచు "నిగో! దర్శింపుఁడీ! దవ్వులన్
ఘనమై కన్పడు చెట్లపిండునడుమం గాసారమొండుండెఁ; ది
య్యని యా చల్లనినీరు గ్రోలి గురుమార్గాయాస మాఱంగఁ గై
కొని విశ్రాంతి ముహూర్త, మాపయిని సాఁగుండోర్మి నల్లల్లనన్. ౩౨

గీ. నాతిదూరంబునందె కన్పడును మీకు
నేనుఁగుకళేబరం; బది యీ దినంబె
కొండపైనుండి పడి చచ్చియుండె; దాని
పలలము భుజించి ప్రాణముల్ నిలుపుకొనుఁడు. ౩౩

క. అది మీకుఁ జాలుఁజుండీ!
పదిదినముల దాఁకఁ బొండి! వైళమ" యనుచున్
సదయతఁ బలికి గజేంద్రము
గదలి చనెను వారి ననిపి కనఁబడ కెటకో? ౩౪

క. కరి చూపిన త్రోవంబడి
కర మసురసురగుచు నెట్లొ? కాళ్లీడ్చుచు వా
రరిగి సరస్సును బొడగని
కరపుటముల జలముఁ గ్రోలి కడుపారంగన్. ౩౫

క. మును విన్న గుఱుతుగొని యా
జనంబు పయనంబు ముందు సాఁగింపఁగ డా
పున నొక యేనుఁగుపీనుఁగు
కనఁబడెఁ దమదారికెలనఁగల గండశిలన్. ౩౬

శా. తెప్పల్ వాల్చక దానినిం గనుచుఁ జిత్రీభూతులై నిల్చి వా
రప్పద్మిం దమ యాప్తబాంధవునిగా నల్లల్ల గుర్తించి "యె
ట్లెప్పుణ్యాత్ముఁడు గూలెఁ? గ్రూరతములై హింసించిరే పాపపుం
గుప్పల్ దీనిని? దీని చావునకు మాకుం దోఁచదేహేతువున్. ౩౭

మ. అని కంటం దడిపెట్టు కొంచెవివియొ ? యూహాపోహముల్ సేయుచుం
గొన కూహించిరి "యిత్తఱిన్ మన బుభుక్షుత్వంబు మాన్పంగ నె
య్యనువుం గానక యీ క్రమంబునఁ దనుత్యాగంబు గావించి యుం
డును; లోకంబున మున్నమూదృశులు పుణ్యుల్ కల్గిరే ?" యంచెదన్. ౩౮

ఆ. వె. వారు గుంపుగూడి ప్రణమిల్లి దానికిఁ
దినఁగనోడి తలఁప వెనుక కరుగఁ
బలికె నివ్వితమున వయసున, విద్దియ,
వారియందుఁ బెద్దవాఁ డొకండు. ౩౯

క. "మనకై యిక్కరి మరణిం
చెను; దీనిం దినకయున్న జీవించునె ? వె
న్గొనఁబోక తింద; మప్పుడె
తనియుఁ దదాత్మయును; బడయు దానఫలంబున్." ౪౦

క. అనవుడు జనులెల్లరు మది
వెనుకాడుచు దానిడాసి పెనుజతనముతోఁ
దినవెఱచియుఁ దిని రెట్లో !
కనుఁగవకద్దుచు నొకొక్కకండయు బత్తిన్. ౪౧



# జాతక కథా గుచ్ఛము

## తృతీయ భాగము

## సన్న్యాసి జాతకము

క. మును బ్రహ్మదత్తుఁ డను నొక
జనపతి కాశీపురంబు శాసించుచు నుం
డెను; వానికొక్క కొమరుఁడు
జనియించెను బ్రజల పాపసంచయఫలమై. ౧

సీ. తనతోడఁ గ్రీడింపఁ జనుదెంచు బాలుర
నడఁచెడు పిల్లలపిడు గతండు;
కూడు గుద్చెడు సేవకుల కంచముల నింత
దుమ్మువోసెడు పెద్దతుంటరతఁడు;
బికిరంబునకు వచ్చు బీదసాదులపైకిఁ
గుక్కల నుసిగొల్పు కూళ యతఁడు;
చదివించు నొజ్జసెజ్జను వాఁడిముండ్లను
గ్రుచ్చిపోయెడు దుండగుం డతండు;
ఆ. వె. వెనుకనుండి విసరుఁ బెద్దలపై రాళ్లు;
దాఁగి పైని నుమిసిదాఁటు; నిట్లు
కౌతుకంబుఁ గాంచె లాఁతి పీడల శైశ.
వమున నా పిశాచ బాలకుండు. ౨

ఆ. వె. బాల్యమెడలి లేఁతప్రాయంబు మెలమెల్ల
వాని మెయిని నెరువుభాతి నలమ
సరవి దుడుకుదనము శాఖోపశాఖలై
యవని నాల్గు నెఱఁగు లల్లుకొనియె. ౩

క. నెఱవాఁడి తేలుకొండికిఁ
బరమాప్తుఁడు; ప్రాణసఖుఁడు పాముపడగ; క
క్కఱవాఁడు మిత్త్రికోఱకు;
ధర సత్యాచారుఁ గనము తాదృశు నన్యుణ్.

క. గొఱెపిల్ల పైనిఁ దోడేల్
కరణిని నిర్దోషియందుఁ గఱకటియై క
న్పఱచుచు దోసము శిక్షకు
గుఱిసేయును; బలుకనేలొకో ? దోషికతల్.

క. పరులేద్వ నా నికృష్టుం
దరుసంబునఁ దాండవించు నత్యంతము; ని
స్సిరో ? యయ్యధమాధము దు
శ్చరితము దురితమునుగూర్చు సొంతము విన్నణ్.

మ. ఒకనాఁ డాతఁడు కొల్వరుల్ కొలువ బాహ్యోద్యానముం జొచ్చి యు
త్సుకుఁడై యాడుఁచు బాడుచుండఁ బెనువాతూలంబు జృంభించి మీఁ
దికిఁ గెంధూళులురేఁపి ముంచఁగను దద్దేహంబు నాపాదమ
స్తకముం, జచ్చిన చావుగా మనె నెటో! తత్కింకరశ్రేణితోణ్.

ఆ. వె. బడలి మైలయెల్లఁ గడిగి తానంబాడి
యేఁగఁదలఁచి తన్ను నేటికడకుఁ
జేర్పుఁడంచు బలుక సేవకుల్ కొంపోయి
నిలిపి రొమ్ముబంటి జలములందు.

ఆ. వె. సందు చిక్కెనంచు నందఱు నాచెట్ట
మట్టు బెట్టఁదలఁచి చుట్టుముట్టి
కొట్టి జుట్టుపట్టుకొని ముంచి పల్మాఱు
"చావు"మంచుఁ దిట్టి చనిరి త్రోసి.

చ. చని తగ బ్రహ్మదత్తుఁ గని "క్ష్మావర ! నీ కొమరుండు తోఁటకుం
జని యట నాటలాడుకొని స్నాన మొనర్చెదనంచు వంకలో
మునిఁగెను; దేలఁ; డెవ్వరదఁ బోయెనొ ? యే మొసలేని మ్రింగెనో ?
కనుఁగొనమైతి; మింతదనుకన్" సని పల్కిరి దుఃఖితుల్వలెన్. ౧౦

క. తనయుని వృత్తాంతము విని
జనకుం డెరగలిని బడ్డ సరణిని బిట్టే
డ్చె; నరాధముఁడే పో ! పృ
థ్విని సుతు మృతి కన్నకడుపుఁ దెగఁగోయదొకో ? ౧౧

గీ. భటులు దన్నట్లు నట్టేటఁ బట్టిద్రోయ
క్ష్మావర సుతుండు మజ్జనోన్మజ్జనములు
మాటిమాటి కొనర్చుచు నీటి వడికి
బ్రదుకు చావులఁ దేలుచుఁ బఱచుచుండ. ౧౨

చ. తరఁగలఁ గోయఁగాఁబడిన తత్తటమందలి పెద్దవృక్ష మొ
క్కరుపుఁడు నీటఁ గూలి భుజకాండము నూఁతగఁ జాచినట్లు భూ
వరసుతు చేతికిం దొరకఁ, బట్టుగ దానినిఁ బూని పోవు చే
తైఱ బ్రదికెం; జిరాయువు గదే ! భువిఁ బాపుఁడు చెప్ప నేఁటికిన్ ? ౧౩

క. తడవులఁ బడి యయ్యాపగ
కడఁగల వల్మీకమందుఁ గాఁపుండిన యొ
క్కఁడు నిడుపండా వెల్లువఁ
బడి యురవడివచ్చి దానిఁ బట్టుక నిలిచెన్. ౧౪

గీ. ఆ నదికి లోఁదరింగల యట్టిలాఁగఁ
గాఁ పురం బున్న యొక మూషికంబు తనదు
కలుగు మునుఁగంగ బఱతెంచి జలములఁ బడి
కొట్టుకొనివచ్చి యా కొమ్మఁ బట్టుకొనియె. ౧౫

గీ. ఆశ్రయించిన తన కులాయంబుతోడఁ
బూవుఁబోద గూల నొక చిల్క బోద యకట!
సుళ్ళఁ దిరుగుచుఁ దిరుగుచు మెల్లమెల్ల
వచ్చి యా వృక్షశాఖ నుపాశ్రయించె. ౧౬

క. తావలమై పున్నియమున
కా వాఁగున కానుకొన్న యాశ్రమమున భూ
దేవుఁడయి బోధిసత్త్వం
డావాస మొనర్చుచుండె నక్కాలమునన్. ౧౭

ఉ. ఆతఁడు నిండుజవ్వనమునందు జితేంద్రియవృత్తియై ధన
వ్రాతము, దారపుత్త్రపరివారము సర్వము రొచ్చుగుంటగాఁ
జేతమునందు రోసి, నివసించుచు దుఃఖిత లోకసేవనం
బే తన ముఖ్యలక్ష్యముగ నెంచుచుఁ బుచ్చుచునుండెఁ గాలమున్. ౧౮

క. ఆతఁడు యాదృచ్ఛికముగ
నాతటినీతీరమునకు నరుగఁగఁ దరుశా
ఖాతతి నాసత్త్వంబులు
ప్రేతంబులరీతి గోచరింప సదయుఁడై. ౧౯

క. "బ్రతికింతుఁగాక నా జీ
వితమును వ్యయపఱచి యేని వీని" ననుచు నా
క్షితిసురుఁడు దూఁకివాఁకను
క్షితిరుహ మెదురీఁదిపోయి చెచ్చెరఁబట్టెన్. ౨౦

క. తన బాహాబలమున దా
నినిఁ దీరంబునకు లాగి నిపుణంబుగ దా
నను వ్రేలుచున్న ప్రాణుల
గనికరమున నొక్కటొకటిగాఁ జేర్చితటిన్. ౨౧

చ. చితుకులు ప్రోగు సేసి వడిఁ జిచ్చిడి లెస్సగ మంటఁజేసి పె
ద్దతడవు నీటనుంటఁ జలిదాఁకి కడుంగడు ముద్దలై విజీ
వితముల పోల్కి నున్న పృథివీపతి పుత్త్రక ముఖ్యజంతు సం
తతిఁ గొనితెచ్చి నిల్పి సవిధంబునఁ గాఁచెను దెప్పిఱిల్లఁగన్. ౨౨

ఆ. వె. అంత వెచ్చదాఁకి యాయెల్లజీవులు
మెల్లమెల్లఁ దేఱి మేనదల్చి
కన్ను లలఁతివిప్పి కాంచి నిట్టూర్పుచు
నీరసమునఁ బలుకనేరకున్న ౨౩

కం. వలసినవగు నాహారం
బుల సంపాదించితెచ్చి పొలుపుగఁ దనచే
తులవానినిఁ దినిపించుచు
నలువుర నొకచందమున ఘృణామతిఁ బ్రోచెన్. ౨౪

గీ. వాని ప్రాపును బ్రోపునుం బడసి, మెల్ల
మెలఁగ, రెక్కొని రెక్కార్చు బలమునొంది
తొంటి జవసత్త్వములను జంతువులు వొందె
నమృతమయమైన యౌషధం బానినట్లు ౨౫

కం. తమతమ తావులకుం బో
సమకూరఁగ శక్తి మౌనిచంద్రునికా స
ర్పమును, శుకమూషికంబులు
నమస్కలిడి, సెలవడిగి చనం, బలికె నిటుల్. ౨౬

కం. "బ్రతికితి స్వామీ! నీదయఁ;
గృతజ్ఞుఁడను విషధరుండనేనియు; నా ర
క్షితమగు పాఁతుల నీకిడి
కృతకృత్యుఁడనై తరింతు నీ జన్మంబున్. ౨౭

మ. తొలిజన్మంబునఁ గాళ్ళఁజేతులను హద్దుంబద్దు లేకుండ మి
క్కిలి రొక్కంబు గడించి కాసయిన భోగింపంగఁబో, కీయక
న్యులకున్ నేలను బూడ్చితిం; దుది గతాయుష్కుండనై దానిపైఁ
గల మోహంబునఁ బుట్టి యిప్పుడహినై కాపాడుచుంటిన్ నిధిన్. ౨౮

గీ. తండ్రి ! నీకిత్తు నాకున్న ధనమదెల్ల
లోక కళ్యాణమున కీవు స్వీకరింపు
క్షితిని నాత్మంభరులచేతఁ జిక్కునో ? యని
కడువగచు చుంటి నూఱటఁగంటి నిపుడు ౨౯

గీ. వరదఁ బడి కొట్టుకొనుచట్లు వచ్చువేళఁ
గొంప మునిఁగినదని పెద్ద కుందియుంటి;
దానఁగద ! కల్గె నీపుణ్య దర్శనంబు
మేళ్ళకేవచ్చు నందురు కీళ్ళొకప్డు." ౩౦

కం. అని పాము విన్నవింపఁగ
వినయంబున మూషకంబు పెల్లిదమగు బ
త్తిని వాచంయమిపతితోఁ
దనదు కృతజ్ఞతను దెలుపఁ దగనిటు వలికెన్. ౩౧

కం. "మన్నీని మందిరమునకుఁ
గన్నంబును ద్రవ్వి యందుఁగల ధనరాసుల్
సన్నగ హరించి నాలాఁ
గన్నిలిపి కుబేరు రీతిగా నుంటినటన్. ౩౨

క. తిననైతి వాని, యాచక
జనముల కీనైతి ; భూమిజానికి దక్కం
పనయితిని; నింత శ్రమ సే
సిన దెందుకొ ? యంచు నిపుడు సిగ్గిలుచుంటిన్. ౩౩

గీ. కలదు నిలువెత్తురాసి నాకలుగునందు
గొనుము ! దీనావనార్థమాధనము ; రాదు
చౌర్య దోషం బొకింత; దుష్ప్రభువు సిరులు
ధర సమర్పింప లోకభద్రంకరులకు" ౩౪

క. అని పలుకఁ గిర మిట్లను;
"మునీంద్ర ! ముప్పొద్దుఁ బొట్టఁ బుచ్చుకొని చరిం
తును; నా కడఁగలవే ధన
కనకంబులు నీ కొసంగఁగా వానివలెఁ ? ౩౫

ఆ. వె. కలదు నాకుఁ బెద్దబలఁగంబు; వలసెనా
పుట్లకొలఁది ధాన్యములఁ ద్వదర్థ
మప్పనంబొనర్తు నార్జించికొని వచ్చి
నన్నుఁ గృతార్థుఁజేయు కనికరించి." ౩౬

క. తన పాపఫలముగా రా
ట్తనయుం డయ్యేటఁ జాక సంయమి దయచే
మనియు విడఁడు చెడుగొనములఁ
దనకంపును విడునె యుల్లి తప్తంబయ్యున్ ? ౩౭

మ. "తనదౌ పెద్దతికంపు పెంపెఱుఁగ కీతం డల్పసత్త్వంబులం
గవినట్టుల్ గనుచుండె; నన్నుఁ బురుగుంగా నెంచె నీమూర్ఖు; శా
స్తినిఁ గావింతు" నటంచు నా నృపశు వెంచెన్ సీ ! కృతఘ్నుండు; వే
మునఁ బాల్వోసియుఁ జక్కె రెర్విడ లవంబుం జేఁదు దాఁ జచ్చునే ? ౩౮

క. కాన మనఃస్ఫూర్తిగఁ బై
వానివిధంబునఁ గృతజ్ఞభావంబును ధా
త్రీనాథసుతుఁడు సూపక
కానంబడనీక పైకి ఘాతుకవృత్తిఁ. ౩౯.

గీ. కష్టమతి, తేనెఁబూసిన కత్తియైన,
వాఁడు "పట్టాభిషేకోత్సవంబు నాకుఁ
బదిదినంబుల నగు; దానిపైని రమ్ము
అర్ధరాజ్యంబు నర్పింతు" ననుచుఁ బలికె. ౪౦

గీ. పలికి యా నల్వు రవ్విధి నెలవులకును
నరిగి; రహిమూషకశుకంబు లమ్మహాత్ము
ఋణముఁ దీర్చెడు తఱి యెప్పు? డెప్పు? డనుచుఁ
బ్రత్యహంబును దారులు పాఱఁజూచు. ౪౧

క. కృమికీటములకు నత్యు
త్తమమగు కృతమెఱుఁగు బుద్ధి, తద్దయు నధమా
ధమమగు కృతఘ్నతయు, నర
సమూహమున కొప్పదే విషమవిధిసృష్టిన్ ? ౪౨

క. కడవంగ నలఁతి తడవా
తఁడా నలువురియు కృతజ్ఞతను దెలియంగా
నెడఁ దలఁచి యొక్కదినమున
నిడుపఁడు నివసించు నాకునికటంబునకున్. ౪౩

చ. చనుటయు వానికోసమె దిశల్ పరికించుచునున్న నాగ మా
తనిఁ గని స్వాగతంబిడి ముదంబున నర్చలు సేసి నిండు బ
త్తిని ధనరాశిఁ గన్పఱచి "దేవర! నా శపథానుసార మ
ప్పన మొనరింతుఁ గొమ్మనుచుఁ బ్రార్థనసేసెను మౌనినాథునిన్. ౪౪

క. 'వలద'ని యతియునుఁ 'గైకో
వలయును దప్పద' యటంచుఁ బామును బహుభం
గుల ఘర్షణపడు పిమ్మట
వెలవెన్ విప్రుఁడు గ్రహించి విడిముడిముడుపున్. ౪౫

ఆ. వె. అచటుఁ గదలి మూషికావాసమున కేగ
నమ్మహాత్ము రాక నాలకించి
యదియు నెదురువచ్చి యర్ఘ్యపాద్యము లిచ్చి
కొలిచి, చూపి తనకుఁగల ధనంబు. ౪౬

చ. "కనులకుఁ గూర్కు లేక కడఁకన్ భవదర్థ మహర్నిశంబు నీ
ధననిధిఁ గాచుచుంటి; నిడి త్వచ్చరణాంబుజ సన్నిధానమం
దనృణత నొందఁగాఁ దలఁతు; నంతటి పున్నెము నాకుఁ గల్గునే?
యనుకొని చింతఁ బొందితిఁ; గృతార్థుఁడనైతిని స్వామి! నేఁటికిన్." ౪౭

క. అని సర్వస్వము నర్పిం
చిన ముని గొన నిష్టపడమిఁ జేయుచు శపథం
బును బలవంత మొనర్పం
గను మూషక, మతఁడు దుదికిఁ గైకొనె నెట్లో? ౪౮

క. తన్నుఁ వెదకుచు వచ్చెడి
సన్న్యాసినిఁ గాంచి చిలుక జయవెట్టి తగఁ
మన్నించి తియ్యఁబలుకుల
మున్నిటి తన బాసఁ దీర్చు పూనికతోడన్. ౪౯

కం. బలఁగంబుఁ బంప నయ్యది
కలయం దిరుగాడి దచ్చికడలను దెచ్చెం
గొలుచుం బుట్లకొలందిగ
నల కన్నులుమూసి తెఱచు నంతతడవులోన్. ౫౦

కం. అనునయ శతముల ధాన్యం
బును సంయమి స్వీకరించి భూమీధవు పు
త్త్రిని శోధింపఁగ దాఁ బో
యెను వ్యాళాదుల కృతజ్ఞవృత్తిఁ బొగడుచున్. ౫౧

గీ. ఆయబాంద్రాయి యొక్కనాఁ డంగరంగ
వైభవములతోడఁ బట్టాభిషేక
మెనసి తొడి పూసి కట్టి గజేంద్రమెక్కి
మిగుల వీఁగుచు నూరేఁగు నగరవీథి. ౫౨

ఉ. ఆ నృపపుత్త్రి పాశుఁడు తదాగమనార్థమె చూచుచున్ సమీ
పానికి వచ్చుచున్న తనప్రాణములిచ్చిన సత్కృపాళునిన్
మౌని నహైతుకంబుగ నమాంతము పైఁబడి చంపనెంచెఁ; బు
ణ్యానికిఁబోవఁ బాపమెదురయ్యె నిసీ! జడదారి తేనికిన్. ౫౩

గీ. దైవనిర్మితమైన స్వభావమెవఁడు
సంస్కరించుకొనంజాలు? జగతిఁ దన్ను
హవ్యములఁదన్పు యజమాను నగ్నిహోత్రుఁ
డకట! చెలరేఁగి కాల్ప మీఁదికినిరాఁడె? ౫౪

కం. పడగెత్తం బగగొని నిడు
పఁడు; కొండియ నెత్తుఁదేలు పరిభూతంబై;
పుడమిని వీనింబోలిన
చెడుగండును దుండగీఁడు క్షితినొకఁడున్నే? ౫౫

శా. ఆరాజాధముఁ డాడెఁ గింకరులతో "నావచ్చు సన్న్యాసిగాఁ
డీ రాజ్యంబును గొల్లగొట్టి యిదిగో! నేతెంచు నీక్షింపుఁడీ!
చోరుం డీతఁడు; సొమ్ముతోడొరకె నిచ్చో; వీని బంధించి మైఁ
గ్రూరంబైన కశాభిఘాతములఁ జీరుం; డుప్పునంబాఁతుఁడా!" ౫౬

గీ. అనుట తడవుగ యమకింకరాళిఁ బోని
తేని దూతలు దృప్తులై వానిఁజుట్టి
నగరినాలుగువీథికోణముల నిలిపి
చాటుచును వాని చరితంబు ప్రేటులిడుచు. ౫౭

కం. శూలప్రోతు నొనర్పగ
నేలిక యానతిని భటులు హేయాత్యంతా
భీలశ్మశానభూమికి
నాలోకోత్తరునిఁ గొంచు నరుగుచునుండన్. ౫౮

గీ. పటహనాదంబు నాలించి ప్రాంతమందు
నొండురులఁ ద్రోసికొంచు నిల్చుండి వానిఁ
గనుచుఁ బర్యశ్రునేత్రులై యనుకొనిరిటు
“లిమ్మహాత్ముని కక్కటా! యిట్టిచావె?” ౫౯

మ. మునితో నారెకు లంతఁ బల్కిరిటు “లోభ్రుచ్చా! యిటన్ నీవొన
ర్చిన యేపాపఫలంబుగాఁ గనితి వీ శిక్షా సమస్త ప్రజల్
వినసీనోటనె పల్కుమీ!” యనుడు నా విప్రోత్తముండెంచె నా
త్మను “గిడా నిజమాడతేనికి; నసత్యంబాడఁ బాపంబగుణా. ౬౦

ఆ. వె. కా న సత్యమాడి తేనికేహానియు
రానివిధముఁ గనుట మానితంబు
విసపుఁబ్రామఁకునేనిఁ బెంచినట్టిఁడు దాని
నాశనంబుఁజేయ న్యాయ్యమె?” యని ౬౧

మ. “వినుఁడీ! శాంతముగాఁ; బ్రవాహమునఁ బృథ్వీజాని నిర్మగ్నుఁడై
కొనప్రాణంబులఁ బోవుచుం గనఁబడెం గొండొక్కనాఁ; డప్డు వా
నిని రక్షించితి లాఁతిజంతువులతో; నేఁడిట్లు దండ్యుండనై
తినిఁ దత్పాపఫలంబుగా; భువిని మాదృక్షుల్ మనం జెల్లునే?” ౬౨

గీ. అని ముని వచించు నత్తఱికా ప్రదేశ
మునకు నెట్టెట్టొవచ్చిన మూషకాహి
కీరములు వేయినోళ్లఁ దత్కీర్తిఁ బొగడి
నిజధన సమర్పణంబు విన్పించెఁ బ్రజకు. ౬౩

కం. విని మౌనిధర్మబుద్ధిని
జనతతి హాహారవములు సలుపుచును "గృత
ఘ్నుని జేనిని నిలువునఁ గా
ల్చినఁ బాపములేదు, చీల్చి చెండాడుండీ!" ౬౪

ఆ. వె. అనుచు హెచ్చరించుకొనుచు నొండొరువులఁ
గనుల నిప్పులురల, గునపములను,
గండ్రగొడ్డళులను, గత్తికటార్లను,
బట్టి నృపతిపైకిఁ బఱచుచుండ ౬౫

కం. ముని మానిచి వారల ఘా
తనచర్యఁ బ్రశాంతపఱిచి "దండ్యున కిల మే
లునుగూర్చు కన్నఁ బెనుదం
డన మున్నదె? లెస్స యరయుఁడా! డెండమునన్. ౬౬

కం. క్షమియించితి; క్షమియింపుఁడు
క్షమాపతిని మీరలును బ్రసన్నాత్మత; దం
డమునెత్త మీరు భువి గు
ఱ్ఱమునుం గాడిదయు నొక్కరకమనరె బుధుల్?" ౬౭

మ. అని బోధించుచు నుండఁ బౌరజనహత్యాయత్నముం జూచి పో
యిన దూతల్ వచియించు పల్కులకు భూమీశుండు జూల్వట్టి లాఁ
గిన సింగంబయి, తోఁకఁ ద్రొక్కిన యహిం గ్రేణించు చుద్రిక్తుఁడై
కనఁబోకెద్దియు నొంటికాలిపయినేఁగం బోయె నమ్మూఁకపై ౬౮

గీ. గిరి నెదుర్కొను పొట్టేలుకరణిఁ, గడలి
పెనుకరుళ్ళకు నెదురీఁదు జనునిపగిది
మార్తురను దాఁకుటయు వారమాంత మెదిరి
చితుకఁ బొడిచిరి వానినిఁ జిదురుపలుగ. ౬౯

కం. మునిబోధ వెఱచి తద్దం
డనమునకయి. యాత్మరక్షణముపొంచె నెది
ర్చిన పగఱపిండు వసమఱి
మునువెనుకలఁ గనక వాని మొత్తుచు నున్నన్. ౨౦

కం. కని యమ్మహాత్ముఁ డయ్యది
కనికరమునుజెంది తఱిసి కనలియు వారిన్
గొనప్రాణముతో నుండిన
జనపతి నోదార్ప వాఁడు సంతప్తుండై ౨౧

కం. "ఆచేతఁ జేసినట్టిది
యీ చేతన్ననుభవింప కెవ్విధిఁ దొలఁగున్ ?
నీచాతినీచచిత్తుఁడ
నై చేసితిఁ బెక్కు లెగ్గు"లని యనుకొనుచున్. ౨౨

కం. అఱిముఱిపాటున నయ్యతి
చరణంబులపైని వ్రాలి "శరణు! శరణు !" నా
చరితకు లజ్జించితి; నను
గురుదేవా ! శిష్యుఁగాఁగఁ గొనుమీ !" యనియెన్. ౨౩

ఆ. వె. పతితపావనుఁడగు యతి ప్రసాదంబున
నధములందు నధముఁడైన రాజు
పరుసవేది నినుము బంగారమైనట్లు
పూతచరితవడసి పూజ్యుఁడయ్యె. ౨౪

ఆ. వె. నాఁటఁగోలెవాఁడు న్యాయ్యమార్గముఁబూని
పాపభీతి గలిగి పరిఢవిల్లి
భూతదయను నపరబోధిసత్త్వుండయ్యె;
గాలి పూతభస్మగాదె ? పెండ ? ౨౫



# జాతక కథా గుచ్ఛము

## తృతీయ భాగము

---

### మృగజాతకము

క. మును కాశీదేశంబున
జనించెఁ బూజ్యుండు బోధిసత్త్వుఁడు మృగమై
యనిదంపూర్వంబగు కా
మనీయకముతోడికనకమయ పృత్త్రికనాఁ.

గీ. కన్నుగవ దీర్చిదిద్దిన గతినిఁ గ్రాలఁ
గొమ్ము లలరార నున్నవై కొనలుదేలి
గాత్రము సెలంగఁ జిక్కఁగాఁ గండవట్టి
పరగు నొప్పులకుప్ప యా పైఁడిలేఁడి.

చ. ఎగఁబడి పైరుపచ్చలపయిం గబళింపఁగఁ గ్రేళ్లుదాఁట; దొ
ప్పుగఁ దటితో లభించు కసవుఁ మెసవుఁ; దమ పాడుపొట్టకై
అగు నిది; కాదు నాక; యదయందముఁ ద్రుంచెడు వేఁటకాండ్రు రె
ప్పగిది స్వపాపముక్తులయి వర్తిల నేర్త్రనిచింత శోషిలుఁ.

క. మృగయుల శరఘాతములకుఁ
దెగియుఁ దెగక చావొ? బ్రదుకొ? తేలక వెతలం
బొగిలెడు హరిణంబులఁ గని
తగు నుపచారముల నిర్వ్యథంబులఁ జేయుఁ.

గీ. స్వర్ణదేహంబుఁ గుటిలస్వభావముగల
లేఁడియైనట్టి మారీచుజాడఁ గాక
దృష్టపూర్వంబు శ్రుతపూర్వమేనిఁ గాక
యాకృతికిఁ దగ్గగుణముల హరిణ మలరు.

క. ఆ వనమునందె వేఱొక
తావునఁగల సింగమునకు దైనికభోజ్యం
బై వంతువోవుచుండె మృ
గావళి స్వనియామకాజ్ఞ నన్వహమందున్.

క. తనవంతు రాఁగ నొకదిన
మునఁ బ్రసవోన్ముఖికి జింకపోలఁతికి నదివే
చని నిజనియంతఁ బ్రార్థిం
చెను దన యానాఁటివంతుఁ జేయఁగ మార్పున్.

చ. కడుపులు పోయిపోయి చిరకాలము వేల్పుల మ్రొక్కిమ్రొక్కి తా
ముడుపులుగట్టి వేఁకటినిఁ బొందుటఁ బాపము ! లేడి కండ్లతో
బుడతను గాంచి యొక్కపరి ముద్దిడి యెవ్వరికే నొసంగి య
ప్పుడు దనవంతుఁ దీర్చుకొనఁబోవఁ దలంచుచు వేఁడె నవ్విధిన్.

ఆ. వె. ఆ నియంత దాని ప్రార్థన మన్నింప
కట్టె కసరి దాని నంపివేసెఁ;
బాప ! మదియుఁ బెద్ద పలవించుచుంబోయె;
నెద్దుపుండు గాకి కేమి ముద్దు ?

గీ. దారి దడియుటఁ గన్నీటిధారల కది
తడఁబడుచు ముందుముందున కడుగుపడక
కడిఁది మతిమాలియుంట మార్గంబుఁ దప్పెఁ;
బట్టెఁ బెడదారిఁ దనదైన భాగ్యమునను.

గీ. గర్భభారంబునకుఁ దోడు గాఢమైన
దుఃఖభారంబు జతపడఁ దొట్రువడుచు
నా కురంగంబు నేరె నయ్యడవికోనఁ
గనకమృగమైన బోధిస త్త్వుని గృహంబు.

గీ. ఆర్త సాహాయ్యము నొనర్ప నాత్మకీయ
కందరాంగణమందుఁ ద్రికాలములను
గాచి కూర్చుండు నా దయాకరుని బోధి
సత్త్వుఁగని జింకపడఁతి యాశ్చర్యపడుచు. ౧౨

గీ. తన్నుఁ గబళించు నా మృగేంద్రంబుఁ గాక
తండ్రివలె నున్న యా మృగోత్తమముఁ గాంచి
"శరణు! శర"ణని డాసి తచ్చరణములను
వ్రాలి వినిపించెఁ దన కత మూలముట్టు. ౧౩

క. విని బోధిసత్త్వుఁ డా మృగ
మున కిడి యభయము నియంత మ్రుక్కడితనముం
మనమందు నేవగించుచుఁ
జనం దలఁచె సింగమున కశనముగఁ దానై. ౧౪

క. బ్రతు కాసఁగొన్న ప్రాణికి
మృతి సాక్షాద్భూతమగును; మృతిఁ గోరంగా
బ్రతుకొదవు జీవి; కవిత
ర్కితముగ విధి గూర్చుఁ గాదె కీళ్లున్ మేళ్లున్! ౧౫

మ. విని వారించునొ? పోవనీక యని స్వాభిప్రాయలేశంబు మో
మునఁ గాన్పింపక బోధిసత్త్వుఁడు మృగంబున్ నిల్పి స్వస్థంబుగాఁ
దన వాసంబున సింగమున్న గవినిన్ దాయంగఁ జన్చుండె గ
ర్జన లోలిన్ వినవచ్చు దిక్కుబడి దుర్వారంపు వేగంబునన్. ౧౬

క. పెన్నాఁకొన్నకతంబునఁ
గన్నుల నిప్పుకలు రాల గాండ్రిల్లుచుఁ దా
దెన్నులు సూడఁగ బంగరు
వన్నె మెకము హరికిఁ గానవచ్చెఁ గుఱఁగటన్. ౧౭

గీ. స్వర్ణమయమైన యా విలక్షణమృగంబు
గానఁబడ నల్కయెడలి యక్కజము దోఁపఁ
జంపకద్దానిఁ గేసరి చాలతడవు
గదలకుండ నెగాదిగఁ గాంచుచుండె. ౧౮

ఆ. వె. కడుపు గాలుచుండె; మడియింప నుంకింప;
దెదుటనున్న తన్నుఁ గదియరాదు;
చిత్రమైన తచ్చరిత్రంబుఁ గని బోధి
సత్త్వుఁ డొందె నక్కజంబుఁ దాను. ౧౯

గీ. మృత్యుదేవత చిత్తంబు మెత్తపఱచుఁ;
గఠినమగు గండశిలనేనిఁ గరఁగఁజేయుఁ;
గాల సర్పంబునేనిఁ బూమాలఁజేయుఁ;
దెలియవు మహాత్ముల రహస్యములు నిజంబు. ౨౦

గీ. అలఁతితడవట్టులుండి యాహరికిఁ బలికెఁ
గాంచనమృగంబు, "నన్నేల చించి తినవు ?
ఎంతయాఁకొంటివో ? యోర్చితెట్టులింత
తడవు ? వేవేగ ననుఁదిని తనియుమోయి !" ౨౧

చ. అనవుడు సింగమాడె "మృగమా ! నినుఁబోలిన జింకఁ జూచియుం
డను; గనియుండ స్వప్నమున; నాకడకుం జనుదెంచు లేఁడినిం
దినక త్యజింపఁ, గాని భవదీయముఖంబును గాంచనేలొకో ?
మనమునఁ గొంకుపాటొదవు ; మన్నన దోఁచుచునుండె నీపయిన్. ౨౨

కం. మృగరూపము ధరియించిన
భగవంతుఁడవేమొ ? నన్ను భక్షింపంగా
బుగులొందుచుంటి మిగులన్;
వగతును ననునీవె మ్రింగవచ్చితి వనుచున్. ౨౩

కం. నినువిఱువఁ జాల; నేఁటికి
ననశన వృత్తిం జరింతు హరిణంబా! నీ
దు నికేతనంబునకు నిఁకఁ
జనుమా! కనువిందుగాఁగ సంబంధులకున్." ౨౪

ఆ. వె. అనుడు మృగము నాఁడు చని వచ్చె మర్నాఁటి
వంతుమేకమునకును బదులు గాఁగ;
మఱల వెఱచి విఱువ హరి దానిఁ బొమ్మని
యనిపి కడపె నాఁడు ననశనముగ. ౨౫

గీ. జరుగ నాన్నాళ్ళు లీగతి హరి కడింది
నాసిరిలి చచ్చునట్లు కన్పట్టఁగాంచి
మృతమృగంబుల మాంసంబు వెతకి తెచ్చి
బోధిసత్త్వుండు హర్యక్షమున కొసంగె. ౨౬

గీ. తేఱుకొని కేసరి వచించె "దినదినంబు
వంతుమేకముల రానీక వత్తు వీవె!
చంపఁజాలను నిన్ను; జీవింపజాలఁ
దిండిలేకిట్లు జఠరాగ్నిమండుచుండ." ౨౭

చ. అనవుడు లేఁడివల్కె "వినుమా! యభయంబు నొసంగియుంటి ని
వ్వనిఁగల జీవకోటికి; భవత్సదృశంబగు హింస్రజీవి నో
టను దొలిముద్ద నేనెయగుటన్ మదిఁగోరితి; నన్నుఁ దిందువా?
తిను; తినకుందువా! తినుము! త్రెళ్ళిన జంతుచయామిషంబులన్." ౨౮

క. ఆ పలుకులు విని సింగం
బా పూటం దొట్టి మాని యా మృగహింసా
వ్యాపారంబులు, దొరకిన
యే పలలమొ? తినుచుఁ గాలమేగించుకొనెన్. ౨౯

ఆ. వె. శిష్యఱికముఁ బూని సింగంబు లేడికి
ధర్మకథలు వినుచుఁ దత్పరమతి
నపర బోధిసత్త్వుఁ డయ్యెను శివభాగ
వతుఁడు తుదిని శివతఁ బడసినగతి. 30



# జాతక కథా గుచ్ఛము

## తృతీయ భాగము

---

### ఆచార్య జాతకము

క. తొలి విప్రవంశ ముక్తా
ఫలమయి, విద్యలకు నాలవాలంబయి, గు
ణ్యుల కగ్రగణ్యుఁడై, పూ
జలువొందుచుఁ గడిఁది బోధిసత్త్వుఁడు పొలిచెన్. ౧

క. ప్రాచార్యుండగు నాతని
యాచార్యక మభిలషించి యరుదెంతురు ప్ర
జ్ఞాచణులగు పండితులును
నా చతురాస్యుని వెలంది యవతారముగాన్. ౨

క. చదురయి ప్రాఁజదువులలోఁ
గుదురయి షడ్దర్శనములకుఁ బవిత్రతయం
దదరయి యాతని శిష్యుఁడు
తదీయ ముపదేశమొంది తన యిలు నేరెన్. ౩

క. చేరి యథావిధి నాతఁడు
దారస్వీకారమునకుఁ దన పిత్రాజ్ఞం
గోరి మది డాసి భక్తి
స్ఫారుండయి చరణములకు సాఁగిలి వేఁడెన్. ౪

క. జనకుఁడు వసిష్ఠుఁ డనియును
జనని యరుంధతియునంచు స్తవనీయులుగా
మను వారలు తనయుని ప్రా
ర్థనంబు చిత్రంబుఁ గొలుపఁ దగఁ బలికిరిటుల్. ౫

గీ. "సకల విద్యల యందు నిష్ణాతుఁడవయి
దార సంగ్రహ మొనరింప ధర్మ్యపథము;
శాస్త్రముల యందుఁ గలదు స్త్రీశాస్త్ర మొకటి
కఱచితే ? దానిఁ గాకున్నఁ గఱవుమింక. ౬

గీ. చదివి లెస్సగఁ దద్రహస్యంబు లెఱిఁగి
తదుపరి వివాహమగుట యుక్తమ్ము సుమ్మ !"
నావుడు నతండు దండ్రి యానతిని మఱలి
తనదు గురుదేవు సాన్నిధ్యమునకుఁ జనియె. ౭

ఆ. వె. వచ్చినట్టి శిష్యుఁ బరికించి దేశికుం
డతని వలన రాక కత నెఱింగి
యతని కన్నవారి యాశయంబు గ్రహించి
స్వాంతమందు లెస్స సంతసించి. ౮

గీ. పలికె నీ చందమున "నోయి బాల ! వినుము
యోగిని యొకర్తె యిచ్చోట నున్నది గద !
వయసు వ్రాలెను ; పసిదప్పి వడలె నొడలు
నాపె పరిచర్య సేయుము రేపు మాపు. ౯

చ. దినదిన మొళ్లువట్టుచు బ్రమదిష్ఠముగా నులివెచ్చ నీట మ
జ్జనము నొనర్చి ప్రావలువ జాఱిచి క్రొమ్మడిఁ గట్టనిచ్చి భో
జనములఁ గూర్చి రుచ్యముగఁ జక్కని మెత్త లమర్చి పండఁగా
వినయ విధేయతల్ మెఱయ వేఁడక కొల్వుమి ! యెల్ల వేంటలన్. ౧౦

మ. పరివస్యంబొనరించుచుం బయినిఁ దెల్పంబడ్డచందాన న
త్తఱి వర్ణింపుమి ! యిట్టు "లోపడఁతిరో ! త్వద్గాత్ర లావణ్య మ
బ్బురమై యీ ముదిప్రాయమందె యిటులున్మోహంబుఁ గావించె ; నీ
తరుణప్రాయపు టందచందము లతీతంబుల్ గదే ! యూహకున్. ౧౧

ఉ. సొంపుల కెల్ల నెల్లయయి శోభిలు నా రతిసుందరీ౯ సురా
శింపరె ? పట్టి నీపయి ; నశీకముగాదిది ; పొల్చు నీ కనుల్
చెంపకుఁ జేరెఁదేసి ; మెయిచిక్కని చక్కని పైఁడిబొమ్మ; వీ
క్షింపఁగ లెస్స నీదు తొలిచెల్వు యథాతథ మిప్డుఁ గన్పడు౯. ౧౨

గీ. తళుకు మాసినఁ బసిఁడికి ధర తరగునె ?
పొంగుదీసిన వంకకుఁ బొలుపు చెడునె ?
జవ్వనపు నిండుజాఱిన సహజమైన
నిగ్గు దగ్గక నీవు కన్పింతు వింతి ! ౧౩

క. ఈవిధముగ వర్ణింపఁగ
నా వృద్ధ నినుం గుఱించి యాడిన యది తూ
చా విడువక వచియింపుమి !
యావలఁ జదివింతు నీకు నా శాస్త్రంబున్." ౧౪

క. అని యాదేశింపఁగ నా
య్యనఁ జని శిష్యుండు గురుని యానతిమెయి వృ
ద్ధను సేవించుచుఁ దద్వ
ర్ణనంబుఁ గావించుచుండెఁ బ్రతిదినమందు౯. ౧౫

చ. తొలి దినమందు నా ముసలితొయ్యలి యూరకయుండె వించు ; న
మ్మలిదినమం దలంతి మతి మళ్లఁగఁ గ్రమ్మఱఁ జిక్కఁబట్టె; నా
వలి దినమందు వర్ణనలఁబట్టి స్వపూర్వవయోవిలాసముల్
తలఁచె; ననంతరాహమునఁ దాలిచె గగ్గురుపాటు నెమ్మెయిన్. ౧౬

క. తన నిండుజవ్వనంబునఁ
దనివారం గొన్న మన్మథక్రీడలటం
గనులకుఁ గట్టిన యట్టులు
గను చిప్పిః మరులుగొనియెఁ గ్రమముగ నెదలోన్. ౧౭

క. మలిప్రాయమయ్యు మైబిగి
తలఁగియు నాబిడ కరంగుఁ దద్వర్ణనలన్;
గిలిగింతలకుఁ జలింపని
శిలాప్రతిమ యగునె యెట్టి జీర్ణ స్త్రీయున్? ౧౮

క. తాతకును దంపివెట్టెడు
నా తుంటరితుంటవిల్తుఁ డగడుపఱపఁడే?
బ్రాఁతిగఁ బ్రాయముతీఱిన
నాతిని జవరాలిఁజేసి నాటి శరములన్. ౧౯

క. ఒలికించుచు నొయ్యారం
బుల నమ్ముదియువిద మ్రోడుపూచిన పోల్కిన్
గలిగించుక మాటాడును;
వలపించుకొనంగ యత్నపరురాలువలెన్. ౨౦

గీ. అతని యాదృచ్ఛికోక్తుల నప్పుడప్పు
డాపె శృంగారపరముగా నన్వయించి
"ననుకొనుచునుంటి 'వెఱ్ఱివేదాంతి' వనుచు
గ్రంథసాంగుండ"వని వెటకారమాడు. ౨౧

గీ. "ధర్మసందేహమయ్యె నద్దానిఁ దీర్తె?"
అనిపిలిచి వాఁడు రాఁగ వెన్కాడి యడుగ
"మఱచితిని; మాటసందుల; మందమతినిఁ
బోనిలే! రేఁప" టంచు నమ్ముసలి వలుకు. ౨౨

గీ. "మోక్షమనఁ గర్మబంధవిమోచన"మని
వింటి మును; నేఁడు వేతొక్క వితము వింటి;
"నీవి మోక్షో హి మోక్ష" యం చీ వచోర్థ
మెఱుకపఱపుము నా" కని వృద్ధ యడుగు. ౨౩

గీ. తెలిసి నిర్మక్షికంబు తద్దేశమంచు
నా సతి యొకప్పు డతని డాయంగఁ బిలిచి
కెలనఁ గూర్చుండ వాని చెక్కిళ్లు బుడుకు
చలఁతిగాఁ గ్రేఁటుకొను చిట్లు వలుకఁ దొడఁగె. ౨౪

గీ. "సతము వర్ణింతు విట్లు నా చక్కఁదనము
కనులవిందుగఁ నేఁటికిం గానఁబడునె ?
మిసిమిప్రాయంపు మిసమిసల్ మించు నేను
నిక్కువంబుగఁ జక్కనిచుక్క సుమ్ము. ౨౫

క. ఎలజవ్వనంపు నా యా
టలుఁ, బాటలు, ముద్దుముచ్చటలు, నీటులు గో
టులుఁ గులుకులు బెళుకులుఁ గని
యల 'బంగారక్క' యిది యటంద్రు విలాసుల్. ౨౬

మ. కనులం గీటుచుఁ, దిర్గిచూచుచును, రాకల్ పోకలం జేయుచుం
బనివడ్డట్టులు, వీడెపున్ వలపుగ్రమ్మన్ డాసి చిర్నవ్వుతో
డను బ్రశ్నించుచు, మెల్చి వాతెఱను బంటన్ నొక్కుకొన్చుంద్రు మో
హిని వోలెన్ మొగసాల నిల్చిన ననున్ వీక్షించుచుం బల్లవుల్. ౨౭

క. వెలకిమ్మని యెరవిమ్మని
కలుకులు నా మేనితళుకుఁ గాంచుచు నను న
వ్వులకువలె నడుగుదురు లో
పలఁ దమ మగవారి తొట్రుపాటుఁ దలఁచుచున్. ౨౮

ఆ. వె. కోడెగాండ్ర గోడుఁ జూడఁజాల కొకప్డు
కనికరింప బుద్ధి కలుగుచుండె;
లేఁడిపిల్లవోలె గోడలు దాఁటుచు
రేలఁ జాల రసికురాలనైతి. ౨౯

క. సరసుల వక్రోక్తులకుం
బరాచకములకును, నాదు పైనివిసరు క్రొ
వ్విరిదండలకును నేనును
సరసతఁ బ్రత్యుత్తరింప సాఁగితి సరవిన్. ౩౦

క. మగనికి, నత్తకు, మామకుఁ
దగ నే సావిత్రి; సీత; దమయంతినిఁ; జ
క్కఁగఁ జదివి పురాణముఁ జె
ప్పఁగఁ బొగడెడివారు నన్ను వాగ్దేవినిగాన్. ౩౧

క. అచ్చముగా నీవలె నా
నెచ్చెలి యొకఁడుండెఁ; గల్వ నెచ్చెలిపగిదిన్
హెచ్చిన తమి ననుఁ గరములఁ
గ్రుచ్చుచుఁ బైకొనుచు ముదముఁ గూర్చుచునుండెన్. ౩౨

క. గొడుగుం బట్టును వెన్నెల
వడతాఁకున; కడుగు నేలఁబడనీక ననుం
దొడిగికొను మెయికి; నిసి నా
తఁడు దిష్టిందీయు నా వదనచంద్రునికిన్. ౩౩

క. తొలికతలు దలఁపునకు రా
వెలికుబ్బినహర్షమున ద్రవింపఁగ నెదయుం
గలిసినవాఁడవు గావుటఁ
దెలిపితినిఁ; బరాయివైనఁ దెలియఁబఱతునే?” ౩౪

కం. మనలో మాటొక టడిగెద;
వెనుకటి నాననుపుకాని విధమున నను వ
ర్ణన మొనరింతువు నిచ్చలు
మనస్సు నాపైకిఁ గొంతమళ్లెనె నీకున్? ౩౫

కం. మొలకెత్తెనొకో? నాపై
వలపున్నదియున్నయట్లు వచియింపుము! భీ
తిలకుము; నీదు రహస్యము
నలంతియును బయలుపఱప; నల్లరివెట్టఁ. ౩౬

గీ. సతతమును ధర్మశాస్త్రముల్ చదువుచుంటి;
తీవ్రజపముల దపములం దేలుచుంటి;
గలువకంటినిఁ గన్నెత్తి కాంచకుంటి;
ఘోటకబ్రహ్మచర్య మొక్కో? యిదెల్ల. ౩౭

కం. ఇది సహజమోయి! యిటు నా
యెదయును ౙడవచ్చు నీపయిని; నిది దోసఁగే?
బెదరుదురు పైకిఁ బలుకఁగ
మొదటమొదటఁ జిన్నప్రాయపుం బాలు రిటుల్. ౩౮

కం. మగవాఁడు మగువఁగాకా
మగువయు మగవానిఁగాక మహి వలతురొకో?
మగవాఁ డొక మగవానిని
మగువయు నొక మగువ? నీవుమాత్ర మెఱుఁగవే? ౩౯

క. మన తలనె ప్రొద్దుపొడిచెనె?
మన స్త్రీ పుంసమునఁ గలరె? మడిఁగట్టుక యుం
డినవార లొకరు? నుండిన
జను లామనిఁ బూఁతగొనని స్థాణువులుగదే! ౪౦

క. కలుగునె? మోహము వెలిగా
నిలమోదము; దీని తత్త్వ మిదమిత్థముగాఁ
దెలిసికొని కాదె! తొలిపూ
విలుతుని బ్రదికించి హరుఁడు విశ్వమున కిడెఁ. ౪౧

క. అని యొత్తుకొనుచుఁ దమినా
తని నడుమును గేలఁ జుట్టి, తద్వదనాబ్జం
బును దీర్చి నెటిక విఱుచుచు
తన మోమున మోముహత్తి తమకమున ననెన్. ౪౨

క. "ఇలఁ గ్రమ్మఱఁ బుట్టిననా
చెలువుఁడ వని తలఁతుఁ; గాక చిగురించునె యీ
లలి నామది? యిమ్మదిమిని
నెలజవ్వన మొందినట్లయితి నినుఁదాఁకన్. ౪౩

క, తొలుతటి శృంగార కథా
వళి తోడ్తో స్మృతికి వచ్చె; స్వాంతము కడుఁ జిం
దులుఁ ద్రొక్కెఁ; గౌఁగిలింపుము
నిలు పోపఁగఁజాల నొక్క నిముసంబేనిన్." ౪౪

చ. అనవుడు నాపదంతి కను నాతఁడు "ధన్యుఁడఁ గ్రాఁగుచుంటి నీ
మనసు నెఱుంగ కిందనుక; మా గురు వియ్యది విన్న రూక్ష వీ
క్షణుఁడయి నన్ గఠోరమగు శాపమునన్ హతమార్చు నుత్తర
క్షణమున; నా భయంబునను సాహసముం బొనరింపకుంటిఁజూ! ౪౫

గీ. అని వచింపంగ నా వృద్ధురాలు పలుకు
"నోయి! మందుండ! పర్వెత్తిపోయి యొంటి
గూర్చుచున్న కిరాతుఁ ద్వద్గురునిఁ ద్రుంచి
రమ్ము! నన్ను నిరంతరాయమ్ము కొమ్ము!" ౪౬

కం. ఆ పలుకు రోసి "యిసిసీ!
పాపముగదె! నాకు గురుఁడు, బ్రహ్మణ్యుఁడు, క
ట్టా! పావనుండు; వానిని
వ్యాపాదించుట; తలంపవచ్చునె యిట్టుల్?" ౪౭

ఆ. వె. అనుడు నా చెనంటి యను "నీవు వెన్కాడ
నేన పోయి వానినీల్గఁ జూతు;
వచ్చుఁగాత నాకె పాపంబు; కొంపొమ్ము
నన్నుఁ బట్టి వానియున్నగదికి. ౪౮

ఆ. వె. పాపమేమి? దాని ఫలమేమి? మూర్ఖుల
వెట్టి మొట్టి వ్రాఁత వేదమయ్యె;
నది ప్రమాణ మటె? గతానుగతికము లో
కంబు పారమార్థికంబుగాద." ౪౯

మ. అని వాక్రుచ్చి స్మరాంధురాలయి యిసీ! యావార్థకంబందు నే
మనవచ్చున్ సురపూజనీయు ముని యుక్తాయుక్తముల్ ద్రోసిరా
జని చంపన్ నడుముం బిగించికొని శయ్యం జయ్యనన్ లేచి యొ
య్యన నేనుంగుబలంబుతో నతని వెంటాడం దలంచెన్ మదిన్. ౫౦

కం. తమ మోక్షపదమథోనా
థము; దానికి నడ్డుదగులువాఁ డెవఁడే ధ
ర్మముఁ ద్రుంచి యిస్సిసీ! త్రెం
త్రమాంత మతివ లతిమోహహత లధమతమల్. ౫౧

కం. కని దాని రాక్షసత్వము
మనమున వెఱఁగంది "యాఁగుమా! తృటి; యిదిగోఁ
జనుదెంతు; నిన్నుఁ గొంపో
దున" యని బాసాడి డాసి తొరతొర గురునిన్. ౫౨

క. ఆ ముసలిజంతపలుకుల
నామూలాగ్రముగఁ దెలుపు చటఁ దడయఁగ వాఁ,
డామె విళంబం బోర్వక
తా మిస్రము నందు నొంటి దారిఁ దడవుచున్. ౫౩

మ. పడుచుఁ లేచుచు మిఱ్ఱుఁబల్లమగు భూభాగంబునం దెట్టులో!
కడ కాపాపి తటాన బాటఁగల పెన్గర్తంబునం గూలి య
ప్పుడ ప్రాణోత్క్రమణంబుఁ బొందు చెద వాపోయెం "దదాశ్లేషమేఁ
బడయంగా నయితిం గదా!" యని స్వదౌర్భాగ్యంబు నిందించుచుఁ. ౫౪

క. మఱునాఁడు పిలిచి శిష్యుని
గురుండు "స్త్రీశాస్త్ర మెఱిఁగికొందువె?" యనవాఁ
డురుభక్తి మ్రొక్కి "స్వామీ!
యెఱిఁగితి; జీర్ణించుకొంటి నే నీదు కృపఁ. ౫౫

క. సలిలగతమత్స్యగతియును,
నల యూసరవెల్లి వర్ణ, మహిపాదములం
దెలిసినవానికె తెలియును
జెలువల చిత్తంబు; పెద్ద చిత్రంబుగదా! ౫౬

గీ. ఎవఁడు దీర్చును నదివంక? నెమ్మెలాఁడి
కుటిలగతి దిద్ద నెవ్వండు గుళలుఁ డిలను?
బెద్దకాలంబు సెల్లిన వీని ప్రకృతి
విపరిణామంబుఁ గొనకుంట వింతగాదె? ౫౭

క. అనుభూత స్మరసుఖ వా
సన లనువర్తించుచుండు స్థావిరమును బొం
దినను జనుల; నింగువఁ గ
ట్టిన గుడ్డనుబోలి వారి డెందము లుండుఁ. ౫౮

ఆ. వె. మండుచున్న నిప్పు మగవాఁడు, మగనాలు
కరుడుగొన్న నేతిచెరవయంద్రు;
మండుచున్న నిప్పు మగనాలు, మగవాఁడు
గరుడుగొన్న నేతిచెరవయునగు. ౫౯

మ. గృహమేధంబున శాంతకాముఁ డయి పారివ్రాజ్యముం బొందు టి
మ్మహి నాకాశ సుమంబు మూర్కొనుట; కామంబే ప్రకోపించుఁబో!
బహుభోగంబుల నాజ్యహవ్యములకున్ వైశ్వానరుం; డట్లకా
మహతత్త్వంబును గోరువాని కిది సంభావ్యంబుగా దెన్నఁడున్. ౬౦

క. చపలము చిత్తం; బాపైఁ
జపలతరములు నయనములు; చపలతమములౌ
నపరాంగంబులు యువతికి;
జపతపములు సాఁగు టెట్లు? చక్కఁగ గృహికిన్. ౬౧

క. వలఁజిక్కిన పులుఁగుంబలె
వెలంది వలఁ జిక్కి కంటివేఁదుఱుచేతన్
వెలలఁగ వెరవుం గానక
గిలగిలమని కొట్టుకొనుచుఁ గెడయు జనుఁ డొగిన్. ౬౨

క. పిలుపులఁ, జూపుల, మైనిలు
పులపొలుపుల, వలువ తాలుపులఁ, బలుగతులన్
మలిప్రాయము పైఁబ్రాలినఁ
దొలిప్రాయము దొంగిచూచుఁ దొలఁగ వెఱచుచున్. ౬౩

క. ముదిసి శరీరము క్రుస్సిన
మదనాగ్ని నిరంతరంబు మండుచు మదిలో
వెదకికొను నింధనంబుల;
నది లేఁతముదుళ్లభేద మరయదు గాదే? ౬౪

క. కులసతి యని పెద్దలమె
ప్పులఁ గాంచుచుఁ గులటలందుఁ మొట్టమొదటిదై
మెలఁగు; సరస్వతి యెఱుఁగదు;
వెలంది యీ విద్య నేర్పు వెన్నలతోడన్. ౬౫

క. జనములు సంసారాంబుధి
మునిఁగి యధోగతికిఁ దారు బోవుచు నా కా
ముని కనుకట్టునఁ జిత్రం
బనుకొందురది దివ్యలోకయాత్రయె యనుచున్. ౬౬

క. హరిభాగవతులుగానీ
హరభాగవతులుగాని యగపడరు ధరన్;
స్మరభాగవతులె యెల్లరు
నరనారీమండలంబునను శోధింపన్.” ౬౭

క. అని నొడివి గృహస్థాశ్రమ
మున కప్పుడె స్వస్తిచెప్పి పోక మనికికిన్
మునిఁగి తపోధ్యానంబులఁ
జనె స్వర్గంబునకు బోధిసత్త్వునితోడన్. ౬౮



# జాతక కథా గుచ్ఛము

## తృతీయ భాగము

---

## సద్ధర్మజాతకము

క. చెలరేఁగెఁ గాటకము దొలిఁ
గళింగరాజ్యమునఁ; వాపికా కూప సర
స్సులు వట్టిపోయెఁ; గల పం
టలు మలమలమాడి చెడెఁ గటా! బ్రదుకెట్లో? ౧

క. తృణజలకాష్ఠసమృద్ధిగఁ
గనఁబడు రాజ్యం బెడారి కాఁగాఁ బశువుల్,
మనుజులును, మరీచికలను
గనుంగొని మునుంగఁబాఱి కాడ్పడిరి కడున్. ౨

క. పులిమీఁదఁ బుట్రవలెఁ జో
రులు రేఁగిరి; మిత్తి రోగరూపంబులతో
నలుఁగడల విఱుచుకొనిపడి
బలిగాఁ గొనుచుండె సర్వభక్షకునివలెన్. ౩

క. పుడిసెఁడు నీళ్లను గట్టా!
పిడికెఁడు మెదుకులును బెద్దపెద్ద ధనికులున్
విడిముడిఁ గడువెచ్చించియుఁ
బడయర; తెలియు నెటు బీదవారల పాటుల్. ౪

క. దరిసించి ప్రజలు ధరణీ
పురందరుని, డొక్కలెండ, మోములువాడన్
మొఱగొని రెలుంగురాల్పడఁ
బరిపరివిధములను దమ్ముఁ బ్రావంబ్రోవన్. ౫

గీ. స్వప్రజార్తినిఁ బాఁప నా క్ష్మాధవుండు
వరుణజపములఁ జేయించె గురునిబోధఁ;
గడు సహస్రఘటాభిషేకములు నడపె;
నొక్కచుక్కైన రాల్పకయుండె నింగి. ౬

మ. అగుఁ బో! పెద్దఫలమ్ము స్వల్పమయినన్ యత్నమ్ము; యత్నమ్ము పె
ద్దగ నున్నన్ ఫలమబ్బు స్వల్పముగ; యత్నమ్మున్ ఫలమ్మున్ సమ
మ్ముగఁ బొల్చున్; జతన మ్మొకింతయు ఫలమ్మం జూప; దొక్కప్డరి
ష్టగతిం దెచ్చును ద్రవ్యఁగూపము పిశాచం బుద్గతంబైనటుల్. ౭

క. జతనము వమ్మయి యన్య
ప్రతికారము దోఁప కెద విపన్నప్రజ దు
ర్గతిఁ బాఁప లేమిఁ బొగిలెడు
క్షితిపతిఁ గని దేశికుం డొగిం బలికె నిటుల్. ౮

ఆ. వె. "ఇందవత్త"పురము నేలు ధనంజయ
పతికిఁ గల దొకండు పట్టగజము;
వసుధ దాని మహిమ వాచామగోచరం
బది లభింపఁ గురియునయ్య! వాన. ౯

గీ. అడుగువెట్టిన దాదిగా నా గజంబు
గురియు నెలమూఁడు వాన లా ధరణియందుఁ;
బంటబండును ముక్కారుఁ; బరగుఁ దరులు
మూఁడుపూ లాఱుకాయల పొలుపుతోడ. ౧౦

క. దానగజం బదియయ్యె ని
దానం బాఱేని దానధర్మంబులకున్
దూఁణాశమైన శత్రు
శ్రీనిం బద్మినినివలె హరించె మొదలితోన్. ౧౧

ఆ. వె. ఈ దృశంబు క్షామమేకాక యే యీతి
బాధయేనిఁ గనక స్వప్నమునను
నెగడుచుండు సుమ్మ! నిత్యకల్యాణంబుఁ
బచ్చతోరణంబు వాని నేల. ౧౨

గీ. కామధేనువువోలె నా గజము వెలయఁ
బెరటి, శతవార్షికంపుదుర్భిక్షమైనఁ
జీమకుట్టిన యంతైనఁ జింతఁగొనక
పెండ్లివిందులతోడ జీవించుఁ బ్రజయు. ౧౩

శా. సందేహింపకు మోప్రభూ! మనల కాస్తంబేరమోత్తంస మే
చందానన్ లభియించునో యనుచు; యాచ్ఞాదీనులం గాంచినన్
డెందం బాతనికిన్ వసంబఱు; నెదేనిన్ వెన్కముందాడ కి
చ్చుం; దర్శింపమ భూతభావులను దత్క్షోణీంద్రు సాటొక్కనిన్. ౧౪

క. కను లూడఁబెఱికి యిచ్చును
గనఁబడఁ గాణుండు; దనదు కాలోక్కసియుఁ బం
గుని కంటింపఁ దలంచును;
వినియుంటివె యిట్టి స్వార్థవిరహిత వృత్తిన్? ౧౫

క. అవితథము బోధిసత్త్వుం
డవతారం బెత్తియుండు నాయొడయఁడుగా!
ఎవ రేమడిగిన నిడి త
క్కువగాఁ దలపోసి మరలఁ గొసరించుకొనున్. ౧౬

క. నవనిధు లున్నవొ? యాతని
నివాసమున; నీవిమ్రాను నెలకొనెనో? యహ
ర్దివ మెంత దాన మిచ్చిన
లవవేశము వెలితిరాదిలానాథునికిన్." ౧౭

మ. అని కర్తవ్యము బోధసేయుడుఁ గళింగాధీశ్వర ప్రేరితా
వనిదేవుల్ చని యా ధనంజయుని సంప్రార్థించి తద్దత్తవా
రణముం దెచ్చి యొసంగ హృష్టుఁడయి యా రాజిచ్చి పెన్కొన్కలా
జనులం బంపి కరీంద్ర మన్వహముఁ బూజల్ సేయుఁ బెన్నిష్ఠతోన్. ౧౮

గీ. కడచినను బెద్దకాలంబు గానఁబడద
దాని సేవాఫలము వీసమేనిఁ దుదికి;
వ్యయమె కాని యాయంబు శూన్యంబ; వట్టి
గొడ్డు తాకిట్టిదియటంచు గునిసెఁ బతియు. ౧౯

క. అరుదెంచి మరల గురుఁడా
ధరావరుని యత్న విఫలతాసంతప్తుం
దరిసించి పల్కెను "బ్రభూ !
పొరపడితిమి ; ధర్మలోపము తటస్థించెన్. ౨౦

మ. పతి వంచించి చరింత్రు బోంట్లు ; పితృసేవల్ పుత్త్రికుల్ సేయ ; రు
ద్ధతి నాచార్యులఁ జీరికిం గొనరు ఛాత్రవ్యంసకుల్ ; కన్యకల్
పతిహీనల్ విడనాడి వావివరుసల్ వర్తింత్రు ; సోదర్యులుం
బ్రతికూలింతు రొకళ్లొకళ్లు ; సెలఁగెం బాపంబు రాజ్యంబునన్. ౨౧

క. ఆ పుణ్యశ్లోకుం డగు
భూపతి సద్ధర్మ మార్గమునఁ బాలించుం ;
బ్రాపించుఁ దత్ఫలంబుగ
భూప్రజ పుంఖానుపుంఖముగ శ్రేయంబుల్. ౨౨

గీ. తెలిసి యాఱేని సద్ధర్మమున తెఱంగుఁ
బాలనమొనర్పు ; మంపుమీ ! పద్మ మరల
వ్యాధి యొక్కటి మందొక్కటైనయట్టు
లయ్యె"నని యూఱడించి కార్యంబుఁ దెలిపె. ౨౩

గీ. అంతఁ గాళింగకావనీకాంతదూత
లా ధనంజయు దర్శించి యాత్మకీయ
కథ సమూలంబు నెఱిఁగించి ప్రథితమైన
యతని సద్ధర్మములఁ దెల్పుమనిరి భక్తి. ౨౪

గీ. విని ధనంజయ భూపతి యనియె నిట్లు
"గాను నిష్ణాతుఁడను దానిఁ గఱప మీకుఁ;
బలుకఁజాలను దూచాలు దొలఁగకుండ
నోలి సద్ధర్మ మేనేలుచుంటినంచు. ౨౫

క. అనయము నా ధార్మికపా
లనమున రాజ్యంబు పుష్కలంబు, సుభిక్షం
బు, నిరీతియు, నని వినఁబడు
జనశ్రుతికి లజ్జితుఁడ నిజంబుగ వినుఁడీ! ౨౬

క. "క్షితి ధర్మో రక్షతి ర
క్షిత" యందురుగాదె? ధర్మకృతి నసిధారా
వ్రతధుర్యులైన జనసం
తతి పొందకయున్నె సంతతశ్రేయంబున్? ౨౭

క. ప్రథితమగు 'యథారాజా
తథాప్రజా' యన్న పలుకధర్మపరముగాఁ;
గధియింతు "తథారాజా
యథాప్రజా" యనియె ధార్మికాచారమునన్. ౨౮

గీ. ఆ సముద్రమహీరాజ్యమం దెసంగు
ప్రాణికోటులఁ బట్టకుత్పథమొకండుఁ
గాంచుటకు సహస్రాక్షుండఁ గానుగాదె?
ధర్మబోధకు నేనెట్లు దగుదుఁ జెప్పుఁడీ! ౨౯

క. మనసొకటిగ, మాటొకటిగఁ
బనియొకటిగఁ గాక యేకభావత ధర్మం
బనువర్తింతును ; గానీ
కనంబడని పాప మెంత గలదో ? తెలియన్. ౩౦

గీ. బాల్యమున యందు నా కుగ్గుబాల రంగ
రించి సద్ధర్మములను ద్రాగించినట్టి
తల్లి శతవృద్ధ గల ; దాపె ధర్మపథము
రేఖయుం దప్ప కెపుడు వర్తించుచుండు. ౩౧

చ. కనఁబడుఁ బైకి ధర్మముగఁ; గాదది ధర్మ; మధర్మ మేయనం
గనఁబడుఁ బైకి; ధర్మమది ; కావెఱుఁగంగ నదో రహస్యముల్
జనములు మూఢచిత్తులయి సాఁగుచునుందురు ముందుఁబోవువా
నినిఁ బడి ; పారమార్థికము నిక్కమెఱుంగును నాదు దల్లియే ! ౩౨

క. దరిసించి నాదు జననీ
చరణాబ్జ ద్వంద్వమునకు సాఁగిలి బత్తిన్
ఎఱుఁగుఁడు ధర్మం ; బాయమ
గురువులకుం గురువనం దగుంజుఁడీ ! పుడమిన్. ౩౩

చ. తెలిసినయట్టి ధర్మములఁ దెల్పుదునేను "నహింసతోడ మీ
ర్మెలఁగుఁడు ; దానితోడన యమిత్రుల గెల్వుఁడు ; దాని ముందు క
త్తులను గటారులుం బెదరి దూఱి యొఱం గడు దాఁగియుండెడిన్;
దెలియరొకో ? భువిన్ 'మృదువు తీక్ష్ణతరం'బను సూక్తిరత్నమున్. ౩౪

ఆ. వె. అనృతమాడకుండుఁ డల్పిష్ఠమేనియు
మైలపడును దానమహిమ మెల్ల
వేయునేల ? విసము పిసరంత రాలినఁ
గలుషితంబుగాదె కడవ పాలు ? ౩౫

గీ. కళ్లెము సడల్చురేఁ దురంగములువోలెఁ
గ్రేళ్లు దాఁటుచునుండు నింద్రియగణంబు;
పడఁగలరు దల్లక్రిందుగా బాట నెటనొ ?
ప్రాప్య మప్రాప్యమగు వేయిబాములకును. ౩౬

క. గరళప్రాయముగా మదిఁ
బరకాంతాకనకములను బాటింపవలెన్;
ధర నమృతప్రాయత గో
చరించి యూరించు నవ్వి జనచిత్తములన్. ౩౭

ఆ. వె. వలదు ! వలదు ! మద్యపానం బొకప్పుడు;
నంతకన్నఁ బాప మవని లేదు;
గుఱిగొనం దలంపకుఁడు రౌహిణేయుఁ; బు
ణ్యంబె బుధుఁ డొనర్చు నఘమదెల్ల ? ౩౮

క. కృతమైన నకృతమైనను
మతిఁ బుట్టిన దురితవృత్తి మానిసులను దు
ర్గతిఁ ద్రోయుట నిశ్చప్రచ;
మెతఁడు మనోజేత వాఁడ యేగు సుగతికిన్." ౩౯

క. అనుచు ధనంజయుఁ డాడిన
యనుదార మనుత్తమంబు నగు సద్ధర్మం
బును వ్రాసి కనకఫలకం
బునఁ, గొని సెల వతని తల్లిపొంతకు దూతల్. ౪౦

క. చని మోఁకటిల్లఁగా వ
చ్చిన కర్జం బెఱిఁగి యాఁకె సెప్పందొడఁగెన్
"వినుఁడీ ! త్రిశుద్ధి గాన
మ్మను; సద్ధర్మముఁ జరింతు మానక యనుచున్. ౪౧



క. ఇరువురు పుత్త్రులు నా కిరు
వురు గోడండ్రురును గలరు; భూపతి జ్యేష్ఠుం
డిరువురిలో; నాతని భా
ర్య రాణి; యది యన్న నాకుఁ బ్రాణము సుండీ! ౪౨

క. నను దర్శింపఁగ వచ్చిన
జను లిచ్చిన కాన్కలందు సద్వస్తుతతిం
బనిచితి దానికి; రెండవ
తనయుని సతి కంపియుంటిఁ దచ్ఛేషంబున్. ౪౩

క. ఇరువురు పుత్త్రులు నా కిరు
వురు గోడండ్రురును నొక్క పోలిక గాదే?
పొరపులు చూపించునె ధర
తరులకు, లతలకు, స్వసారదానక్రియలన్? ౪౪

గీ. భువిని సద్ధర్మదీక్షను బూను నాకుఁ
ద్రాసుచందానఁ జరియింపఁ దగిన నాకు
మూటగట్టుక కూర్చున్న ముదికి నాకుఁ
బక్షపాతం బదేల? చెప్పంగ సిగ్గు. ౪౫

క. కలుషితమతి నైతిని; మీ
రలు నా కోడలిని డాసి ప్రార్థింపుఁడి! యా
లలనామణి సద్ధర్మముఁ
గల నైనం దప్పు దీఁగకాలంతేనిన్." ౪౬

క. అనుటయు వారలు చని యా
వనితాతిలకంబుఁ గాంచి భక్తిఁ గొలిచి వ
చ్చిన కారణంబుఁ దెలుపఁగ
మన సటునిటు నూఁగులాడ మానిని పలికెన్. ౪౭

చ. "మునుపొకనాఁడు నాదు పతి భూధవుఁడైన ధనంజయుండు నా
తని యనుజుండుఁ గూడి యరదంబున డంబున సూర్యచంద్రులో
యనఁ జనుచుండ రాజపథమందు గవాక్షమునుండి కాంచితిన్;
అనుపదమందె కైరవిణినైతిని; గగ్గుఱుపాటు నొందితిన్. ౪౮

క. మును కనకనలాడెడు ని
ప్పును ముట్టినఁ దుహినఖండమువలెం దోఁచెన్
వినుఁ డిప్పుడు దానినిఁ దాఁ
కనె వెన్కాడుదును హృదయ కాలుష్యముచేన్. ౪౯

గీ. దాన సద్ధర్మమును యథాతథము నేను
బాలన మొనర్పనైతినిఁ బలుకు లెట్లు?
మా పురోధ పునీతుండు మాన్యచరితుఁ
డార్యసమ్మతుఁ డాతని నడుగఁ బొందు. ౫౦

గీ. అద్దమును గాంచి మోమును దిద్దుకొన్న
చందమున వాని చందంబు సతముఁ గాంచి
దిద్దుకొందుము మేము నీ దేశజనులు
నతఁడె సద్ధర్మబోధకు నర్హతముఁడు." ౫౧

క. అనవుడు వారలు చని బ్రా
హ్మణాగ్రగణ్యుండు, గుణ్యుఁడై గుణ్యులయం
దనవద్యుఁ డగు పురోధసుఁ
గని యభివాదించి స్వీయకథ దెలుపుటయున్. ౫౨

చ. పలికెఁ బురోహితుం డిటులు భవ్యవిధంబున "మొన్న నేను రా
ట్తిలకుని దర్శనార్థము వడింజనుచున్ శతవృద్ధనౌటఁ గా
ల్మెలివడి తూలి బాట నడిమిం బడిపోతిఁ; గుఱంగటన్ మహో
జ్జ్వలమయి వల్గ దశ్వమగు స్వర్ణరథం బగపట్టె నత్తఱిన్. ౫౩

చ. కనుఁగొని సాభిలాషముగ "క్ష్మాపతి దీనిని నాకు నేల య
ర్పణ మొనరింపరాదు ? నడువంగనుజాలన వార్ధకంబునన్ ;
గనికర మొందఁదేల ? ననుఁ గాంచి యతం" డనుకొంచుఁ గించతోఁ
జనితని నెట్టుకొం చతని సన్నిధిలోనికి నెట్టకేలకున్. ౫౪

గీ. ఒడలు ముడఁతలువడెను ; బండ్లూడిపోయెఁ;
గన్ను చూపందదు ; చరింపఁ గాళ్లురావు;
అన్యదీయార్థమందుఁ బేరాసమాత్ర
సన్నగిలకుండె ; సద్ధర్మమన్న నిదియె ? ౫౫

ఆ. వె. ఏవగించుకొందు నేనయి నన్ను ; స
ద్ధర్మ మెట్లు కఱపఁదగుదు మీకు ?
స్వయముగాఁ జరింపఁ జదురుచాలని వాని
కఱచు కఱపు వట్టి బురదగాదె ? ౫౬

గీ. అట్లగుట మీర లిటనుండి యరిగి కాంచుఁ
డున్న దీయూర బోగంపుచిన్నదొకతె
కన్నుఁ గుట్టించు మెయివన్నెచెన్నుతోడ
నూటలూర్చు నొయారంపు నీటుతోడ. ౫౭

గీ. ధనపతికి నీడుజోడైన ధనికుఁ డొకఁడు
మరులుగొని దానిఁ గని తాఱుమాఱునెంది
రాత్రి వచ్చెదనంచు వరాలమూట
సంచకారంబుగాఁగఁ బంపించె ముందు. ౫౮

గీ. వాఙ్మనఃకాయముల భోగవనిత యతని
నగ్నిసాక్షిగఁ బెండ్లాడినట్టి పతిగఁ
దలఁచి యా మూర్తమున నుండి వలచి పెద్ద
యెదురుసూచెను వానికై యెల్లరేయి. ౫౯

గీ. కడచెఁ దొలినాఁడు ; మలినాఁడు నడచిపోయె;
నవ్వలవ్వలి నాళులు నట్ల చెల్లె;
వారములుఁ బక్షములు నెలల్ వత్సరములు
జరిగె నాతండు రాఁడయ్యె సాని కడకు. ౬౦

క. ముడిచిన పూవు నలంగదు;
తొడిగిన తొడవొండుఁ జెదరదు ; దుకూలపుఁ గ్రొ
మ్మడఁతయు మాయదు ; కన్పడుఁ
బడంతి నెమ్మొగమె వాడి ప్రత్యూషములన్. ౬౧

క. నెలకై నిచ్చలు వెన్నెల
పులుంగు చందమున వాని పొత్తులకై యు
వ్విళులూఱుచు వలవంతల
నలఁగుచుఁ జెయిఁ జెంపఁజేర్చి నవలాయుండున్. ౬౨

మ. క్షితిఁ బువ్విల్తుని నీటుగోటుల నధిక్షేపింపఁగాఁజాలు రా
ట్సుతు లేమేమని వేలు లక్షలును గోట్లుం గాన్కలం బంచినన్
సతి గన్నెత్తియుఁ గాంచఁబోదు ; కసరుం దత్సేవకవ్రాత ; మె
వ్వతె వేశ్యాకులజాత పూతమతియై వర్తించు నేవంగతిన్. ౬౩

క. అడవిం గాచిన వెన్నెల
వడువున నుపభోగ్య గాక ప్రాయం బెల్లం
గడపును ; బతివ్రతాశిని
వడఁబోసిన సారమీ యువతి యనవచ్చున్. ౬౪

క. చెవి నిల్లు కట్టుకొని దా
ని వంగసపువా రదే పనిగఁ బోరిన నా
జవరాలు వినక సైఁపక
జవదాఁటక కడపుచుండె సద్ధర్మంబున్." ౬౫

ఆ. వె. అని వచింప దూత లటకేగి వెలయాలు
కొలముచే సుశీల గొనముచేత
నైన దానిఁ గాంచి యాత్మీయవృత్తాంత
మెఱుకపఱుప నదియు నిట్లు వలికె. ౬౬

మ. "వినియున్నారలు మీరు మామకకథావిస్తారముం గొంతఁ; బై
వినుఁ ; డోలింగడు బీదరాలనయి నిర్విణ్ణత్వముం బొంద జీ
వన మెట్లంచు విటుండొకండు పెరిమం బ్రాపించి వెయ్యాఱు లి
చ్చినఁ గాంక్షించి గ్రహింపఁగొంకుచును నాచే సాఁచితిం దుర్గతిన్. ౬౭

ఆ. వె. అంతలోన నాకు స్వాంతంబు జల్లనఁ
జేయిఁ దీసికొంటిఁ జీ ! యటంచు
గల్లుమంచురాలె ముల్లియ నేలపై
విటుఁడు దెల్లవోయి వెళ్లిపోయె. ౬౮

ఆ. వె. దానిచేఁ గళంకితంబయ్యె సద్ధర్మ
మేను మీకుఁ గఱవ నేమి నేర్తు ?
అనుదినంబుఁ గ్రాఁగు చనుతాపవహ్నిలో
సడలకుంటి బ్రహ్మచర్య దీక్ష." ౬౯

క. అన, వా రీ సద్ధర్మం
బున కీషన్మాత్రమైన మొఱికికె వీరల్
మనమునఁ బస్తాయింతురు;
కనఁగలమే ? వీరి మీఱఁ గల ధార్మికులన్. ౭౦

క. కృతమైన నకృతమైనను
మతిఁ బుట్టిన దురితవృత్తి మానిసిని నధో
గతిఁ ద్రోయుఁ; నాతఁ డనుత
ప్తతఁ గనకము శుద్ధి నట్లువడయును సుగతిన్. ౭౧

ఆ. వె. అనుచు మెచ్చుకొనుచు నా రాష్ట్రియుల నెల్లఁ
జని స్వకీయ రాజ్యమునకు మరలి
యా ప్రభుండు దెలిపినట్టి సద్ధర్మంబు
లచటి కతలుఁ దెలిపి రాత్మపతికి.

మ. క్షితి *సద్ధర్మము నాఁటఁగొలెను బ్రతిష్ఠింపం గళింగావనీ
పతి, శాంతిల్లెను దొంటి దుఃస్థితులొగిన్, బంటల్ పదార్వ్యసముల్
మితినిన్ మీఱిన పాఁడియుం బ్రబలె; మేల్మేల్ తీరులన్ స్వప్రజా
తతి వర్ధిల్లె నఖండ సౌఖ్యములు, భద్రంబుల్ వరింపం దమిన్.



# జాతక కథా గుచ్ఛము

## తృతీయ భాగము

---

### పిశాచ జాతకము

క. మును బోధిసత్త్వుఁ డొకపరి
జనించె వారాణసీ రసాపతి సుతుఁడై
యనిపించె వేయిచంద్రుల
తని యిలు వెలిగించి రద్భుతముగా ననుచుఁ. ౧

సీ. వెలికిలఁగాఁ బండి చిలుకల పందిరి
చెప్పవాల్పక చూచు నొప్పిదంబు
బోరగిల్లఁబరుండి మోమెత్తి పడగనాఁ
దిరుగుచుఁ బొట్టతో దేఁకు పొలుపు
మొలనూలిగజ్జెల చెలువంబు వడ్డిగాఁ
బరగ మోఁకాళ్లతోఁ బ్రాఁకు సొగసు
పడుచు లేచుచుఁ దప్పటడుగులు వేయుచం
దము సింద బుడిబుడి నడుచు వడువు
గీ. చిలిపిచేఁతలు, ముత్యాలచిఱునగవులు
తిరుగుడులు రాక గజిబిజిం దొరలు పలుకు
లేల నుడువంగ ? బాల్యమం దెట్టిచేష్ట
హర్షవారాన్నిధిని నోల లార్పకుండు ? ౨

గీ. అమృత భాండంబునుం బోలె నా కుమారుఁ
జుట్టుకొని తల్లిదండ్రులు చుట్టములును
ముద్దుముచ్చట్లఁ గాలంబుఁ బుచ్చుచుండ్రు
వాని క్రీడాసుధారసం బానికొనుచు. ౩

క. కనుచున్నవాని ముద్దులు
గనుతలఁపే ; వినుచునున్నఁ గడువాని నుడుల్
వినుతలఁపే వారికి ; ధా
త్రిని 'శ్రేయసి కేన తృప్యతే ?' యండ్రుగదే ! ౪

గీ. వాఁడు త్రిచతుర వత్సర ప్రాయుఁడగుడు
మాతృగర్భంబు ఫలియించె మరల "నహహ !
పండుగులపైనిఁ బండుగుల్ వచ్చె" ననుచుఁ
బితరు లానందమొందిరా సుతులఁ గనుచు. ౫

క. దురదృష్టరేఖ పైఁబడఁ
దరలెం దివి కకట ! సిసులతల్లి రుజార్తిన్
ధరఁజూపోపఁ డిసీ ! తా
మరచూలి తలంచుఁ ద్రుంచ మధ్యనె సుఖముల్. ౬

మ. నదిప్రాయంబున నున్న యా యొడయఁ డున్మాదంబు గొన్నట్టులై
విడి యాహారము నిద్రయుం దలఁప కుర్వీరాజ్యముం, బిడ్డలం;
బడియుండంగ నమాత్యులుం బ్రకృతులుం బల్మిన్ మెడల్ విర్చి య
ప్పుడు పూఁబోఁడి నొకర్తుకం బరిణయంబుం జేసి రాజేనికిన్. ౭

క. చెదరిన చిత్తము మరలం
గుదుటంబడెఁ; బూవుదోఁటఁ గోకిల గూసెన్;
ఉదయాస్తమయము లెఱుఁగని
మది నాతఁడు ముదితఁగూడి మాడి చరించెన్. ౮

క. అలరునుషాసాసూర్యుల
వలె నా దంపతులు దివ్యభావమున జనం
బులు దమ నభ్యర్చింపఁగ
విలోకనీయత్వ మొంది వెలిఁగిరి మిగులన్. ౯

క. క్షితి ధర్మార్థములన, క్షాం
తితేజములునా, శ్రుతిస్మృతిద్వయ మనఁగా
నితరేతరసంగతి మెయి
సుతయుగళము వృద్ధినొందెఁ జూపఱు వొగడన్. ౧౦

క. పదితల్లులపెట్టున నొ
ప్పిదమగు చందములఁ దండ్రి వీరలఁ గనుచున్
"మదిఁ దల్లిలేని కొదువను
నెదియుం దీర్పంగరా దిసీ!" యని వగచున్. ౧౧

క. తన యంతఁదానె రా నా
మని మొగ్గందొడుగు తరువు మాదిరి జ్యేష్ఠుం
డును, దోహదమున వలె నా
కనిష్ఠుఁడును గొనిరి విద్దెఁ గాలమునందున్. ౧౨

చ. సతి తన చిట్టకంబులనుజాలమునందుఁ బులుంగువోలెనై
యతితమ పారవశ్యమున నాతఁడు మున్గిన నందు సూచి కాం
క్షిత రతిఁదేల్చువేళఁ బడసెన్ వరమొక్కరుఁ; డా వరంబెదో?
యతివ వచింపలే; దడుగఁడయ్యె నతండును మోహమగ్నతన్. ౧౩

గీ. నెలదప్పె నప్పటికె నా
లలనాతిలకమున; కది దలంచియ మది నా
చెలి వర మడిగెనొ? లోఁతగు
నెలఁతల చిత్తంబు ద్రవ్వ నేరము గాదే? ౧౪

క. కడవఁగఁ గొండొకకాలము
పడఁతుల మానికము రాణి వడసెఁ గొడుకు; నా
తఁడు సూర్యాచంద్రమసుల
కెడ గూడిన జ్వాలనుఁ డంచు క్షితిపతి దలఁచెన్. ౧౫

క. తన యౌరసపుత్త్రుల రీ
తిని మొదటం జూచుకొన్న తెఱవ యిపుడు వా
రిని వైమాత్రేయులగనె
కనఁదొడఁగె; యథార్థమంతె కద! యూహింపన్. ౧౬

గీ. చదువుసాముల మెఱియయై జవ్వనంపు
సొగసుసొంపులఁ దగు జ్యేష్ఠసుతునిఁ గాంచి
యౌవరాజ్యాభిషిక్తుఁ జేయం దలంచి
నరవరుఁడు సేయుచుండె సన్నాహములను. ౧౭

ఆ. వె. తెలిసి రాణి వచ్చి దీనాస్యయై రాజు
నెదుట నిలువ నాతఁ డదవదపడి
హేతు వడుగ నదియు నెలుఁగు గ్రేటుచుఁ గొంత
వరము మాట జ్ఞప్తిపఱచె మెల్ల. ౧౮

గీ. చొక్కమందైన తన రాణియక్కనందు
మైమఱచియుంట నానాఁడు క్ష్మాధవుండు
అడిగినట్లా పడంతి తా నిడినయట్లు
స్మృతివహింపఁడ తొలిబాముకతను బోలె. ౧౯

క. అగుననియుఁ గాని, కాదని
యుఁగాని బదులాడఁబోక యుర్వీపతి య
మ్మగువకు, ముదుంచుకొని తన
మొగంబు, మదిమునిఁగియుండఁ బొలఁతుక వలికెన్. ౨౦

మ. "అకటా! విస్మృతిఁ జెందినావె? మును శయ్యామందిరంబందు ద
ర్పకుఁ డస్త్రంబుల నూఱుచుండ మన పర్యంకంపు పట్టంబునన్
శుకముల్ శారికలున్ వినంగనట సాక్షుల్ గా వరం బీయవే!
సకలజ్ఞుండవు నీకుఁ దెల్పఁగ నవశ్యం బేమి? ప్రాణేశ్వరా! ౨౧

క. అవనీపతి ! నా పుత్త్రుని
యువరాజునుగా నొనర్పు మోడక; యిది ధ
ర్మమువు; నారాయణరూపుం
డవు నరపతి ధర్మపథము నగునే తప్పున్ ? ౨౨

క. వరమును జెల్లింపనిచో
నరనాథా ! యొట్టుసుమ్ము ! నా పైని" నటం
చఱిముఱిదోపఁగఁ గంఠ
స్వరమును హెచ్చించెఁ బెద్దసాఁగఁగ నూర్పుల్. ౨౩

క. అప్పటికిని మారాడని
యప్పతిఁ గని రాణి "పురుష లక్షణకాంద్ర
న్న ప్పలుకు యథార్థం" బని
దెప్పుచుఁ దెగడుచును జనియెఁ దీవ్రపుటలుకన్. ౨౪

ఉ. అంతట ఱేఁడు గొంతవడి కా బెడిదంపుఁ దుపానువీడఁగా
స్వాంతము సంబళించుకొని "సాహసురాండ్రు గదా ! నెలంతుకల్
పంతముఁ బట్టిరేని నెటువంటి యగాత్యముకైనఁ గొంక రా
వంతయుఁ; జేయనేర్తురు గృహంబును స్వర్గము నారకంబునున్. ౨౫

క. సుతు లున్నవారి కిస్సీ
ద్వితీయ పరిణయము వింతవితపు మరణమే !
అతివ సహింపక తొల్లిటి
సతి తనయుల యభ్యుదయముఁ జంపక చంపున్. ౨౬

క. పట్టినచో భల్లూకపు
పట్టే; గయ్యాళితనము పారము ముట్టున్
ఎట్టిండు నొగ్గియున్ననె
యట్టిట్టులు నాక సౌఖ్యమందుచు బ్రతుకున్. ౨౭

క. తన యిచ్చఁగాక పడఁతుక
తన ప్రేలినినై న వంపద యథార్థముగాఁ
దన పతి యానతిమెయి; నా
తనిపయిఁ జూపించు ప్రేమ తనకొఱకె యగుజ. ౨౮

మ. తన సాపత్నులు వీరటన్న యొక భేదం బెంచె మున్ముందు; వీ
ర్తన పుత్రాభ్యుదయాంతరాయములుగాఁ దల్చెజ మదిజ; బతిపా
తినిగా నన్ను గ్రహించె; బాసతినెఁ; జింతింపంగ నివ్వేల్లఁ బై
కనరా; దేక్షణ మెట్టులుండునొ కదా ! యంచుజ భయం బయ్యెడిజ." ౨౯

మ. అని చింతించి కుమారయుగ్మకము నాహ్వానించి, యేతెంచి బ
త్తినిఁ బాదంబుల వ్రాలువారినిఁ గడుం దీవించి చేయెత్తి, 'లెం'
డని గాఢంబుగ సందిటం దిగిచి యత్యంతంబు ముద్దాడి క
న్గొనలం జాఱెడు బాష్పముల్ తుడుచుకొన్చుం దాఁ గుమారిల్లుచుజ. ౩౦

మ. పలికెం "బుత్రకులార! మీరు వినుఁడీ ప్రాంతస్థమౌ కానలోఁ
గలఁడాచార్యుఁడు మౌనిచంద్రుడు పుమాకారాప్త వాగ్దేవి మీ
రలు తత్పాదము లాశ్రయించి పరిపూర్ణత్వంబు సాధించి వి
ద్దెల, రం డాపయి జ్యేష్ఠు రాజ్యమున ద్వైతీయీకు సైన్యంబునజ. ౩౧

క. అభిషేకించెదఁ బొం"డని
ప్రభూత్తముఁ డెడంద నడవి పాల్సేయుటకా
యుభయులఁ గడింది గుములుచు
శుభాశిషము లొసఁగి మరలఁ జుంబించి యనుజ. ౩౨

క. "మునివర్యుల శుశ్రూషణ
మున ముక్కాఁకలనుదీఱు పురుషుఁడె జనరం
జనమున రాజను నన్వ
ర్థ నామధేయంబు నొంది ధరణి వెలుంగుజ. ౩౩

క. అనుడుఁ గుమారులు జనకుని
యనుజ్ఞ మదియం దనుగ్రహముగా సంభా
వన నేసి బయలుదేరిరి
వనమున కా తృటినఁ గట్టుబట్టల తోడన్. ౩౪

మ. చనుచుండంగ సహోదరుల్ పురబహిస్థంబైన పూఁదోఁట దా
పునఁ గ్రీడించుచునున్న యా సవతి తమ్ముం డొయ్యనన్ వీరలం
గని వృత్తాంత మెఱింగి వెంటఁ గొనిపోఁగాఁ బెద్ద ప్రార్థించి త
న్ను నిషేధించినఁ బట్టు వీడ కరిగెం దోడ్తో నరణ్యానికిన్. ౩౫

క. అలఁతియుఁ గలఁతను బొందని
సలిలాశయ మట్లు సుప్రసన్నతఁ దగుఁ బి
ల్లలడెంద ; మందుఁ బొరపను
మలిన పదార్థంబు సొరదు మాతలకు వలెన్. ౩౬

క. జననీ జనకుల యానతి
యనవశ్యము పిల్లవాని ; కఖిలంబాక
ర్షణ యంత్రమై పొలుచు ; మును
వెనుకలఁ గన కతఁడు దాని వెంబడిఁ బోవున్. ౩౭

క. గొడుగులు పట్టెను దరువులు ;
పుడమి పయిం గప్పికొనియెఁ బుప్పొడి ; చల్లం
బడె వాతావరణము ; రా
కొడుకులు ముప్వురికి నడవిఁ గొల్వరులు వలెన్. ౩౮

మ. చని వారవ్వనమందు నొక్కెడఁ దరుచ్ఛాయన్ సమాసీనులై
తనుకం దప్పి కనీయసుండయిన భ్రాతం గాంచి జ్యేష్ఠుండు వ
ల్కున్ "నిగో ! చూడుమి ! యీ సమీపముననే కోనేరొకం డుండిన
ట్లనుమానింతు సుగంధి శీతల సమీరాంకూర పారంపరిన్. ౩౯

క. కడుపారఁ గ్రోలి నీవటఁ
గడంకమెయిఁ దెమ్ము ! మాకుఁ గమలదళపుటిన్
జడ"మన సోదరు మాటం
దడాగ మున్నట్టి దెసకుఁ దమ్ముఁడు సనియెన్. ४०

చ. చని కనెఁ జెర్వొకండు సరసన్ వనదేవత చేతియద్దమో ?
యనఁగ వసుంధరాయువతి స్వచ్ఛతరంబు కపోలబింబమో ?
యనఁ గడు నేత్రపేయము, నిరంతరవారిశకుంత కంఠ ని
స్వనముల శ్రోత్రపేయమును, జారిమచేఁ గడుఁ జిత్తపేయమున్. ४౧

క. కని చిఱుత యలల చేతులఁ
దను రమ్మని పిలిచినట్లు తలఁపింపఁగ మె
ల్లన మెట్టులు దిగి సలిలం
బును గ్రోల సమీపమునకుఁ బోవుచునుండన్. ४౨

శా. "ఓరీ డింభక ! నీ వెవండవుర ? యుద్యోగించితే ? చొచ్చి కా
సారంబుం జలమానఁ ; జూడుము మదాజ్ఞంగాక యిద్దానిలో
నేరుం డిగ్గరు ; నాదు ప్రశ్నకు జవాబీకుండ నీర్గ్రోలితే
దూరంబౌదువు తావకీనమగు బంధుశ్రేణికిన్ నమ్మమీ !" ४३

క. అనురూక్షమైన కంఠ
ధ్వని వినఁబడ, దిగక నాల్గువైపులఁ గాంచం
గనఁబడెను వారి మధ్యం
బున వెలువడి తన్నుడాయు భూత మతనికిన్. ४४

ఆ. వె. అతనిఁ దఱిసి భూత మడిగె "నో బాలక !
మోక్షమన్న నేమి ? పొందుటెట్లు ?
ఇలను దీనిఁ గూర్చి కల మతభేదముల్
తృప్తిగలుగునట్లు తెలుపు నాకు." ४౫

క. అది విని వాఁ డిట్లనె; "నేఁ
జదువంగా లేద యిట్టి చదువును ; వినలే
దిదివఱకు నిట్టి ప్రశ్నను;
నెదఁ దాఁకఁగలేదు నాకు నిట్టిది" యనుడున్. ౪౬

ఆ. వె. ఆ పిశాచ మతని హరియించి కొంపోయి
దాఁచె నీటియందుఁ దనదు టెంకిఁ:
దిరిగిరామి నితఁడు దిగులొంది యగ్రజుం
డంపఁగాఁ గనిష్ఠుఁ డరిగె వెదుక. ౪౭

క. తన యన్న యడుగుజాడలఁ
జని కొలఁకును డాసెఁ; ద్రావ సాఁగఁగ జలముల్
వినఁబడెను రూక్షకంఠ
ధ్వని యొండు యథాపురంబు తద్భ్రీత కటుల్. ౪౮

ఆ. వె. ఆ పిసాసి వచ్చి యడిగె ముందటి ప్రశ్నఁ
దెల్లవోయి వాఁడు దెసలు చూచె;
రెక్కవట్టి వాని లాక్కొని కొంపోయెఁ
గొలనిలోసి నీటి కొట్టిడికిని. ౪౯

ఆ. వె. తడవు పెద్దయయ్యెఁ దమ్ము లిర్వురు రారు
చూచి చూచి కనులు వాచిపోయె;
బలువిధముల మనసు కలవరపాటొందె;
బయలువెడలె నన్న వారి వెదుక. ౫౦

ఉ. తమ్ముల పాదముద్రలఁ బదమ్ములు వెట్టుచుఁబోయి యా తటా
కమ్మును డాసి యెయ్యెడలఁ గానక వారలఁ బేరువెట్టి హ
స్తమ్ములఁ దట్టి పిల్చియు నతండు సమాధినిఁ బొంద కర్షాకృ
త్యమ్మెదఁ దోఁప కెత్తదగ యాన జలంబుల దిగ్గఁబోవఁగన్. ౫౧

థా గుచ్ఛము

క. వినిపించె యథాపూర్వము
ధ్వని; తోడ్తో నా పిసాసి తగ జలమధ్యం
బును వెడలి కానిపించుచు
వెనుకటి చందమునఁ బ్రశ్నవేసెను వానిన్. ౫౨

చ. విని కని "నా సహోదరుల వీఁడె కటా! తన పొట్టఁ బెట్టెనో?
యనుచితముం బొనర్చితిని; నాదిని నేనయి వచ్చియున్నచో
వినను గదా! దురంతమగు వీరి యుదంతము; దుర్జనుండ; ని
ర్ఘృణుఁడ; నితాంత నింద్యుఁడ; నికృష్టుఁడఁ; గష్టుఁడ; వేయు నేటికిన్. ౫౩

క. కానిమ్ము వీరితో పా
టేనుం బలినౌదుఁ గాత నీతనికి సమా
ధానం బీయక; వీరలు
లేని మదీయమగు బ్రదుకు లేనట్లైకదా!" ౫౪

చ. అనుకొని వానిఁ గాంచి యిటులాడె "గతించిరి నాదు సోదరుల్;
క్షణమయినన్ మనం దలఁపఁ; జంపుము నన్నును; నీదు ప్రశ్నకున్
వినిచితినా సదుత్తరముఁ బీఁచమణంపవుగాదె! కావునన్
వినుప నెఱింగియున్న"నని వేగ జలంబులఁ ద్రావె వింతగన్. ౫౫

క. పరికించి పిశాచం బను
"నెఱిఁగితి వుత్తరము గాన నెట్లును జిదుమన్;
బిఱుదివియక నా కిమ్ము
త్తర; మాపైఁ దెలియు నీకుఁ దమ్ముల కతయున్." ౫౬

క. అనవుడుఁ దమ్ముల కత దెలి
యును గద! యని యలరి పెద్దయును బలికె నిటుల్
"వినవోయి! భద్ర! మోక్షం
బును గూర్చిన నీదు ప్రశ్నమునకు సమాధిన్. ౫౭




క. ఇలఁ గల వింతలఁ గూఱిచి
తెలియంగా నడుగుఁగాని తెలిసికొనంగాఁ
దలఁపఁడు కృతాంతపురి విం
తలఁ గూఱిచి మానవులశతంబున నొకఁడుఁ. ౫౮

ఆ. వె. జను లనాదియైన సంసారబద్ధులై
పొందుచుండ్రు దుఃఖమును సతంబు ;
మోక్షమనఁగ బంధముక్తియ ; దాని సా
ధనముఁ దత్స్వరూపమును వివిధము. ౫౯

చ. పురుషుని సన్నిధిం బ్రకృతి పొంది వికార, మకర్త నిష్క్రియుఁ
వెఱఁగుగ వానిఁ గర్త ననిపించును ; దానను బద్ధుఁడౌను సం
సరణమునం; దెఱింగి సువిచారముచే నిజదోష, మొందు నా
పురుషుఁడు గేవలత్వ ; మిదె మోక్షమటందురు సాంఖ్యకోవిదుల్. ౬౦

క. మహియం దా పురుషుని బం
ధహేతువయినట్టి క్లేశతతి యోగముచే
త హరింపఁబడు నటంచును
మహాత్ము లన్నారు దివ్యమౌనులు తొలుతఁ. ౬౧

క. పురుషుని దుఃఖనివృత్తియె
ధర మోక్ష; మది సుఖదుఃఖధర్మం బొకఁడే
నెఱుఁగని పాషాణ స్థితి;
పొరి షోడశతత్త్వబోధమున నది వడయుఁ. ౬౨

క. గురుకృతబోధఁ జరించుచుఁ
బురుషుండు నివృత్తిధర్మము, నుపాసింపం
గరుణించి మోక్ష మిడు నీ
శ్వరుఁ డని వచియించె నక్షపాదుఁడు వింటే ? ౬౩

గీ. చిత్తమందు ఫలంబుఁ గాంక్షింపఁబోక
యాచరించిన వేదోక్తమైన కర్మఁ
దగ నపూర్వంబు పుట్టు; నద్దాన జీవి
బంధము నశించునని కర్మవాది పలికె. ౬౪

ఆ. వె. కర్మఁ జిత్తశుద్ధి గలుగు: దానను జ్ఞాన
మడరు; బంధ ముక్తి యగును దాన;
బంధ ముక్తితోన బ్రహ్మైక్య భావంబుఁ
బడయు జీవుఁ డనును బ్రహ్మవాది. ౬౫

ఉ. జీవుఁడు కర్మ బద్ధుఁడయి చెందుఁ బ్రపంచమునందుఁ బుట్టువుల్
చావులుఁ బెక్కు; బంధమన సంతత దుఃఖము; జీవుఁ డొందు సౌ
ఖ్యావళి దుఃఖ మిశ్రితము; యాతని లక్ష్యము దుఃఖనాశమే;
కావున వాని శాశ్వతసుఖంబె యటందురు మోక్ష మీబుధుల్. ౬౬

చ. సకలజగన్నియంతగను సాంఖ్యమువల్కుఁ బ్రధానమున్; నియా
మకతనుగూర్చి యీశ్వరుని మాటయు నెత్తదు; కర్మఁ దక్క యా
జ్ఞికమత మీశ్వర స్థితి వచింపద; యున్నను లేనివాఁడె యౌ
గికమతమం దతండు; పరికించును దర్కము వానిఁ గర్తగన్. ౬౭

క. ప్రకటింత్రా యీశ్వరుఁడే
యకర్తయు నభోక్త బ్రహ్మ; మాతండె జగ
త్సకలోపాదాన నిమి
త్తకారణము లంచు బ్రహ్మతత్త్వ వివేకుల్. ౬౮

మ. జనియించున్ నశియించు స్వప్రకృతిచే సర్వప్రపంచంబు; ప్రా
గ్జనిలే; దైహికసౌఖ్య దుఃఖములె స్వర్గంబన్నఁ బెన్నారకం
బనిన్; లేఁడు మహీశ్వరుండు వెలిగా నన్యేశ్వరుం డెందు; జీ
వునికిన్ లక్ష్యము లర్థకామములె; తెల్పున్ నాస్తికుం డీ గతిన్. ౬౯

క. మరణమె మోక్షంబని కొం
దఱు; భావనల నగు వాసనాక్షయమని కొం
దఱు; సతతోర్ధ్వగతి యటం
దురు కొందఱు; కొందఱెదో ! యెదో యంద్రు భువిన్. ౨౦

శా. కాలం బీ గతి దీర్ఘచర్చల వృథాగాఁబుచ్చుకన్నం జనం
బాలంబింప నహింస, సత్యమును, శౌచాస్తేయ నిగ్రహముల్
మేలుం బొందును; వాసనాక్షయమొ ? బ్రహ్మీభావమో ? యేదో ? ని
ర్మూలంబౌ నిహదుఃఖమెల్ల; నిదె నా ముఖ్యాశయంబౌఁ జుమీ !" ౨౧

క. అని పలుకఁ బిశాచం బి
ట్లనె; సంతోసపడితి; నీదు ననుజులయం దొ
క్కని నిత్తు నెవఁడు కావలె ?
నన నతఁడు 'కనిష్ఠు నిమ్మ' టని ప్రార్థించెన్. ౨౨

చ. అనవుడు నా పిశాచమను; "నక్కట ! నీదు సహోదరుం ద్వితీ
యుని విడి నీ విమాతృతనయున్ వరియించితి వేల ?" యన్నఁ బ
ల్కెను "దగునోయి ! స్వీయపరకీయవిభేదము ? వీఁడు దల్లిఁదం
డ్రిని విడి నమ్మి నన్ననుసరించెఁ; గృతఘ్నుఁడఁ గాను వీడఁగన్." ౨౩

క. అన వానియుదారతకును
మనసున హర్షించి నిమిషమాత్రముననె యా
తని తమ్ముల నిర్వురినిం
గొనితెచ్చి పిశాచ మొసఁగి గొనబుగఁ బలికెన్. ౨౪

మ. "విను ! వాస్తోష్పతి నేను; నిన్నునువలెం బృచ్ఛించితిన్ గీష్పతిన్
మును మోక్షంబునుగూర్చి, తృప్తిగ జవాబుం జెప్పమిన్ నవ్వితిన్;
నను శాపించి యిటుల్ మనం, గృప ననెన్ నా దైన్యముం గాంచి "మో
చనముం బొందెదు నాకు నేర్చుకొని తజ్ఞానంబు బోధించినన్." ౨౫

గీ. బంధమోక్ష విధము భవదుక్తమును వింటి;
శాపమోక్షమగును క్షణములోన;
నీ ఋణంబుఁ దీర్పనేరను నిజముగా
స్వర్గరాజ్యరమ నొసంగియేని. ౨౬

క. త్వరపడుచుంటిని వాక్పతిఁ
దఱిసియుఁ దూచాలు విడక త్వదుదితమెల్లన్
గఱపి నికృష్టంబగు నీ
శరీరముం బాసి తొఁటిచందమునొందన్." ౨౭

చ. అని వచియించి వెండియును నాడెఁ బిశాచము "మిమ్ముఁ బంపి మీ
జనకుఁడు చింతఁ జిక్కి కడుశల్యముగానయి మంచ మెక్కఁగా
వెనుకకు మిమ్ముఁ దేర ననిపెన్ భటులన్ జనయిత్రి; వారితోఁ
జని పితృ సేవ సేయుచును జన్మము ధన్య మొనర్చుకోఁ దగున్. ౨౮

క. యువరాజత్వముఁ బొందం
దవు మీలో నగ్రజుండె; తప్పకతండే
భువి నేలును; దమ్ములు బా
హువులనఁ దోడ్పడగ"నంచు నొగి దివి కెగిరెన్. ౨౯

ఆ. వె. ఆ పిశాచరూపుఁడగు పురందరుని యా
శీర్బలంబు చేత జ్యేష్ఠసుతుఁడు
యౌవరాజ్యమొంది యాపయి రాజయ్యె;
నర్హుఁడొందకున్నె యర్హపదము ? ౩౦



# శుద్ధిపత్రము

| పుట | అసాధువు | సాధువు |
| --- | --- | --- |
| 23 | సాహాయ్యకంబు | సాహాయకంబు |
| 24 | ఆమౌని న | ఆమౌని య |
| 44 | కాఁపురము | దాఁపురము |
| 46 | కుయి | కుంయి |
| 47 | వేయఁ జూచుచున్ | వేయుఁ జూచుచున్ |
| 47 | పర | వర |
| 105 | చౌఱఁగ | చౌరఁగ |
| 115 | గురువులు | గురువుల |
| 121 | యనిత్యతయెవోలె | యనిత్యతయె మాతవోరె |
| 123 | దుంఖ | దుఃఖ |
| 173 | తెలయ | తెలియ |
| 206 | కడడె | కడఁచె |
| 219 | క్షుత్పిపాసార్తియై | క్షుత్పిపాసార్తిమై |
| 223 | రధంబు | ధనంబు |
| 223 | రచటికి | రిచటికి |
| 224 | బొక్క | చొక్క |
| 232 | వాచంయమి | వాచంయమ |
| 234 | వెలవెర్ | వెలలెన్ |
| 283 | తజ్ఞానము | తద్జ్ఞానము |



# ఏతత్కవి కావ్యప్రశంస

## శ్రీ వేదాల తిరువేంగళాచార్యులుగారు

"మీ గ్రంథముపై నా పడిన యభిప్రాయ మున్నదున్నట్లుగా వ్రాయుచున్నాను. "సౌష్ఠ వౌదార్య విశేష శోభినీం" అన్న భారవి వాక్యము మీకావ్యములం దంతటను సమన్వయించును. ధారాశుద్ధియు సమయోచితముగా నాంధ్ర జాతీయముల నసువు పఱచుటయు నే నెక్కువగా మెచ్చు కొందును. అది మీయందు, అందును "ద్వంద్వ యుద్ధమున" నెక్కువగా నామనసునకు నచ్చినది. రసస్ఫూర్తియు, అందుఁ జాల ముద్దుగా సమకూరినది. జాతక కథలకన్న ద్వంద్వయుద్ధ మెక్కుడు మంచిపాకమునఁ బడినదని నా తలంపు. ఏమనఁగా వీర ద్వంద్వము పరస్పరాభిముఖ్యమొంది మాటలాడు మాటలు నన్ను మఱపించినవి. అది యటుండ అక్కడి సౌప్రాహు విలాపమును, రుస్తుమొనర్చిన మూక శోకానుభావమును నన్నేడ్పించినవి. నాకప్పుడు ఎంత యాపుకొన్నను నాఁగక కనుల నీరు గాఱఁజొచ్చినది. నేను జదువునప్పు డక్కడనున్న వనితాజన మదియేమని రిచ్చవడి మాటిమాటికి అడుగ జొచ్చిరి. నా మనసులోనే నేను చదువుకొనుచుంటవలన వారీ దుఃఖము గ్రంథ పఠనము వలననని గ్రహింపజాలక ఏమేమని ఆతురతతో నడిగి అసలు సంగతి తెలిసిన తరువాత నన్ను గేలిచేసిరి. కాని వారుగూడా దానిని చదివి అట్టి యవస్థను దప్పించుకొన లేక పోయిరి. అంతట వారీ గ్రంథమును సమగ్రముగా చదువుకొనుటకై తీసికొనిపోయిరి. కీర సందేశము రుక్మిణీ కల్యాణ సందర్భముగల దగుటచే వనితాజన మెక్కువగా దానియందను రక్తమై క్రొత్త పద్ధతివలన నెక్కువగా మోద విస్మయముల ననుభవించినది. కథయందుఁగల ప్రగమన శీలతయు, ఈడికలేకుండ నుండుటయు, విశిష్ట భావసందర్భములఁ జక్కగాఁ బోషించి యటఁ దగినంత విస్తరించుటయు నావంటి చాలమందికి సంతృప్తి గొల్పినవి. నిర్మాణ నైపుణి యనదగిన యివి చాలమందియం దిప్పుడు గన్పట్టుటలేదు. వీని నిచ్చట ననుభవించి నేను చాల సంతృప్తుఁడనైతిని. సర్వదా మీ కవితా స్రవంతి విషయమున నేను సంతృప్తుఁడను.

22.12-39

## కీ. శే. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు

ఆర్యా ! వందనములు. చాల జాగుచేసితిని. క్షమింపుఁడు. మీ "జాతక కథా గుచ్ఛము" చదివి ప్రతిపద్యము పరమానందముతోఁ బరిశీలించుచు చక్కెర కడ్డీ ఆస్వాదించినట్లు ఆస్వాదించి తనిసితిని. మీశయ్య జిగిబిగి గలది. శబ్ద ప్రయోగమున మీకు మంచి చాతురి గలదు. దుడుకు, ఒడుదుడుకు, ఎడపెడల కూఁగు, వడి, మెల్పు, తెల్గుపొల్పు, సారళ్యము చల్లన మీ రచనములో దైవారినది. సత్కావ్య రచనకు మీరు శక్తులయినందుకుఁ దగ్గవస్తువు జాతక కథావళి. పరమ పవిత్రమయిన కథావస్తువు గౌరవమును మీరు కాపాడితిరి.

బుద్ధదేవుఁడు, జీసస్, టాల్‌స్టాయి ప్రభృతుల ననుసరించి మీబోంట్లు రచనలు వెల యింతురుగాకని, కన్నులతో నద్దుకొని జనులు వానిని గౌరవింతురని నా యపేక్ష. చిరంజీవులై మీరు సత్కావ్య రచన సాగింతురుగాక. 8-2-40

# ఏతత్కవి కావ్యప్రశంస

## శ్రీ వేదాల తిరువేంగళాచార్యులుగారు

"మీ గ్రంథముపై నా పడిన యభిప్రాయ మున్నదున్నట్లుగా వ్రాయుచున్నాను. "సౌష్ఠవౌదార్య విశేష శోభినీం" అన్న భారవి వాక్యము మీకావ్యములం దంతటను సమన్వయించును. ధారాశుద్ధియు సమయోచితముగా నాంధ్ర జాతీయముల ననువు పఱచుటయు నే నెక్కువగా మెచ్చుకొందును. అది మీయందు, అందును "ద్వంద్వ యుద్ధమున" నెక్కువగా నామనసునకు నచ్చినది. రసస్ఫూర్తియు, అందుఁ జాల ముద్దుగా సమకూరినది. జాతక కథలకన్న ద్వంద్వయుద్ధ మెక్కుడు మంచిపాకమునఁ బడినదని నా తలంపు. ఏమనఁగా వీర ద్వంద్వము పరస్పరాభిముఖ్యమొంది మాటలాడు మాటలు నన్ను మఱపించినవి. అది యటుండ అక్కడి సౌప్రాహబు విలాపమును, రుస్తుమొనర్చిన మూక శోకానుభావమును నన్నేడ్పించినవి. నాకప్పుడు ఎంత యాపుకొన్నను నాఁగక కనుల నీరు గాఱఁజొచ్చినది. నేను జదువునప్పు డక్కడనున్న వనితాజన మదియేమని రిచ్చవడి మాటిమాటికి అడుగ జొచ్చిరి. నా మనసులోనే నేను చదుపుకొనుచుంటవలన వారీ దుఃఖము గ్రంథ పఠనము వలనని గ్రహింపజాలక ఏమేమని ఆతురతతో నడిగి అసలు సంగతి తెలిసిన తరువాత నన్ను గేలిచేసిరి. కాని వారుగూడా దానిని చదివి అట్టి యవస్థను దప్పించుకొనలేక పోయిరి. అంతట వారీ గ్రంథమును సమగ్రముగా చదువుకొనుటకై తీసికొనిపోయిరి. కీర సందేశము రుక్మిణీ కల్యాణ సందర్భముగల దగుటచే వనితాజన మెక్కువగా దానియందను రక్తమై క్రొత్త పద్ధతివలన నెక్కువగా మోద విస్మయముల ననుభవించినది. కథయందుఁగల ప్రగమన శీలతయు, ఈడికలేకుండ నుండుటయు, విశిష్ట భావసందర్భములఁ జక్కగాఁ బోషించి యటఁ దగినంత విస్తరించుటయు నావంటి చాలమందికి సంతృప్తి గొల్పినవి. నిర్మాణ నైపుణి యనదగిన యివి చాలమందియం దిప్పుడు గన్పట్టుటలేదు. వీని నిచ్చట ననుభవించి నేను చాల సంతృప్తుఁడనైతిని. సర్వదా మీ కవితా స్రవంతి విషయమున నేను సంతృప్తుఁడను.

22.12-39

## కీ. శే. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు

ఆర్యా ! వందనములు. చాల జాగుచేసితిని. క్షమింపుఁడు. మీ "జాతక కథా గుచ్ఛము" చదివి ప్రతిపద్యము పరమానందముతోఁ బరిశీలించుచు చక్కెర కడ్డీ ఆస్వాదించినట్లు ఆస్వాదించి తనిసితిని. మీశయ్య జిగిబిగి గలది. శబ్ద ప్రయోగమున మీకు మంచి చాతురి గలదు. దుడుకు, ఒడుదుడుకు, ఎడపెడల కూఁగు, వడి, మెల్పు, తెల్లుపొల్పు, సారళ్యము చల్లన మీ రచనములో దైవారినది. సత్కావ్య రచనకు మీరు శక్తులయినందుకుఁ దగ్గవస్తువు జాతక కథావళి. పరమ పవిత్రమయిన కథావస్తువు గౌరవమును మీరు కాపాడితిరి.

బుద్ధదేవుఁడు, జీసస్, టాల్‌స్టాయి ప్రభృతుల ననుసరించి మీబోంట్లు రచనలు వెలయింతురుగాకని, కన్నులతో నద్దుకొని జనులు వానిని గౌరవింతురని నా యపేక్ష. చిరంజీవులై మీరు సత్కావ్య రచన సాగింతురుగాక. 8-2-40